చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారి

# నవలలు

| | | |
|---|---|---|
| చమత్కారమంజరి | 1 వ భాగము | 1 |
| డిటో | 2 వ భాగము | 1 |
| సుధాశరచ్చంద్రం | | 1 |
| రాజస్థానకథావళి | 1 వ భాగము | 1 |
| డిటో | 2 వ భాగము | 1 |
| నానక్ చరిత్ర | | 0 |
| మణిమంజరి | | 0 |
| సువర్ణగుప్తుడు | | 0 |
| నందచరిత్ర | | 0 |
| కర్పూరమంజరి | 1 వ భాగము | 1 |
| డిటో | 2 వ భాగము | 1 |
| నవ్వులగని | 1 వ భాగము | 1 |
| డిటో | 2 వ భాగము | 1 |
| సిద్ధార్థచరిత్ర | | 1 |
| రఘుకులచరిత్ర | | 0 |
| గురుగోవిందచరిత్ర | | 0 |
| గణపతి | 1 వ భాగము | 1 |
| డిటో | 2 వ భాగము | 1 |
| రామచంద్రవిజయము | | 1 |
| రామకృష్ణపరమహంస (లైఫ్ అండ్ టీచింగ్సు | | 1 |
| సౌందర్యతిలక | | 1 |
| అహల్యాబాయి | | 1 |

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

# ఉపోద్ఘాతము

ఆంధ్రమహాశయులారా!

ప్రాచీన కాలమునుండియు భారతదేశమున మతసంబంధమగు వాతావరణములు చెలరేగి, భారతీయులలో మతావేశము ప్రబలుట, నవీనమతము లుద్భవిల్లుట, తత్ప్రచారమనంతముగ జరుగుట, ఫలసిద్ధి నందుట, ఆనుపూర్వికసాంప్రదాయముగ నైనది అందు హైందవులలో సమతావేశము, తత్సంబంధమగు వాఙ్మయాభివృద్ధి విపరీత మగుట ప్రకృతిసిద్ధమైనది. ఆరంభశూరత్వమున కాటపట్టులైన యాంధ్రులలో సమతావేశ సన్నివేశములు ఏనాడో కరుడుగట్టి జీర్ణించి యుండియు, నేటి పాశ్చాత్య విద్యా వ్యామోహంబువలనను, దేశమునం దప్పుడప్పుడు చెలరేగు రాజకీయ సాంఘిక వాతావరణంబువలనను, అన్యదేశీయ సంస్కారణాభిలాషిత్వము వలనను, దేశకాలాదులందు గలుగు విభేదవైశిష్ట్యంబువలనను గొన్నిమార్పులువచ్చినను, నేటికిని ఆంధ్రులు మతాభిమానులని, మతసంస్కర్తలలో నగ్రగణ్యులని పేరు వడసి యున్నారు. పైనవివరించిన కారణంబుల వలన నెన్నిమార్పులు వచ్చినను ఋషిప్రోక్తంబులైన పురాణాదులం దభిమానంబుల నాంధ్రులు విడువక తచ్ఛ్రవణ పఠనాదులను కొద్దియో, గొప్పయో గావించుచునేయున్నారు.

నేటి కాలమున పురాణపఠనశ్రవణాదులకు విలువ తగ్గినదనువారు కొందరు లేకపోలేదు. వారు కేవలము కుతీం భరత్వమునకుగాను పాశ్చాత్యవిద్యాభిలాషులైన నొకతెగ

వారు సూత్రముగ జేయుచున్నారు. ఏనాఁడైనను మనదేశమున మతభంగము వాటిల్లినపు డేమహాపురుషుఁడో పుట్టి దాని నుద్ధృతము గావించి పరిష్కరించుచునే యున్నారు. అట్టి వారేగదా శ్రీ శంకర భగవత్పాదాచార్యాది మతత్రయ కర్తలు. వారి యుద్బోధనాదికములవలననే గదా మన మత జీవన మింకను నిలచి యున్నది. మతసంస్కరణమునకు మతకర్తలేలాటిదోహదకులో గ్రంథప్రచురణ కర్తలును, గ్రంథకర్తలును నట్టి దోహదకులే. కాని వారి యుద్బోధనా శక్తికిని, వీరి ప్రచారణాసక్తిని వ్యవస్థాభేదము మాత్రము న్నది. గ్రంథప్రచురణము మతాభిలాషిత్వమునకు కట్టుకట్టగా నుండుననునది ప్రకృతి విరుద్ధముగాదు.

ప్రస్తుత మట్టియుద్దేశంబుతోనే సమస్తమతగ్రంథము లతోబాటు సంస్కృతభాషయందు నిమిడియుండి జనబాహుళ్య మునకందిరాక యున్న పురాణములను వచనరూపమున బ్రచురించు సముద్యమము ప్రచురణకర్తలకుఁ గల్గి నన్ను ప్రోత్సహించుట వలన నీస్కాంద పురాణాంతర్గతముగనున్న 'కార్తీక మాహాత్మ్యము' నకు ఆంధ్రతాత్పర్యము వ్రాయు నవకాశము లభించినది. ఇందు ముఖ్యముగా జనసామాన్య మున కుపకరించు నితిహాసములేగాక నాముష్మికసిద్ధి నిచ్చు సూక్తులుగూడ గలవు. దీని నాంధ్రులు మన్నించి ప్రచురణ కర్తలకు చేయూత నొసంగుదురనియు, ఇతోధిక శ్రేయ మాంధ్రు లాశింతురనియు ప్రార్థించుచున్నాను.

ఇట్లు,

వ్యాఖ్యాత.

18 అ సత్కర్మానుష్ఠాన ఫల ప్రభావము
19 అ చాతుర్మాస్యవ్రత ప్రభావము
20 అ పురంజయుడు దురాచారుడగుట
21 అ సుశీలుడు పురంజయునకు కార్తీకవ్రత ప్రభావము చెప్పుట
22 అ పురంజయుడు చాతుర్మాస్యవ్రత మొనర్చుట
23 అ పురంజయుడు ముక్తినందుట
24 అ అంబరీషుడు ద్వాదశీవ్రతము జేయుట
25 అ దూర్వాసు డంబరీషుని శపించుట
26 అ దూర్వాసుడు శ్రీహరిని శరణువేడుట
27 అ దూర్వాసు డంబరీషునే శరణువేడుట
28 అ అంబరీషుని కోరికప్రకారము విష్ణుచక్రము దూర్వాసుని మన్నించి విడుచుట
29 అ అంబరీషుడు దూర్వాసుని పూజించుట
30 అ ఫలస్తుతి

శ్రీరస్తు

# కార్తీకమాహాత్మ్యము

## శ్రీస్కాందపురాణే కార్తీకమాహాత్మ్యే

## ప్రథమోఽధ్యాయః

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం,
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే
అభీప్సితార్థసిద్ధ్యర్థం పూజితో యస్సురైరపి.
సర్వవిఘ్నచ్ఛిదే తస్మై గణాధిపతయే నమః 1

యా కుందేందుతుషారహారధవళా యా శుభ్రవస్త్రావృతా
యా వీణావరదండమండితకరా యా శ్వేతపద్మాసనా,
యా బ్రహ్మాచ్యుతశంకరప్రభృతిభిర్దేవైస్సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా 2

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః,
గురుస్సాక్షాత్పరంబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః 3

జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిం,
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే. 4

ఋషయ ఊచుః—

వసిష్ఠేన విదేహాయ కథితం బ్రూహి నో మునే.
శ్రోతుకామా వయం త్వత్తః కార్తికోత్తమముత్తమమ్.

[illegible] సకల [illegible] [illegible] [illegible] [illegible] [illegible] పాపములు [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] పుణ్యమును [illegible] [illegible]దురు. [illegible] [illegible] [illegible] [illegible] [illegible] శ్రద్ధగా పాలింపుము.

[illegible] దినకరే కార్తికే మాసి యో నరః।
స్నానం దానం [illegible] [illegible] సుశుద్ధమానసః 19
త దక్షయ్యఫలం ప్రాహు [illegible] నరేశ్వర।
సంక్రమాత్ సమారభ్య మాస మేకం నిరంతరమ్ ॥ 20
మాసస్య ప్రతిపద్యాం వా ప్రారభే కార్తికవ్రతమ్।
నిర్విఘ్నం కురు మే దేవ దామోదర నమోఽస్తు తే 21
ఇతి సంకల్ప్య విధివత్ ప్రాతఃస్నానం సమాచరేత్।

ఓ జనకమహారాజా! ఏ మనుష్యుడైనను తులారాశియందు సూర్యుడుండగా కార్తీకమాసమందు సూర్యోదయ కాలమునకు లేచి కాలకృత్యంబుల నిర్వర్తించి, నదీస్నాన మొనరించి, దానము, దేవపూజ, తీర్థవిధి మొదలగు మంచికార్యములను జేసినచో [illegible] ఫలంబు సంప్రాప్తించునని యందురు. సూర్యుడు తులారాశియందు ప్రవేశించిన నాటినుండిగాని, కార్తీకమాసారంభదినమగు శుద్ధపాడ్యమి మొదలుకొనిగాని వ్రతారంభమును చేయవలయును. అట్లు ప్రారంభించు సమయమున 'ఓ, కార్తీకదామోదరా! నీకు వందనములు. నాచే నారంభింపబడు కార్తీకవ్రతంబును విఘ్నము లేకుండ జరుగునట్లు చేయుము' అని పిమ్మట స్నానము చేయవలెను.

మార్తాండోదయవేళాయాం కార్తిక్యాం కారయేన్నృప 22
కావేర్యాం కార్తికే మాసి నదీస్నానం విశిష్యతే।
తులారాశిం గతే సూర్యే గంగా త్రైలోక్యపావనీ॥ 23
సర్వత్ర ద్రవరూపేణ సా సంపూర్ణా భవేత్తదా।

యస్మిన్నాస్తే హృషీకేశ స్తులాయాం గోష్పదోదకే 24
తటాకకూపకుల్యాసు నిత్యం సన్నిహితో హరిః ।
నృపైషాం చ తదాచారో వర్ణినాం కార్తికే తథా 25
గంగాం సత్వా శనై ర్విప్రో సమస్కృత్య హరిం స్మరన్।
ప్రక్షాళ్య పాదౌ హస్తౌ చ ఆచమ్య ప్రయత స్సుధీః ॥26
అతిశుద్ధేన మంత్రేణ చానుజ్ఞాతోఽన భైరవాన్ ।
కటిప్రమాణ ముదకం గత్వా స్నానం సమాచరేత్।
దేవాన్పితౄ నృషీన్భక్త్యా తర్పయిత్వా యథావిధి
తత్రాఘమర్షణం కుర్యాద్భక్తిభావేన కేశవ ॥ 28
జానన్నాలోడ్య తత్తోయ మంగుష్ఠాగ్రేణ భూమివ ।
పశ్చాత్తీర మనుప్రాప్య కుర్యాత్తత్రోదకాంజలిమ్॥ 29
నిష్పీడ్య ధృతవస్త్రం తు ద్వి రాచమ్య తతో నృప।
నకుర్యా దార్ద్రవస్త్రేణ శిరసోద్వర్తనం సదా ॥ 30
ధారయే ద్ధౌతవస్త్రం తు నారాయణ మనుస్మరన్ ।
తతోర్ధ్వపుండ్రకాన్ ధృత్వా గోపీచందనతో ద్విజః 31
సంధ్యా ముపాస్య విధివ ద్గాయత్రీజప మాచరేత్ ।
తతశ్చాగ్ని మనుక్రమ్య హుత్వా చౌపాసనం శుభమ్॥
బ్రహ్మయజ్ఞం తతః కృత్వా దేవపూజాం సమాచరేత్ ।
ఆహృత్య పూజాపుష్పాణి స్వారామోద్భవనాని చ॥ 33
షోడశై రుపచారైశ్చ సాలగ్రామ నివాసినమ్ ।
శంఖచక్రధరం దేవం భక్తిభావేన చార్చయేత్। 34
తతః పురాణపఠనం శ్రుత్వా భక్తిసమన్వితః ।
గృహంగత్వా హరిం పూజ్య వైశ్వదేవ మతః పరమ్॥35

భుక్త్వా వాంనే ద్విః రాజసస్య హరానుగ్రహణం పునః ।
దినాంతే సర్వకర్మాణి సమాప్య విధివన్నృప ॥ 36
ప్రదోషసమయే రాజన్ విష్ణోర్వా శంకరస్య చ।
యథాశక్త్యనుసారేణ దీపప్రజ్వాలనం శుభమ్ ॥ 37
భక్ష్యభోజ్యాదిభిస్సమ్యగర్చయేచ్చ త్వనశ్చలమ్ ।
వాచా స్తోత్రం చ తద్విష్ణోః శైవం వా వాగ్యతశ్శుచిః
జప్త్వా తద్ధ్యాననిరతః నమస్కారం తతః క్రమాత్ ।
ఏవం యః కార్తికేమాసి కురుతే భక్తిమాన్సుధీః 39
న యాతి వైష్ణవం ధామ పునరావృత్తివర్జితమ్।
ఇహ జన్మని యత్పాపం తత్పాపం పూర్వజన్మని॥ 40
తత్పాపం విలయం యాతి కార్తికవ్రత ముత్తమమ్ ।
బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్రశ్చైవ తపోధన॥
స్త్రియో వా భక్తిభావేన కార్తికోక్తం చరేద్యది।
తేయాంతి వైష్ణవం లోకం పునరావృత్తివర్జితమ్॥ 42
కార్తికే ధర్మనిరతం దృష్ట్వా మోదతి యః పుమాన్।
తద్దినాఘనివృత్తిస్స్యాత్ నాత్ర కార్యా విచారణా॥ 43

ఆవిధమున జీవనదికిబోయి గంగకును, శ్రీమన్నారాయణునకును, భైరవునకును నమస్కరించి భైరవాజ్ఞను తలదాల్చి మొలలోతు నీటిలో నిలువబడి మొదట సంకల్పమును జెప్పికొని సూక్తములను జదివి, మార్జన మంత్రముతోడను, అఘమర్షణమంత్రముతోడను, గంగోదకమును శిరస్సున జల్లుకొని అఘమర్షణస్నాన మాచరింపవలెను. పిదప సూర్యున కర్ఘ్యప్రదాన మొసంగి దేవతలకును, ఋషులకును, పితృదేవతలకును క్రమప్రకారముగ తర్పణంబు లొనర్పవలెను. అపుడది సుస్నానమగును. స్నానము చేసిన పిమ్మట నదీతీరముం జేరి మూడుదోసిళ్ళనీరు గట్టుపైన పోయవలెను. కార్తీకమాసంబున గంగా గోదావరీ కావేరీ తుంగభద్రాదినదులందు స్నాన మొనర్చిన నత్యుత్తమము. గంగానది కార్తీకమాసమునందు నదుల

న్నిటియందు బ్రకాశమానసన్నిహితమై యుండును. శ్రీ ఆదినారాయణుండు గోష్పాదమాత్రప్రదేశమందున్న జలమునందు సన్నిహితుడై యుండునని వేదములు, శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి కావున సముద్రగామియగు నదీ స్నానము మిగుల పవిత్రమైనది. నదీస్నానావకాశము లభింపనిచో కాలువ యందుగాని, చెఱువునందుగాని, కూపముకడగాని సూర్యోదయమున స్నానము చేయవలెను. ఇది బ్రాహ్మ క్షత్రియ వైశ్య శూద్ర స్త్రీపురుషు లకు ముఖ్యము. పిదప నారవేసిన వస్త్రముతో శరీరమును దుడిచికొని, మడిబట్టలను ధరించి ముంగుగ భగవంతుని స్మరింపవలెను తదుపరి భస్మ మును త్రిపుండ్రముగా నుదుట ధరింపవలె. లేక గోపీచందనమునైన నుదుట నూర్ధ్వపుండ్రముగా నుంచుకొనవలెను. అనంతరము సంధ్యావందనము, బ్రహ్మయజ్ఞమును ముగించి, నిత్యాగ్నిహోత్రమును గావించుకొని దేవతా ర్చనమును జేయవలెను ఆదేవపూజకు తన యింటిదొడ్డిలోగాని, తోటలో గాని లభించిన పుష్పములనే స్వయముగ తెచ్చి ఉపయోగించుట ప్రధాన ధర్మము. స్నానతీరమునందే కార్తీకపురాణశ్రవణమును గావించుకొని, స్వగృహంబునకుబోయి, అతిథిపూజ, వైశ్వదేవము మొదలగు నిత్యకర్మ లను జేసి, తృప్తిదీర భుజించి, రెండుమారులాచమనము జేసిన శుద్ధుడగును. పిదప పురాణమును స్వయముగా జరుపుటయో, లేక ఇతరులవలన విను టయో చేయవలెను. సూర్యుడ స్తమించు కాలమున సాయంసంధ్యను పూర్తిజేసికొని శివాలయమునగాని, విష్ణ్వాలయమునగాని దీపారాధన జేయవలెను. షోడశోపచార పూజావిధానమున హరిహరులను బూజించి వద్రసోపేతమై, భక్ష్యభోజ్యాదులతోగూడిన నైవేద్యము నిడవలయును. ఆటుపిమ్మట తాంబూలము నొసంగి, చేతులు మోడ్చి మంత్రములచేగాని, స్తోత్ర ములచేగాని, గీతములచేగాని, అష్టపదులచేగాని హరిహరులను నుతిచేయ వలయును. ఈరీతిగా కార్తీకశుద్ధప్రతిపత్తు మొదలు అమవస తుదివఱకు నెలదినములను చేసినచో కార్తీకవ్రతము సమాప్త మగును. మఱునాడు శక్తి ననుసరించి మృష్టాన్నముతో భూతతృప్తి గావించవలెను. ఇట్లు వ్రతమాచరించిన స్త్రీపురుషులకు ఈజన్మమునందును, పూర్వజన్మమునం దును నొనర్చిన పాపంబులు పటాపంచలై, పవిత్రవంతులై మోక్షార్హు లగుదురు. ఇందు సందియ మించుకయులేదు. మరియు నిట్లు చేయ నవకా

శములేక వారిని గాంచి సంభాషించినను వారితో సమానముగ ఫలితము నందుదురు.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
మొదటి అధ్యాయము.

---

# ద్వితీయో௨ధ్యాయః

శ్రీవసిష్ఠః—

శృణు రాజన్ ప్రవక్ష్యామి మాహాత్మ్యం కార్తికస్య చ॥
కర్మత్రయకృతా త్పాపా న్ముచ్యతే శ్రవణా௨పి।
యః కార్తికే మాసి నృపః సోమవారవ్రతం చరేత్।
సోమశేఖరతుష్ట్యర్థం స యాతి శివమందిరమ్॥ 2
కార్తిక్యాం సోమవారే తు స్నానదానజపాదికమ్।
అశ్వమేధసహస్రాణాం ఫలం ప్రాప్నో త్యసంశయః॥ 3
ఉపవాసం త్వైకభుక్తం నక్తం చాయాచితవ్రతమ్।
స్నానం చ తిలదానం చ షడ్విధం కపయోవిదుః॥ 4
ఉపవాసనమర్థానా ముపవాసో విధీయతే।
అసమర్థ శ్చోపవాసే నక్తభోజన మాచరేత్॥ 5
తదశక్తిస్యతు చ్ఛాయాన క్తభోజన ముచ్యతే।

మరల వసిష్ఠమహర్షి జనకమహారాజుంగాంచి, 'ఓమిథిలాధిపతీ! సక లముల కార్తీకమాసమాహాత్మ్యమును, అందు మిగుల ముఖ్యమగు సోమ

వార వ్రతమహిమను దెల్పుచున్నాను. సావధానుడవై వినుము. కార్తీక మాసమాహాత్మ్యమును వినువారి పాపములు బాయుటయే గాక మిగుల పుణ్యముగూడ లభించును. కార్తీకమాసమున సోమవారమున శివప్రీతికై సోమవారవ్రతము నాచరించినవారికి కైలాసమున శివుని సన్నిధానమున నుండుట ప్రాప్తించును. కార్తీకసోమవారమున పైఅధ్యాయమున వచించిన నదులలో దేనియందైనను స్నానమునుజేసి యథాశక్తిగ దానధర్మముల నాచరించినవారికి, వేయి అశ్వమేధయాగంబులుచేసిన ఫలితము లభించును. సోమవారవ్రతవిధాన మెట్టిదన-—సోమవారమున నదీస్నానమొనర్చి సంపూర్ణముగ నుపవసించి శివున కభిషేక మొనర్చి రాత్రి మొదటియామమున భుజింపవలెను. ఆదినమున నితరులవలన నేపదార్థమును గ్రహింపరాదు. తిలదాన మొనర్చినందువలన పాపములన్నియు నశించును గాన తిలదానమును చేయవలెను. ఇంకను నత్యంత నిష్ఠతోను, భక్తితోను ఆచరింప నవకాశముున్నవారు ఆదినమున రాత్రిగూడ భుజింపక పురాణాది పఠనంబువలన జాగరణ మొనర్చి, మఱునాడు శక్తికొలదిగ బ్రాహ్మణులకు సంతర్పణమును జేసి పిదప భుజింపవలెను. ఈపై రెండును జేయ శక్తిలేనివారు సోమవారమున నపరాహ్ణమువఱకుండి భుజింపవలెను.

తదభావే ద్విజైస్సార్ధం దివాభోజన మేవ వా ॥ 6
యం ధర్మం కార్తికేమాసి నాచరేద్యది యో నరాః।
కుంభీపాకే తు పచ్యంతే రౌరవే తు యుగాష్టకమ్। 7
కార్తికే సోమవారే తు ఉపోష్య గతభర్తృకా।
సమభ్యర్చ్య విధానేన విష్ణుం లోకైక శంకరమ్॥ 8
స్త్రియో వా పురుషో వాఽపి కార్తికే చేందువాసరే।
నక్షత్రమండలం దృష్ట్వా యః కుర్యాన్నక్త భోజనమ్॥ 9
తేషాం పాపాని నశ్యంతి సహస్రా ప్రక్షిప్తతూలవత్।
సోమవారే తు కార్తిక్యాం శివలింగాభిషేచనమ్॥ 10
పూజాం చ పంచనక్తం చ యః కుర్యాత్సంశివప్రదః॥

అదియును జేయశక్తిలేనిచో బ్రాహ్మణులతోగూడ మధ్యాహ్న కాలమున భుజింపవలెను. దానికిని అవకాశములేనప్పు డాదినమున నితరుల నుండి యేదియు గ్రహింపక తన కీశ్వరుడిచ్చినదాని ననుభవించి యాదిన మంతయు శివుని ధ్యానింపుచుండవలయును. కార్తీక సోమవారమున తిల దానము సేయుట సమకూడినను, సమకూడకున్నను, మిగిలిన యేదింటిలో నేదేని యొకదానిని తప్పక నాచరింపవలెను. ఇందేది చేయుటకు శక్తి లేనిచో నదీస్నానమును గావించుకొని భగవంతుని ధ్యానింపవలెను. శక్తియు, అవకాశమును గలిగి యుండియు నీయెనిమిదింటిలో నేయొక దాని నైనను కార్తీకసోమవారమున చేయనివాడు కుంభీపాకంబను నరకమున గూలును. భర్తలేనివితంతువు కార్తీక సోమవారమున నుపవాసముచేసి శివుని ధ్యానించినచో శివలోకవాసము లభించును. విష్ణుధ్యాన మొనర్చిన వైకుంఠవాసము ప్రాప్తించును. సోమవారమున స్త్రీగాని, పురుషుడుగాని నక్షత్రదర్శనమగువఱకు నుపవసించి పిమ్మట భుజించిన వారిపాపములు అగ్నిలోబడిన దూదివలె నాశనమగును. మఱియు నాదినమున శివుని కభి షేకమొనర్చి బిల్వదళంబులచే సహస్రనామార్చనము నొనర్చినను, ఇతరు లచే చేయించినను, శివపంచాక్షరీమంత్రమును జపించినను, వారిని శివు డనుగ్రహించి సర్వసంపదలను, సమస్తశుభంబులను చేకూర్చును.

అత్రైవోదాహరం తీమ మితిహాసం పురాతనమ్ 11
శృణ్వతాం సర్వపాపఘ్నం కర్తౄణా మఘనాశనం।
కాంచి త్కాశ్మీర దేశే తు నామ్నా స్వాతంత్ర్యనిష్ఠురీ 12
రూపయౌవనసంపన్నా సుకేశీ సుష్టు మంగళా।
యాజకన్యా సుతా తన్వీ పుంశ్చలీ బహుభాషిణీ॥ 13
మాతాపితృ పరిత్యక్త్వా శ్వశురాభ్యాం నరేశ్వరం।
పతిస్తాం కర్కశాం దృష్ట్వా ద్విజస్సౌరాష్ట్రసంభవః 14
మిత్రశర్మేతి విఖ్యాతో వేదవేదాంగపారగః।
సదాచార సమాసన్న స్సర్వభూతదయాపరః 15
తీర్థయాత్రారత స్సమ్యక్ సత్యవాదీ సదా శుచిః॥

ఏవంసరోక్త్యోత్తమో విప్ర స్తిష్ఠత స్తాడితో భృశమ్ 16
నగార్హస్థాభిలాషేణ చేతసాఽసౌ న చాత్యజత్।
కదాచి త్కర్కశా క్రుద్ధా పరేషాం రూపతోషిణీ 17
దుర్జనైః ప్రీతిసంయుక్తై ర్వ్యావనోద్బోధితా నృప।
ద్రవ్యై రాభరణై స్సమ్య క్సంతుష్టా దుష్టచారిణీ 18
పతినా ప్రీతియుక్తేన రాత్రౌ శయ్యాం సమాగతా।
పతినిద్రాం సమాజ్ఞాయ శనై రుత్థాయ సా తథా 19
శిలా మాదాయ మహతీతం మస్తకే ప్రక్షిప ద్రుషా।
తేన సోఽపి మమా రాథ కర్కశాంగ హాలసః 20
స్వయ మాదాయ తం వృక్షే శూన్యకూపే వ్యసర్జయత్
బహుభి ర్వ్యావసస్థైః తైః పరస్త్రీసంగలాలసైః॥ 21
కామశాస్త్రకలాపైశ్చ పరిరంభణచుమ్బనైః।
నానాజాతిధరైః పుంభిః వర్ణసంకరకారణైః 22
కరోతి సంగమం నిత్యం సా రతిం పతిఘాతకీ।
పతిభక్తిరతస్త్రీణాం కుట్టనీ పరయోజనీ। 23
ఏకపత్నీవ్రతానాం చ తేషాం రతిపరాఽశుచిః।
పరనిందా పరద్వేషి సర్వదేవపరాఙ్ముఖీ॥ 24
డంభేన వా దయాహీనా పరిహాసేన మాయయా।
న ధ్యాతం విష్ణుపాదాబ్జం న శ్రుతా హరిసత్కథా। 25

దీని కుదాహరణముగ నాచే పెద్దలవలన వినబడిన కథ నొకదానిని నీకు జెప్పుచున్నాను. తొల్లి కాశ్మీరదేశమున నొకవిప్రుండు గలడు. ఆతడు పౌరోహిత్యవృత్తిచే జీవించుచుండెను. ఆవిప్రునకు ఒక పుత్రిక కలదు. ఆమె పేరు సుకేశి. తండ్రి యామెను మిత్రశర్మయను సౌరాష్ట్రి

దేశీయుడను బ్రాహ్మణునకిచ్చి పెండ్లి చేసెను. మిత్రశర్మ నాలుగు వేదము లను వేదాంగము లారింటితోగూడ సమగ్రముగ జదివెను. నిరంతరము సదాచారవర్తనుడుగ నుండువాడు. తీర్థయాత్రాసక్తచిత్తుడు. నిత్య సత్య వాది, బాహ్యాభ్యంతర శుద్ధిగలవాడు. నియమవంతుడు, నప్రతిగ్రహీత. నిజమైన గార్హస్థ్యుడన్నవతనికే చెల్లును. అట్టి సకల సద్గుణ గరిష్ఠుండగు మిత్రశర్మకు భార్యయైన సుకేశినిండుజవ్వనంబుననుండి కామాతిరేకమున కన్నులు గానక వ్యభిచారిణి యయ్యెను. సదా గురుతుల్యులగు నత్తమామ లనుగూడ నిందింపసాగెను. అందుచే తలితండ్రులును, అత్తమామలును గూడ నాదుష్టురాలిని పరిహరించిరి. కాని మిత్రశర్మ మాత్ర మామెయ పూర్వసౌందర్య ప్రవాహమునబడి మున్కలువేయుచు నామెను విడనాడ లేకపోయెను. భర్త తనపై నిరంతరము నిక్కమగు మక్కువనిట్లు చూపు చున్నను, దుష్టచిత్తయు, కఠిన మనస్కయునగు నాకుంట భర్తను సదా దూషించుచుండుటయేగాక కాలక్రమమున కొట్టుటయుగూడ నారంభిం చెను. ఆమె యెట్లు చేసినను భర్త యామెను విడనాడ లేకుండెను. అన్య పురుషాసక్తరాలగు నాజారిణి వారిచ్చిన వస్త్రాలంకారములనుధరించి విఱ్ఱవీగుచు భర్తయందయిష్టురాలై మెలగుచుండెను. ఇట్లుండ నొక నాటిరాత్రి యా కులట మగనితోగూడ నేకశయ్యపై శయనించి అతడు నిద్రించినపిమ్మట శయ్యపైనుండి మెల్లగలేచి యొకగుండ్రాతిని దెచ్చి మగనితలపై విసరెను. అంత నాతడు మరణించెను. ఆమె యితరుల సాయ మక్కరలేకనే మరణించిన భర్తను మోసికొనిపోయి యొకపాడునూతిలో బడవైచెను. మరుసటినాటినుండి యా దుష్టురాలు మఱింతపొగరుబట్టి జాతి మత విచక్షణలేక నానాజాతి పురుషులతో స్వేచ్ఛగా రతిక్రీడలం దేలుచు వర్ణసంకరకారకురాలయ్యెను. ఆమె యంతటితో నూరకొనక కొందఱు కులకాంతలనుజేరి దుర్బోధనలను గావించి పరపురుషులకు దార్చుచుండెను. ధర్మపరాయణులును, సద్వర్తనులును, ఏకపత్నీ వ్రత సులునగు పురుషులను తన వలపుచూపులచేతను, వగవద్దికలచేతను వశపఱచు కొని మోసగింపుచుండెను. మఱియు నామె తన పరిహాసవచనా ధోరణి తోడను, కపటనటనాచాతుర్యముచేతను, మాటలాడంబరములచేతను నసేక యువకులను పరవశులను జేసికొని పలువురిల్లాండ్రను భర్తృసుఖహీనలగ జేసెను. వేయేల? ఆమె పతివ్రతామణులపాలికి బ్రహ్మరాక్షసియూ, పవి

త్రపురుషుల పాలిటికి మృత్యువునైనది. యౌవనపుబింక మెంతకాలమో నిలువదుగదా? కాలమొకరీతి గలదికాదుకదా? సుకేశిని యౌవనకాలమం తయు కుటిలప్రవర్తనముండే నడచెనుగాని యొక్కనాడుగాని ఒక్కమాఱు గాని హరినామస్మరణ చేయదయ్యె. హరికథాశ్రవణమైన నొల్లదయ్యె.

యౌవనాతిక్రమం చాసీజ్జరా చాస్యా ఉపాగతా।
వ్రణవ్యాధి రభూ ద్రాజన్ క్రిమిభిః పూయశోణితాః 26
సర్వే భుజంగా స్తాం భూప రూపయంతో మదాన్వితాః।
తతశ్చ శాకలా రాజన్ వేశ్మ నాయాంతి దుఃఖితా 27
మమార వ్యాధినా దుష్టా పాపాధిక్యా న్నరేశ్వర।
యమదూతా స్తదాజగ్ముః చండహాసభయంకరాః 28
యమస్యాంతికమానీయ తాంయమా యార్పయన్ భటాః
యమస్తాం కోపతామ్రాక్షో శిక్షా మతిభయంకరీమ్॥ 29

ఇంతలో యౌవనము సడలినది. శరీరమున వ్రణములు పుట్టినవి. పురుగులు పట్టినవి. దుర్గంధభూయిష్టమగు చీముకాలువ దేహమంతటను ప్రవహింప మొదలిడినది. యౌవనకాలమున నామె నాదరించి, బహూకరించి అనుభవించిన యొక్కవిటకాడైన తొంగిచూడడయ్యె. వంగివ్రాల డయ్యె. ఆదుష్టురా లట్టివ్రణబాధచే కుమిలికుళ్ళి చచ్చినది. తత్క్షణము యమభటు లాదుర్భగురాలిని గొనిపోయి యముని కట్టెదుట బెట్టిరి. అంత నాపరేతరాజు దానిపాపప్రవర్తనను బరిశీలించి, ఓభటులారా! ఈపి శాచిని గొంపోయి యెఱ్ఱగకాల్చిన ఇనుపముళ్లుకూర్చిన ఉక్కుస్తంభ మున కంటగట్టుడు. దానిని కౌగలించుకొనునట్లు చేయుడని శిక్షవిధించి యాజ్ఞ చేసెను.

అయసా నిర్మితం స్తంభం తప్తం చాతిభయంకరమ్।
సకంటకం సజ్వాలితం పరిరంభణకారణం॥ 30
తాం వైతదా యమభటాః యమేనాజ్ఞప్తచేతసః।
ఆలింగయామాసు రతః పాపం ప్రతిపదన్నృనః 31
తత స్తన్మూర్ధ్ని పాతం చ యమదండై ర్భయంకరైః।

కమీభ్రూపాకేన పశ్చాత్తాం శాథంగతే యమకింకరాః॥ 32
శిలోపరిపునస్తాం చ పాదౌ సంగృహ్యతాడయన్।
తతస్తే తప్తరక్తం చ తస్యాః పానమచిక్లిపన్॥ 33
త్రపుం తప్తం సమాదాయ ద్వ్యశ్రోత్రే ప్రక్షిపంతి చ।
ఇత్యాదిభిర్మహాఘోరైః రాజన్ తాం యమకింకరాః 34
చిత్రగుప్తేన బహుళః ప్రేరియ స్తేయమేవచ।
సా మహామఘోర నరకం పితృభిశ్చ పితామహైః. 35
సాబాంధవైరనేకైశ్చ దశపూర్వైర్దశాసరైః.
నారకీం యాతనాం భుక్త్వా పునర్భూమి ముపాగతా॥ 36
శ్వానయోనౌ సముత్పన్నా దశజన్మని వంచ చ।
తతః పంచదశే రాజన్ కళింగే బ్రాహ్మణాలయే 37
శ్వానదేహ మనుప్రాప్య చోదితాచ గృహేగృహే।
కదాచి ద్బ్రాహ్మణగృహే కార్తికే చేందువాసరే। 38
శివపూజాం చ విధివత్కృత్వానక్షత్రమండలం।
ద్రష్టుం సమాగా త్రాజేంద్ర బలి మాదాయ పాణినా॥ 39
నివేదనాంతే చ బలిం త్యక్త్వా బ్రాహ్మణపుంగవః।
పాదౌ ప్రక్షాళ్య చాచమ్య ప్రావిశద్గృహ మంజసా 40
దివా స లబ్ధ్వా లేశం వా సా శునీ బలిభోజనం॥
కార్తిక్యా మిందువారే తు శుని వా బలిభక్షణం॥ 41
తదా జాతిస్మృతి రభూత్ పాహీత్యాహ ముహుర్ముహుః

అంత నాయమభటు లాదుష్టురాలిని కాలుచున్న ఉక్కుస్తంభము నకు చేర్చి, ఓసీ! పాపాత్మురాలా! నిండుప్రేమనుజూపు భర్తనువిడచి పర పురుషుని కౌగిలించినట్లే ఈ స్తంభమును గౌగలింపుమని నిర్బంధించిదానికి గట్టిరి. భర్తను పెనురాతితో జంపిన పాపమున పెనుగడతో మోదిరి. పతివ్రతామణులకు చేసినపాపమునకు సలసలకాగిన తైలమును నోటిలోపోసి

త్రాగించిరి. నీసమును కరిగించి చెవులలో బోసిరి. ఇంకను కుంభీపాకనరకమున ననేకబాధలు పెట్టిరి. ఆసుర స్త్రీ పరాలు చేసిన పాపకర్మంబుల వలనదాని బంధువు లిరువదితరములవారును, ఆరీతిను తరములవారును నరకబాధలనందుచుండిరి. ఈరీతి నాజారిణి పలువిధంబులగు నరకబాధలననుభవించిన తరువాత కుక్కగా పదేనుజన్మ లెత్తి పదునారవ జన్మమున కళింగదేశమున కుక్కయై పుట్టి క్షుత్పిపాసాబాధానివారణార్థ మింటింట తిరుగుచుండెను. ఆయూర నిత్యాగ్నిహోత్రియైన బ్రాహ్మణుడొక్కడు గలడు. అతడు కార్తీక సోమవారమున నుపవాసముండి నక్షత్రదర్శనానంతరంబు వైశ్వదేవము చేసి బల్యన్నమును వీధిలోనైచి కాలుచేతులం గడిగికొని, ఆచమించి లోనికేగుచుండ నీకుక్కవచ్చి, ఆబల్యన్నమును భక్షించెను. ఆ విప్రుండు శివపూజాతత్పరుడును, పరిశుద్ధుడును నగుటవలనను, కుక్క తినిన యన్నము వైశ్వదేవబల్యన్న మగుట వలనను, ఆదినము కార్తీకసోమవారమగుట వలనను, ఆదిన మెచ్చటను కుక్క కొక మెతుకైన దొరకమి నుపవాసమగుట వలనను ఆయన్నమును దినినంత నాశ్వానమునకు జన్మాంతరజ్ఞాన ముద్భవించెను వెంటనే ఆకుక్క ఓవిప్రోత్తమా! నన్ను రక్షింపుము రక్షింపుమని మొఱయిడెను.

సవిప్రో విస్మితో భూత్వా గృహం గత్వాఽబ్రవీద్వచః॥
కిం కిం కరోషి చాస్మాకం గృహే తత్కారణం వద।
భో బ్రహ్మన్ శృణు మే వాక్యం నారీ చాహం పురాద్విజ
కులటా పాపనిరతా జాతిసంకరకారిణీ।
పరేషాం సంపతిరతా పుంశ్చలీ పతిఘాతుకీ॥ 44
ఏవమాదీని పాపానికృత్వాచ యమమందిరే।
తత్రభుక్త్వా యాతనాం చ పునర్భూమిం గతాఽస్మ్యహం
జన్మేదమంతిమం విప్ర జాతిస్మరణకారణం।
తద్వదస్వ ద్విజశ్రేష్ఠ కృత్వా చాహం పునామివై॥ 46
ఏవం శ్రుత్వా న విప్రేంద్రో జ్ఞానచక్షు రదర్శయత్।
కార్తిక్యామిందువారేతు బల్యన్నం నక్తభోజనాత్। 47

జాతిస్మరణ హేతుర్వై స్వాన్న జ్ఞాత్వేతిసో౽వదత్
సాశునీతు పునఃప్రాహ బ్రాహ్మణం వేదపారగం॥ 48
మాం పాహి కృపయాబ్రహ్మన్ శ్వానయోనిధరాంద్విజ
ఏవం సంప్రార్థితో విప్రో దదౌ ధర్మమనుత్తమం। 49
కార్తిక్యామిందువారేతు హ్యేకవారేణ యత్ఫలం।
తత్ఫలం ప్రదదౌ సద్యః ఉపకారాయ భూపతే. 50
దేదీప్యమానదేహాఢ్యా దివ్యస్రగ్వస్త్రభూషణా।
పితృభిస్సహ రాజేంద్ర కైలాసం ప్రతిసా యయౌ॥ 51
శివేన మోదతే తత్ర శివాయస్స్వాన్మహీపతే।
తస్మాత్కార్తికమాసేషు సోమవారవ్రతం చరేత్ 52
యః కరోతి వ్రతం భక్త్యాకైవల్యం కరసంస్థితం।
తస్మాత్త్వమపి రాజేంద్ర కార్తిక్యాంధర్మమాచర॥ 53

ఆపలుకులాబ్రాహ్మణుడాలించి వాకటకువచ్చి చూడ కుక్కతప్ప నన్యులెవరును గానరాలేను. కాని మరల రక్షింపుము అనుమాట వినబడెను. అంత నావిప్రుండు నీవెవ్వడవు? నేను నీకేమి సేయవలయునో వివరముగ చెప్పుమన, నాకుక్క మహాత్మా! నేనిప్పుట్టువునకు వెనుక పదు నేనవజన్మమున నొక బ్రాహ్మణవనితను. జారిణినై భర్తను జంపితిని. ఆదుష్కృత్యముకలన మరణించినపిమ్మట పెక్కు నరకబాధల ననుభవించితిని. నేటికీపుట్టుక నుంటిని. నన్ను రక్షింప నీదేభారమని పలువిధంబుల పలుమారు ప్రార్థించెను. ఆవిప్రు డామాటలాలించి కార్తీకసోమవారమున నుపవసించి విధివిధానమున శివార్చనజేసి క్రమప్రకారము వైశ్వదేవ మొనరించి గృహాంగణమున నేనువైచిన బల్యన్నమును దినుటవలననే యీశ్వానము నకు పూర్వజన్మజ్ఞానము కలిగెనదని నిశ్చయించెను. ఇంక నంతతో నాగక తానొనర్చిన యొక సోమవారవ్రతఫలము నాకుక్కకు పాపపరిహారార్థము ధారవోసెను. అక్షణంబె, అకుక్క తచ్ఛరీరంబును విడచి దాల్చి దివ్యశరీరమును దాల్చి దివ్యాలంకారభూషితయై శివసాయు

జ్యము చెందెను. ఓ, జనకచక్రవర్తీ! కార్తీక సోమవారమున కింత విశేష ఫలమున్నది. నీవు కూడ నీవ్రత మాచరింపుము. అట్లు చేసిన శివసాయుజ్య ప్రాప్తి యగును.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
రెండవ అధ్యాయము

---

# తృతీయోఽధ్యాయః

శ్రీవసిష్ఠః—

కార్తికేమాసి రాజేంద్ర స్నానదానజపాదికం।
లేశం వా కురుతే మర్త్యః తదక్షయ్యఫలం స్మృతం॥ 1
అనిత్యం దేహమాశ్రిత్య కార్తికోక్తం చరేన్నహి।
స్త్రియో వా పురుషో వాఽపిశ్వానయోనిశతం వ్రజేత్
పౌర్ణమ్యాం కార్తికేమర్త్యః స్నానదానం తు నాచరేత్
కోటిజన్మసు చండాలయోనౌ సంజాయతే నృప॥ 3
క్రమాద్యోనౌ సముత్పన్నో భవతి బ్రహ్మరాక్షసః।

వశిష్ఠమహాముని మరల జనకమహారాజుంగాంచి, ఓమిథిలేశా! కార్తికమాసమున నెంతస్వల్పముగ స్నానజపదానాదు లొనర్చినను నవి మిగుల వృద్ధినందును. ఆఫలితము నెఱింగియుం, శరీరంబు అస్థిరంబులని తెలిసియు స్త్రీపురుషాదులు కార్తీకమాసమున స్నానజపదానాదులను జేయ రేని వేరొక జన్మమందు కుక్కలై జనింతురు. కార్తీక శుక్లపూర్ణిమనాడు జీవనదీస్నానముగాని, జపముగాని, దానముగాని చేయనివారు కోటిచండాల జన్మల నెత్తుదురు. తుదకు బ్రహ్మరాక్షసులుగూడ నగుదురు. ఈ యంశమునుగూర్చి ప్రాచీనేతిహాసమొకటి నాయెఱింగినది కలదు. దానిని వచించెద నాలింపుము.

అత్రైవోదాహరంతీమ మితిహాసం పురాతనం ।
తత్త్వనిష్ఠస్య చరితం తత్సమాసేన మేశృణు ।
ఆంధ్రదేశేద్విజః కశ్చి త్తత్వనిష్ఠ ఇతిశ్రుతః ॥ 5
సర్వశాస్త్రార్థకుశల స్సత్యవాదీ జితేంద్రియః ।
తీర్థయాత్రాసు నిరత స్సర్వభూతదయాపరః ॥ 6
కదాచి త్తీర్థయాత్రా మటమానో నరేశ్వర ।
గోదావరీతటే రాజ న్వటేచాంబరచుంబిని । 7
తస్మిన్ త్రయః పిశాచాశ్చబ్రహ్మరాక్షససంజ్ఞికాః ।
ఊర్ధ్వకేశాః కరాళాస్యాః కృష్ణదేహాః కృశోదరాః ॥ 8
రక్తనేత్రశ్మశ్రుముఖాః దీర్ఘదంతాసిపాణయః ।
కరాళవదనా రాజన్ సర్వభూతభయంకరాః ॥ 9
వటస్యపరితో రాజన్ త్రిగవ్యూతి ర్నిరంతరం ।
మనుష్యాః పశవ స్తద్వత్పక్షిణశ్చ మృగా స్తథా ॥ 10
న కదాచి చ్చరంతిస్మ రాక్షసానాం మహాభయాత్ ।
మహాపర్వతసంకాశైః పశుపక్షిమృగాదిభిః ॥ 11
వటవృక్షసమీపే తు బహుభి ర్భీమదారుణైః ।
ముచ్యంతే బహవో న్యోన్యం శబ్దాః ప్రాణభయప్రదాః ॥
దిష్ట్యా ద్విజవరో రాజన్ కార్తికస్నానతత్పరః ।
గచ్ఛన్ దదర్శ తన్మార్గే రాక్షసాన్వటవృక్ష మాశ్రితాన్ ॥
సంత్రస్తహృదయ స్తత్ర రుద్రం భద్రం చ విహ్వల ।
స్మరన్ విష్ణుపదద్వంద్వం తత్త్వనిష్ఠోఽవనీపతే । 14
త్రాహి దేవేశ లోకేశ త్రాహి నారాయణాఽవ్యయ ।
సమస్తభయవిధ్వంసిన్ త్రాహిమాం శరణాగతం ॥ 15
నాన్యం పశ్యామి దేవేశ త్వత్తోఽహం జగదీశ్వర ।

ఆంధ్రదేశంబున తత్త్వనిష్ఠుండను నొకభూసురోత్తముడు కలడు. ఆతడు మహా విద్వాంసుడు; తపశ్శాలి; మేధాశాలి; సత్యవాది; జితేంద్రియుండు; భూతదయాతత్పరుడు; తీర్థయాత్రాసక్తుడునై యుండెను ఒకప్పు డామహనీయుడు తీర్థయాత్రకై బయలువెడలి గోదావరీనదికి వచ్చెను. తత్తీరమున నొకవటవృక్షముండెను. దానిపై భయంకరముఖంబులతోడను, ఊర్ధ్వకేశంబులతోడను, రక్తనేత్రములతోడను, దీర్ఘదంతములతోడను, ఖరాసియు తలపుఱ్ఱెయుగల రెండుచేతులతోడను భూతకోటికి భీతి గల్గించుచుండు మూడుపిశాచంబు లుండెను. ఆపిశాచముల మూడింటివలని భయంబులను, ఆచెట్టుకడకేగాక దానిచుట్టుప్రక్కల కొరుక్రోసులదూరమునకుగూడ జంతువులుగాని, మనుష్యులుగాని పోవ వెఱచుచుందురు. ఆబ్రహ్మరక్షస్సు లొక్కొక్కప్పుడు తమయాకారములను పర్వతములవలె పెంచి, ప్రళయకాలమేఘములనుండి పిడుగులుపడెడు వడువున బొబ్బలిడుచుండును. ఆబొబ్బలు విన్నవారు తమకు మృత్యువాసన్నమైనట్లు తలంచునంతటి భీతచిత్తులగుదురు. తత్త్వనిష్ఠున కాబ్రహ్మరాక్షసులసంగతి తెలియక తన్మార్గమున బోవుచుండెను. ఆముప్పురును వాని కంటబడిరి. వెంటనే యా బ్రాహ్మణుడు పరుగిడసాగెను. అంత నాపిశాచము లాబ్రాహ్మణుని తరుమగా నాతడు వేఱుదిక్కులేక భగవన్నామస్మరణముచేయ నారంభించెను. అందు శివకేశవులనుగూర్చి అఖిలజగదీశ్వరుండవైన పరమేశ్వరా! పరాత్పరా! సదాశివా! మహాభయాపహర్తా! శంకరా! నన్ను గావుము. సకలజగదాధారభూతుండవైన యోశ్రీనివాసా! వైకుంఠవాసా! శంఖచక్రగదాధరా! అఖిలాండకోటిబ్రహ్మాండనాయకా! ద్రౌపదీమానసంరక్షకా! కరివరదా! ప్రహ్లాదవరదా! అన్యుని వేడక నిన్నే శరణందితినిగాన నన్నీయాపత్కాలమున గాపాడుము.

ఏవం పలాయమానం తం రాక్షసానుగతా స్తదా । 16
భయాత్కంపాన్వితం విప్రం దృష్ట్వా లిత్తేజనసాహంతాః।
దర్శనా త్తస్య విప్రస్య సంజ్ఞా సంజాయ తేఽమలా॥ 17
చక్రుః ప్రణామం తేభూమౌ బ్రాహ్మణాయ మహాత్మనే।

తే రాక్షసాః ప్రాంజలయః తదగ్రే నృపపుంగవ। 18
తుష్టువుర్వివిధై ర్వాగ్భిః వ్రపః భూతదయాపరం।
బ్రహ్మన్ తేదర్శనాత్సద్యో వయం నిష్కల్మషాలయాః
భవదాగమనం బ్రహ్మన్ లోకోపకరణాయవై।
మహాతాం జీవనం లోకే ప్రాణినా ముపకారకం॥ 20
మహద్విచలనం విప్ర తే చ ప్రాహు ర్మహేపతే।
ఏవం ప్రత్యుదితం శ్రుత్వా బ్రాహ్మణో భయవర్జితః 21
కే యూయ మితి తా నాహ ప్రసన్నే నాంతరాత్మనా।
కిమిదం కర్మణా కేన వికారం రూప మీదృశమ్। 22
భవద్భిః కింకృతం పూర్వం విద్వద్భి రతినిందితమ్।
వదధ్వం నాత్ర సందేహో యుష్మాకం మా భయం యతః
తే న స్మరంతి తేసర్వం పృథ క్తత్కర్మ నిందితం।
విప్రాగ్ర్య మూచు స్తత్రేత్థం తత్వదామస్సమాగతాః॥

తత్వనిష్ఠు డుచ్చరించిన హరిహరుల నామములు చెవులబడినంత నారాక్షసత్రయ మించుక శాంతివహించి యాబ్రాహ్మణుని శాంతవచనములతో బిలిచి, ఓమహానుభావా! నీకు వందనములు. నీవు భీతిచే వణుగిడ వలదు. నిన్ను దర్శించుటవలన మాపాపములు రూపుమాసినవి. మీవంటి పూజ్యులు పరోపకారమునకై వర్తించుచుందురు. మీదర్శనమువలన మేము కృతార్థులమైతిమి. అని పరిపరివిధంబుల దీనాలాపంబు లాడుచు ప్రార్థింప తత్వనిష్ఠుడు భయమువీడి వారియెదుటకువచ్చి యిట్లనెను మీరెవరు? మీకీ భయంకర రూపము లేల కలిగినవి? అని అడిగెను.

బ్రహ్మరాక్షసాః—

అహం పురాద్రావిడేషు గ్రామణీం బ్రాహ్మణాధమః।
నిష్ఠురో వాక్యచతురః గ్రామే మందరసంజ్ఞికే॥ 25

బ్రహ్మస్వం చ మయా భుక్తం కుటుంబాసక్తబుద్ధినా।
బంధుభ్యో బ్రాహ్మణేభ్యశ్చ నాన్నం దత్తం మయా పురా
బ్రహ్మస్వం ప్రణయాద్భుక్తం దహత్యాసప్తమం కులం।
తదేవ చౌర్యరూపేణ దహత్యాచంద్రతారకం। 27
ఘోరవే యాతనాం భుక్త్వా న భూమౌ బ్రహ్మరాక్షసః।
దోషస్యాస్య ప్రశమనే ఉపాయం కురు భూసుర॥ 28

అంత నం దొక్కడు, ఓవిప్రోత్తమా! తొలిజన్మంబున నేనొక బ్రాహ్మణుడను. నాది ద్రవిడదేశము. మందరమను గ్రామమున కధికారిగ నుంటిని. మిగుల బాధించి, బలవంతపఱచి, నిర్బంధమున లంచములగొని కుటుంబమును పోషించుకొనుచు వచ్చితిని. విప్రపూజయెట్టిదో యెఱుంగనైతిని. బ్రాహ్మణద్రవ్యము హరించిన తనను తన వంశీయులను, పితృపితామహాదులను బాధించునని, వినియుండియు బ్రాహ్మణధనమెంతయో హరించితిని. తత్పాపఫలితముగ నరకబాధల నెక్కింటి ననుభవించి తుట్టతుద కీబ్రహ్మరాక్షసత్వము నొందితిని. మీరు మహానుభావులు. నాకీ పాపమునుండి యీజన్మనుండి విముక్తికలుగజేయ మిమ్ములను వేడుచుంటినని చెప్పెను.

ద్వితీయోవాచ తం విప్రం వినయావనతో నృప।
మాతాపిత్రోరహం ద్వేష్యోతిత్యం నిష్ఠురభాషణః॥ 29
దారాపత్య సమాయుక్తో మృష్టాన్నం భక్షయా మ్యహం
పిత్రోర్మమోభయో శ్చాపి పర్యూషాన్నేన భోజనమ్।30
బంధుభ్యో బ్రాహ్మణేభ్యశ్చ ద్రవ్యాసక్తేన యన్మయా।
నాదత్తం చాణుమాత్రం వా తస్మాద్దుర్బుద్ధినా మయా॥
ఆంధ్రదేశనివాసేన చాజ్ఞానే నాల్పమేధినా।
తేన కర్మవిపాకేన యాతనాం చ యుగాష్టకమ్॥ 32
భుక్త్వా పశ్చాద్భువం ప్రాప్య బ్రహ్మరాక్షసరూపధృత్।
పాపపంకే నిమగ్నం మాం ఉద్ధరేహ మహీసుర॥ 33

అంత రెండవవాడు, భూసురోత్తమా! నేనును పూర్వజన్మమున విప్రకులమున జన్మించితిని. సదాచారవర్జితుడనై కని పెంచిన తలిదండ్రులను కట్టి కొట్టి పలువిధముల బాధించి తిండిపెట్టక వారాకలిచే నన్నమో రామచంద్రాయని యేడ్చుచు మలమల మాడుచుండ నేను నాభార్యాబిడ్డలతో తృప్తిగ భుజించువాడను. ఒకవేళ సగమాకలి తీరునట్లెప్పుడైన పెట్టినను వారి నది తినునంతకాలము పలువిధముల దూషించువాడను. ఒకబ్రాహ్మణునకుగాని, బంధువునకుగాని నాయింట నన్నము పెట్టలేదు. ఆమహాపాపముకలన నెనిమిదియుగములు నరకబాధల ననుభవించి యీతుచ్ఛజన్మ మెత్తితిని. నీవు పరోపకారపారీణుడవని నీమొగమే తెల్పుచున్నది. నన్నీపాపపంకంబునుండి యుద్ధరింపుమని వేడుకొనెను. అపుడు మూడవవాడు తనవృత్తాంతమునిట్లు చెప్పనారంభించెను.

ఏవముక్తే తృతీయస్తు ప్రాహేదం ప్రణతో నృప।
ఆంధ్రదేశేఽర్చకో విప్ర విష్ణో రాయతనే శుభే 34
స్నానసంధ్యాపరిత్యక్తః పరనిందాపరాయణః।
బహుభాషీ నిష్ఠురోఽహం దయాహీనోఽశుచి ర్ద్విజః 35
తైలం విష్ణో ర్దీపసంస్థంమయా చాపహృతం పురా।
వేశ్యాగారే తు తత్తైలం దద్ఘృతం దీవ్య తే మయా 36
తస్మాత్తద్ద్రివ్య మాదాయ తయారత్యాఽతిలాలసః
తేన కర్మవిపాకేన నరకే భుక్తయాఽతనః॥ 37
పశ్చాద్భూమి మనుప్రాప్య నానాయోనిషు వై క్రమాత్।
బ్రహ్మరాక్షసయోనౌ తు సంజాతోఽప్యత్ర పాదపే॥38
రక్షమాంకృపయా బ్రహ్మన్ సర్వభూతదయానిధే॥

ఓద్విజవరేణ్యా! నేనాంధ్రదేశమున బ్రాహ్మణుండనై జనించి యొకగ్రామములోని విష్ణుదేవుని ఆలయమున అర్చకుడుగానుండి పరిశుద్ధుడనై దేవునర్చించుటమాని స్నానమైనజేయక అపరిశుద్ధుడనై వారినర్చిం

పక పరుల నింగింపుచు నిష్కారణముండనై స్వామి కితరు లర్పించిన గోఘృతాదికములతో, ఫలపత్రాదులతో దీపముంచక, నైవేద్యమిడక వానినెల్ల నాయుంపుడుకత్తె కొసగుచుండెడివాడను. తత్పాపభారమున నరకబాధల నంది పలునీచజన్మంబులనెత్తి తుద కీఘోరరూపంబు నొందితిని. దయాసముద్రులగు మీరు నన్నీ పిశాచజన్మనుండి విముక్తినొసరించి పుణ్యముగట్టుకొనుడని ప్రార్థించెను.

తైరేవముదితం శ్రుత్వా విప్రో విస్మితమానసః॥ 39
మాభయం భవతామల్ప ముద్ధరిష్యేత సంకటాత్।
కార్తీకస్నానకామేన ఆగచ్ఛధ్వం మయా సహ॥ 40
ఇత్యుక్త్వాతైస్తతో విప్రో కావేర్యాం కార్తికే నృప।
స్వయం కృత్వా తతః స్నానం తేషాంముక్తిమకారయత్
తత్క్షణా దేవ ముక్తా స్యుః దివ్య రూపధరాశ్చతే।
యయు ర్విష్ణుపదం రాజన్ కార్తికస్నాన మాత్రతః॥ 42
మోహేనైవాథ వాజ్ఞానా త్కావేర్యాంచ భృగూదయే
యో నిమజ్జతి రాజేంద్ర విష్ణోః పూజాంవిధానతః॥ 43
వాజిపేయాయుతానాం చ ఫలం యాతి న సంశయః।
యేన కేనా ప్యుపాయేన కావేర్యాం కార్తికేనృప॥ 44
ఆవశ్యక మిదం స్నానం కుర్యాద్విష్ణుపరాయణః।
న కుర్యాద్యది కార్తిక్యాం స్నానం భక్త్యా నరాధమః॥
దశజన్మనిచండాలో పశ్చాత్సూకరకో భవేత్।
తస్మాత్కార్తికమాసేతు స్త్రియో వా పురుషస్య చ॥
స్నాన మావశ్యకం రాజ న్నాత్ర కార్యా విచారణా।

ఓమిథిలాధిపతీ! తత్సనిష్ఠు డాపిశాచముల దీనాలాపము లాలించి మిగుల నాశ్చర్యపడి వారిదైన్యతను చింతించి, ఓపిశాచములారా! మీకే

పిశాచజన్మనుండి విముక్తి కలిగించెదను. భీతిల్లకుడు. వెంటనే నావెంట రండని వారిముగ్గురను దోడ్కొని కతిపయప్రయాణంబులలో కార్తీక మాసము వచ్చుసరికి కావేరీనదీతీరముం జేరెను. పిశాచముల కానదియందు స్నానమొనర్ప నర్హత లేమింజేసి వారిపాపములు పోవుటకు తత్వనిష్ఠుడు తానే సంకల్పముచేసి విధ్యుక్తముగ స్నానమొనరించెను. అంత వారి పిశాచజన్మ లంతరించినవి. ఆబ్రాహ్మణు డిచ్చిన కార్తీకస్నాన ఫలంబు వలన నాపిశాచములు నిఖిలపాప విముక్తములై దివ్యశరీరములతో వైకుంఠ మున కేగినవి. తెలిసిగాని, తెలియకగాని కార్తికమాసమున కావేరీస్నాన మొనరించి శ్రీహరి నర్చించినవారికి పదివేల వాజిపేయములొనర్చిన ఫలం బుగల్గును. ప్రతివాడును కార్తికమాసమున కావేరీనది యందు గ్రుంకి నారాయణార్చన మొనరింపవలెను. అట్లు చేయనివాడు పదిజన్మంబులు చండాలుడుగ పుట్టి తరువాత పందియై పుట్టును. కార్తికస్నానము స్త్రీపురుషాదుల కవశ్యాచరణీయము.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
మూడవ అధ్యాయము

---

# చతుర్థోఽధ్యాయః

రాజోవాచ—

తవ వాగమృతం పీత్వా తృప్తిర్నాస్తి మహామతే।
కిం దానం కార్తికేమాసి కిముద్దిశ్య వ్రతంచరేత్॥ 1
భూయోఽహం శ్రోతుమిచ్ఛామి ధర్మం కార్తికసంభవమ్

జనకమహారాజు మరల వసిష్ఠుని గాంచి ఓమునివల్లభా! నీవాగమృత మెంతగ్రోలినను తనివితీరుటలేదు కార్తికమాసమున నేదానము ముఖ్య ముగా చేయదగినదో, ఎవరి నుద్దేశించి దానిని చేయవలయునో విశదముగ నాకానతిండనెను.

వసిష్ఠః—

భూయ శ్శృణుష్వాఘహరం సర్వపుణ్య వివర్ధనమ్॥ 2
ప్రవక్ష్యామి మహారాజ ధర్మం కార్తిక సంభవం।
కార్తికేమాసి సాయాహ్నే శివాగారే శుభప్రదే॥ 3
యో దీప మర్పయే ద్భక్త్యా తదనంతఫలప్రదం।
గోపురద్వారశిఖరే లింగాగ్రే నృపపుంగవ॥ 4
కార్తిక్యా మర్పయే ద్దీపం సర్వపాపైః ప్రముచ్యతే।
యః కుర్యా ద్భక్తిభావేన కార్తిక్యా మీశ్వరాలయే॥ 5
గవ్యేన చ ఘృతే నాపి తైలాద్వా మధుతైలతః।
నారండతైలా ద్రాజేంద్ర దీపం యశ్శుంభవేఽర్పయేత్
స ధన్య స్సర్వధర్మజ్ఞః స ధర్మాత్మా న సంశయః।
యదిత త్తదభావే తు కార్తికే మాసి భూమిప॥ 7
దీప మేరండతైలం వా యోఽర్పయేత్స తు పుణ్యభాక్।
మోహాన్నైవాథవా దంభాద్భక్త్యా వా పార్వతీపతేః॥ 8
కార్తికోచార్పయే ద్దీపం స శివ ప్రియకృన్నరః

అపుడు వశిష్ఠుడు, ఓజనకమహారాజా! కార్తీకమాసమున నన్నిదానములను చేయవచ్చును. కాని వానిలో దీపదానము మిగుల ఫలితమిచ్చునది. శివకేశవుల ప్రీతికై దానిని శివాలయమందుగాని, విష్ణాలయమందుగాని, చేయవలెను. సూర్యాస్తమయసమయము దానికర్హకాలము, మరియు దేవాలయములందు శివకేశవుల సన్నిధానమునగాని, తదాలయశిఖరములందుగాని, మండపములందుగాని, గోపురములందుగాని, గోపురద్వారములందుగాని దీపముంచిన వారి పాపములన్నియు నశించును. కార్తీకమాసమున హరిహరాదుల సన్నిధానమున ఆవునేతితోగాని, నువ్వులనూనెతోగాని, నారికేళతైలముతోగాని దీపముంచిన గొప్పఫలము లభించును. అట్లు పెట్టినవాడు ధర్మాత్ముడు, ధన్యుడు, సర్వధర్మ పరిజ్ఞాత అగును. వానిలో ఆవు

నేతితో నుంచు టతిఫలప్రదము. అది లభింపనిచో నువ్వుల నూనెతో నుంచవలెను. అదియు దొరకనిచో యిప్పనూనెతో పెట్టవలెను. అదికూడ చేకూరనిచో కొబ్బరినూనె నుపయోగింపవచ్చును. అది తేలేనివాడైన అవిస నూనతోగాని, తుద కౌముదముతోగాని దీపనుంచవలెను. ఏవిధముచే నైన పైతావులందు దీపారాధన చేసినవాడు పుణ్యాత్ముడు. మిగుల భక్తి కలవాడై దేవునిప్రీతికైగాని, ఏదేనికోరికయుండినగాని, బడాయికిగాని శివునిసన్నిధానమున దీపారాధనజేసినవాడు శివసాయుజ్యమునొందును. దీనినిగూర్చి ప్రసిద్ధమైన యొక యితిహాసంబుగలదు. దానిని చెప్పెదను; శ్రద్ధతో నాలకింపుము.

పురా పఞ్చాలదేశేతు రాజాఽభూ ద్ధనదోపమః 9
పుత్రహీన స్తప స్తేపే గోదావర్యా స్తటే శుభే।
స్నాతుకామ స్సమాయాతః పైప్పలో మునిస త్తమః॥ 10
రాజాన మబ్రవీ త్త్రతకిమర్థం క్రియతే తపః।
తతో వాచ మహీపాలో మునిం సత్యవచోఽన్వితం 11
మునే పుత్రవిహీనోఽస్మి తదర్థం తప్యతే తపః॥

మున్ను పాంచాలదేశమున కుబేరునితోంబోలుడ నైశ్వర్య వంతుడగు నొక రాజుండువాడు. అతనికి సంతతి లేకపోయినది. సంతానము నిమిత్తమారాజు గోదావరీతీరమున బహుకాలమున తపంబొనర్చెను. ఆరాజా తపం బొనర్చుతావున నొకప్పుడు 'పిప్పలాదుడు' అను నొక మహాముని వచ్చి నీ వెందులకు తపంబొనర్చుచుంటివని యడిగెను. అంత నారాజు సంతానమును కోరి నేను తపంబొనర్చు చున్నాననిపలికెను.

బ్రాహ్మణః—

కురుష్వభక్త్యా విప్రేభ్యస్తుష్టిం వా పార్వతీపతేః॥ 12
తేన తే పుత్రసంతానం భవిష్యతి న సంశయః।
ఇతి తేనోదితం శ్రుత్వా ప్రహర్ష మతులం లభేత్। 13
నమస్కృత్య గృహంగత్వా సుస్నాత స్సమలంకృతః।
చకార దీపదానం తు విధి నేశ్వరతుష్టయే॥ 14

తతస్సైనవ పుత్రార్థం న్యాస్యః కస్య సుకర్తనా।
ప్రసూతకాలే సా పుత్రం ద్యోతయమివ భాస్కరం॥ 15
రాజా ప్రహృష్ట మతోలం సంప్రాప్యైవ మువాచ హ।
సత్యం కార్తికమాసస్య మాహాత్మ్యం పురుషార్థదం॥ 16
సర్వేషామేవ భూతానాం సుఖహేతు ర్న సంశయః।
తస్యాభిధానం చక్రేఽసౌ బాలస్య పృథివీపతిః॥ 17
శత్రుజిన్నామ పుత్రస్య విప్రాన్సంపూజ్య భక్తితః।

అపు డాముని, ఓ రాజా! నీవు శివునికిష్టమైన కార్యమును విప్రుల వలన దెలిసికొని వారు చెప్పినట్లు చేసితివేని నీకు పుత్రుండు కలుగునని వచించెను. ఆరాజామునికడ సెలవంది స్వగృహంబున కరిగి విద్వాంసుల నడుగ వారు కార్తీకమాసమున మహాభక్తితో శివకేశవాలయముల దీపదానమును జేయుమనిరి. వారిపలుకు లాలించి యతి భక్తితో పుత్రప్రాప్తికై శివాలయమున కార్తీకమాసము నెలదినములు దీపారాధనను జేయించెను. తత్పుణ్యవిశేషంబున నారాజుభార్య గర్భవతియయ్యెను. క్రమముగా పది మాసములు నిండి నిండు మాలాతై యొక శుభదినంబున బాలార్కతేజుండగు నొక బాలుని గనెను. అంత నారాజు పరమానందభరితుడై తానొనర్చిన దీపదాన ఫలితమింత మాహాత్మ్యముకలదని యెఱింగి యిది యందఱు తప్పక చేయుదగినదని తనరాజ్యమున చాటబంచెను. ఆబాలునకు శత్రుజిత్తని పేరిడెను.

తతో వృద్ధిం గతో బాలో రాజపుత్రోఽవనీపతేః॥ 18
శూర స్సురూపో నృపతేః తనయః ప్రాప్తయౌవనః।
వారాంగనాసు నిరతః పరస్త్రీరతిలాలసః 19
గురువిప్రజనద్వేషీ జాతిసంకరకారకః।
నిందకో నిష్ఠురః పాపః ఖడ్గపాణి ర్దురాగ్రహః॥ 20
రూపయౌవనసంపన్నో నానాలంకారభూషితః।

కస్యచి ద్ద్విజముఖ్యస్య భార్యా పరమశోభనా॥ 21
హరిమధ్యా విశాలాక్షీ బృహచ్ఛ్రోణిపయోధరా।
రంభోరూ శుకవాణీ చ సౌందర్యస్మరవిభ్రమా॥ 22
స రాజతనయ స్తాం తు దృష్ట్వా సౌందర్యతోషితః।
తం దృష్ట్వా సా తథా రాజన్ తస్య రూపేణ భామినీ॥ 23
సాగత్వా రాజతనయం ద్విజం త్యక్త్వా మహానిశి।
తేన సా రమతే నిత్యం సంతుష్టా రాజమందిరే॥ 24
రాత్రిశేషం తథానీత్వా పునః పతి ముపాగతా।
తత్ జ్ఞాత్వా సద్విజః కోపాద్భార్యాం దృష్ట్వానిందితాన్
ఖడ్గపాణి స్స కోపేన తస్యా శ్ఛేపవతే ర్నృప।
వధోపాయం స్మర న్నిత్యం యేన కేనాప్యుపాయతః॥ 26

ఆబాలుడు శుక్లపక్షచంద్రునిపగిది దినదినప్రవర్ధమానుండగుచు పదునెనిమిదవయేడు వచ్చునప్పటికి నవమన్మథాకారుడై మహాబలశాలి యయ్యెను. కాని యాతడు యౌవనమదముచె వేశ్యాలోలుడగుటయేగాక కంటికింపయిన కాంతలకూడి రమించుచుండెను. అందువలన తలిదండ్రులును, గురువులును, బ్రాహ్మణులును నతనిని ద్వేషించిరి. ఆతడు జాతిమతభేదములను వీడి వర్తించుటచే వర్ణసాంకరుఁ డయ్యెను. మఱియు నాతడు దుస్సాంగత్యమువలన పరస్త్రీలోలుడగుటయేగాక యౌవన సౌందర్యంబు చేతను, ధనమదాంధతచేతను, రాజపుత్రుండనను దురభిమానంబునను బాగుగా నలంకరించుకొని కనుబడిన స్త్రీలనెల్ల బలాత్కారముగ రమించుచు, పరనిందాపరాయణుడై దురాగ్రహోద్యుక్తచిత్తుడై నిరంతరము ఖడ్గంబుచేబూని యడ్డమువచ్చిన వారినెల్ల నరకుదునని తిరుగుచుండెను. అట్లు తిరుగుచునొకదినమున నొకబ్రాహ్మణయువతిని జూచెను ఆమె యొకయుత్తమబ్రాహ్మణుని యిల్లాలు. ఆమె మిగుల రూపవతి. సింహమధ్య, శిఖరిదశన, పక్వబింబాధరోష్ఠి, చకితహరిణీ, బృహచ్ఛ్రోణి, పృథుస్తని, రంభోరువు, శుకవాణి యనదగి నిరుపమానలావణ్యాయని ప్రసిద్ధి నందినది. ఆమెను జూచినంత మోహితుడై తనకోరిక నామెకు దెలిపెను. ఆమెయు రాజపుత్రుని సౌందర్యమునకును, లాలనకును వశవర్తినియై

రాజపుత్రుని మీది వలపుచే ప్రతిదినంబున నర్ధరాత్రమున భర్తను వీడి రాజపుత్రుని గృహంబున కరిగి యాతనితో సురతక్రీడల దేలుచుండె. ఆమెభర్త యీసంగతి తెలిసికొని రాజపుత్రునితోగూడ తనభార్యను జంపదలంచి నిరంతరమొక కత్తిని మొలలో నుంచుకొని సమయమునకై వేచియుండెను.

కదాచి త్కార్తికే మాసి పౌర్ణమ్యామిందువాసరే।
దిష్ట్యా శివాలయం గత్వా రాజపుత్ర స్తయాసహ॥ 27
సాకుర్యాద్వర్తికాం సుభ్రూ శ్చైలాంతే నైవభూమిప।
స రాజపుత్రో మోహేన తైల మేరండకం స్వయం॥28
దీపం సా దీపపాత్రే తు ప్రజ్వాల్యాతి ప్రయత్నతః।
సంస్థాప్య వేదికాయాం చ శివాగ్రేఽశుభచారిణీ॥ 29
తత్రతత్తేజసా రాజ స్సురతోత్సాహనిర్భరైః।
కామశాస్త్రకలాప్తైశ్చ క్రీడా శ్చక్రతు రాదరాత్॥ 30
ఆత్మానం గోపయిత్వాతు శనైర్గత్వా తదాలయంః
కవాటసుస్థిరం బధ్వా ఖడ్గ మాదాయ కోపతః 31
చిచ్ఛేద రాజతనయం తతో భార్యాం నరాధిత।
రాజసూను శ్శనైః స్థిత్వాజఘ్ని వా నసినా చ తమ్॥32

ఇట్లుండ కార్తీకశుద్ధపూర్ణిమ వచ్చెను. ఆదినమున రాజపుత్రుడును బ్రాహ్మణజారిణియు శివాలయమును సంకేతస్థానముగ నేర్పరచుకొని తమ కర్మవశమున నాయాలయమున కరిగిరి. ఈసంకేతము నెట్లో గ్రహించిన యామెభర్త వీరికంటెముందే శివాలయమునకేగి గర్భగుడిలో దాగియుండెను. జారవృత్తికి మరగిన వారిరువురును పరస్పరము కామమోహితులై కాగిళ్ళలో నొదిగిరి. అప్పుడు రాజపుత్రుడు దీపముండిన బాగుండుననెను ఆమె తన విటుని కోరిక నెరవేర్ప యాసమీపమున నాముదపుప్రమిదలో తన చీరచెంగుచించి వత్తిగాచేసివైచి దీపమును వెలిగించెను. వారిరువురు మహానందమున రతిక్రీడల దేలుచుండిరి. ఆసుదనుగ్రహించి లోనున్న ఆజారిణి భర్త వారిపైబడి కత్తితో నరికెను.

జీర్ణ దేవాలయే ద్వైవా దన్యోన్యాఘాత యోగతః
త్రయోఽపిమరణం జగ్ముః కార్తిక్యా మీశ్వరాలయే॥
మోహాత్ కార్తిక పౌర్ణమ్యా మిందువారే శివాలయే।
పౌర్ణమ్యా మిందువారేతు సర్వపుణ్యఫలప్రదే 34

వానిభార్య వెంటనే మరణించినది. రాజపుత్రు డాబ్రాహ్మణుని చేతి ఖడ్గము నూడదీసికొని యాబ్రాహ్మణు నొకవ్రేటుతో నరికెను. అతడు మరణించిన కొలది నిముషములకే రాజపుత్రుడును మరణించెను. కార్తీకపూర్ణిమా సోమవారమున శివాలయమున నాముగ్వురును జచ్చిరి.

తదాగతా యమభటాః పాశహస్తై ర్భయంకరాః।
శివదూతా స్తదా జగ్ము రుద్రలోకచవభీతిదాః॥ 35
అథ తాంరాజపుత్రంచ విమానే సన్ని వేశ్యచ।
పాదౌ చాబధ్య తం విప్రం యమదూతా స్సుదారుణాః॥
ఏవం భిన్నాం గతిం దృష్ట్వా తానాహ ద్విజసత్తమః।
తావుభౌ తుల్యపాప్మానౌ కులటానృపపుత్రకౌ॥ 37
అహం ద్విజవరః పుణ్యో గతిభేదో హ్యభూ దిహ।

యమదూతలును, శివదూతలును ఏకకాలమునకే యటకువచ్చిరి. యమదూత లాబ్రాహ్మణుని పాశంబులచే బంధించి యీడ్చికొని పోవుచుండిరి. శివదూత లాజారిణిని విటకానినిగూడ విమానముపై నెక్కించుకొని సుఖప్రయాణము చేయించిరి. ఆబ్రాహ్మణు డీవిరుద్ధవ్యాపారమును గాంచి యాశ్చర్యపడి శివదూతలతో నిట్లనెను. ఓశివకింకరులారా! వాడు విటుడు. ఆమె జారిణి. అట్టిపాపాత్ముల నిరువురను విమానమెక్కించిరి. నేను శ్రద్ధ శ్రోత్రియుడను. నాకాలు సేతులను బంధించి యీడ్చికొని పోవుచున్నారు. మీవంటి వారుకూడ నిట్టివిరుద్ధమును జేయుదురా? యని యడిగెను.

శివదూతా స్తతః ప్రోచుర్బ్రాహ్మణం దీనమానసమ్ 38
మోహాత్ కార్తిక పౌర్ణమ్యా మిందువాసరే శివాలయే॥

ఏషా చాతిమురాచార తైలఖండేన వర్తికామ్॥ 39
చకార తేన పుణ్యేన సర్వపాపక్షయోభవత్।
అనేన దీపపాత్రం చ తైల మేరండసంభవమ్॥ 40
సర్వపాపక్షయ మభూ త్పుణ్యాం తత్తైల పాత్రయోః।
దానేనై వాథవా మోహాత్కార్తిక్యాం శంకరాలయే॥
యోఽర్పయేద్దీప మేకం వా స ధన్య స్సర్వయోగినాం।
ఇతి తైరుదితంశ్రుత్వా రాజసూను ర్దయాన్వితః 42
దాస్యామి దీపపాత్రస్య ఫలం విప్రవిముక్తయే।
ఏకకాలమృతానాం చ గతి రేవావశిష్యతే॥ 43
ఇత్యుక్త్వా ప్రదదౌ పుణ్యాం కార్తికే మాసి సంభవం।
తేన పుణ్యప్రభావేన స ముక్తో యమపాశతః॥ 44
దివ్యం విమాన మారుహ్య యయౌ శివనికేతనం।
య యురన్యేన పుణ్యేన తదా తే శివమందిరమ్॥ 45
తస్మాత్సర్వప్రయత్నేన కార్తిక్యాం ధర్మ మాచరేత్।
నాచరేద్యది మూఢాత్మా రౌరవం నరకం వ్రజేత్।
యః కార్తికే మాసి రాజన్ మాన మేకం నిరంతరం।
శంకర స్యాథవా విష్ణోః దేవదేవస్య చక్రిణః। 47
దీపమాలార్పణం కుర్యా న్న పునర్జాయతే భువి।
సోఽపి జ్ఞాన మనుప్రాప్య ముక్తో భవతి నిశ్చితమ్॥ 48
స్త్రియో వా పురుషో వాఽపి కార్తికే కేశవాగ్రతః।
స్వశక్త్యా చార్పయేద్దీపం సర్వపాపవిముక్తయే॥ 49

తస్మాత్త్వమపి రాజేంద్ర కార్తికే పరియాపతే।
మందిరే దీపమాలాం తు సమర్పయ న సంశయః॥ 50

అంగుళకు వారు, ఓబాపడా! వారు పాపాత్ములైననూ అవసాన కాలమున కార్తీక పూర్ణిమా సోమవారమున ఆనందముతో శివాలయమున నిర్వ్యారను దీపమును పెట్టిరి. అందుచే పుణ్యాత్ములైరనిరి. కార్తీక మాసమున శివాలయమున నెఱిగికాని, ఎఱుంగకకాని దీపముంచినవారు పుణ్యాత్ములగుదురు. విటకాడైన యారాజపుత్రుడని విని కరుణార్ద్రహృదయుడై, ఓశివకింకరులారా! మీరు చెప్పినమాట పొల్లుపోగూడదు. మేము ముప్వురమొకేతావున, ఒకేకాలమున మరణించితిమి. అందుచే మాముప్వురకు కష్టసుఖములు సమానముగా నుండవలయును. నేను దెచ్చిన దీపపాత్రఫల మీబ్రాహ్మణున కిచ్చితిని. ఏరండతైలదానఫలము నాయది. ఈ బ్రాహ్మణుని బంధనములు విడిపించుడని చెప్పి దీపపాత్రఫలము నావిప్రున కొసంగెను. అందువలన శివకింకరు లావిప్రునికూడ విమానమెక్కించి కైలాసమునకు గొంపోయిరి. జనకమహారాజా! ఆరాజపుత్రుని నడత యెట్టిదో, అతడొనర్చిన పున్నె మెట్టిదో, ఆబ్రాహ్మణునిభార్య వర్తన మెట్టిదో, ఆమెచేసిన పుణ్య మెట్టిదో, వింటివా? కార్తీకమాసమున దేవాలయమున నేయుపాయముచేత గాని, దీపదానము తప్పక చేయవలెను శక్తికలిగియుండియు చేయని నాడు రౌరవాది నరకబాధ లనందును. కార్తీక మాసము నెలదినములు శివకేశవాలయములందలి నక్షత్రమాలికలలో దీప ముంచిన మానవునకు జన్మరాహిత్యమగును. అతడు నిఖిలపాపవర్జితుడై గొప్ప విజ్ఞాని పొందెడు మోక్షమునందగలడు, ఇందావంతయు సందియము లేదు. నీవును కార్తికమాసమున శివకేశవాలయములందలి నక్షత్రమాలికల నుంచి చరితార్థుడవగుము.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
నాల్గవ అధ్యాయము

# పంచమోఽధ్యాయః

శ్రీవసిష్ఠః—

ఆచరేత్కార్తికే మాసి నారీ వా పురుషోఽపి వా।
పాపక్షయార్థం రాజేంద్ర కార్తికే యత్రభాజనమ్। 1
యద్వాచరతి రాజేంద్ర ఫలమక్షయమశ్నుతే।
యః కార్తికే హరేరగ్రే గీతాపాఠం కరిష్యతి 2
స సర్వపాపనిర్ముక్తః జీర్ణత్వచమివోరగః।
కార్తికే తులసీపత్రైః కరవీరైస్సితాసితైః 3
అలంకరోతి సద్భక్త్యా విష్ణుమాద్యం జగద్గురుం।
స విష్ణోర్మందిరం ప్రాప్య విష్ణునా సహ మోదతే॥ 4
విభూతిం విశ్వరూపం చ కార్తికే కేశవాగ్రతః
యో జపేద్భక్తియోగేన స వైకుంఠేశ్వరో భవేత్ 5
పాదం వాశ్లోకమేకం వా పురాణం కార్తికే హరేః।
అగ్రతః కురుతే రాజన్ స ముక్తస్సర్వకర్మభిః 6
యః కార్తికే సితే పక్షే వనభోజనమాచరేత్।
స యాతి వైష్ణవం ధామ సర్వపాపైః ప్రముచ్యతే। 7
జపహోమార్చనాకాలే భోజనే పితృతర్పణే।
చండాలపతితానాం చ శూద్రసూతకభాషణమ్ 8
శ్రుత్వాసమాచరేద్ధీమాన్ కార్తికే వనభోజనమ్।
నానాద్రుమలతాకీర్ణే వనే చామలకాగ్రతః 9
సమభ్యర్చ్య విధానేన సాలగ్రామనివాసినం।

దామోదరం జగద్వంద్యం గంధపుష్పాక్షతాదిభిః॥ 11
యథా విత్తానుసారేణ విప్రాన్ సంపూజ్య భక్తితః।
ఏవం య ఊర్జే మాసేఽస్మిన్ వనభోజన మాచరేత్॥
సర్వపాపవినిర్ముక్తో యత్యాత్కాలాదిసంభవైః।
తస్మాత్సర్వప్రయత్నేన వనభోజన మాచరేత్॥ 12
పురాణశ్రవణం భక్త్యా మహాత్మ్యం కార్తికస్య చ।
యథా విప్రసుతో ముక్తో రాజన్ దుర్యోనిసంకటాత్॥

జనకమహారాజుంగాంచి వసిష్ఠుడు మరల నిట్లనియె. ఓజనకభూపతీ! కార్తీకమాసమున నేతావున భుజింపవలెనో, ఏజపము చేయవలెనో వివరించి చెప్పెద నాలింపుము. కార్తీకమాసమున శివాలయమునగాని, విష్ణాలయమునగాని భగవద్గీతాపారాయణ చేయవలయును అట్లు చేసినవాడు పాముకుబుసంబు నూడ్చినట్లు సర్వపాపములను త్యజించును. ఈమాసమునందు తెల్లకరవీరపుష్పములుగాని, ఎఱ్ఱకరవీరపుష్పములుగాని మాలికలు గూర్చి శ్రీమన్నారాయణు నలంకరించి పూజించినవాడు వైకుంఠంమున విష్ణుసన్నిధానమున నుండును. గీతయంతయు పారాయణము చేయజాలనివాడు కార్తీకమున శివకేశవాలయములలో దేనిలోగాని కూర్చుండి భక్తియుక్తుడై భగవద్గీతలోని విభూతియోగమునుగాని, విశ్వరూపయోగాధ్యాయమునుగాని పఠించిన విష్ణులోకప్రాప్తి సిద్ధించును. అదికూడ చదువలేనివాడందలి యొకశ్లోకమును గాని, ఒకశ్లోకపాదమునుగాని స్వామిసన్నిధానమున పఠించిన నిఖిలపాపములు పాసినవా డగును. మరియు కార్తీకమున ఫలవృక్షములతోను, పుష్పలతలతోను, నిండినవనమందు, ఉసిరిక చెట్టుక్రింద శ్రీహరిప్రీతికై సాలగ్రామదానమును విధివిధానమునబూజించి నీడను భోజనముచేసినవానికి సర్వపాపవిముక్తియగును. కార్తీకమున వనమం దుసిరిక చెట్టునీడను గూర్చుండి శ్రీమన్నారాయణ ప్రీతికై జపించునపుడును, హోమక్రియ నాచరించునపుడును, దేవతార్చన మొనరించునపుడును, పితృతర్పణము చేయునపుడును, భోజనము గావించునపుడును శూద్రులమాటలు, చండాలునిమాటలు, పతితులవాక్కులు వినినను, మైలపడినవారి పలుకు లాలించినను దోషములేదు, కార్తీకమాసమం దారాను

మున భోజనము చేయుదలంచిన వాడు, ఉసిరిక చెట్లున్నతోటకే పోవల
యును. ఆ చెట్టుక్రింద నే సాలగ్రామముంచి భక్తితో భగవంతుని పూజించి,
శక్త్యనుసరించి, బ్రాహ్మణులకు భోజనంబిడి, దక్షిణతాంబూలాదులచే
సత్కరించి పిమ్మట తాను భుజింపవలెను. అట్లుచేసిన వానికి దేశకాలాదుల
వలనగలిగిన పాపంబులు నశించి ముక్తి సిద్ధించును. మఱియు భోజనానం
తర మావనమందే ఉసిరిక చెట్టుక్రింద గూర్చుండి పురాణపఠన చేయ
వలెను. లేదా యితరులు చదువుచున్న వినవలెను. ఆరీతిగా నొనరించిన
వానికి బ్రాహ్మణపుత్రునకువలె నీజన్మహేతువైన పాపము నశించుననెను.

రాజా—

కోవిప్రసూనుః కిం కర్మ కృతవాన్యేన ముచ్యతే।
ఏతద్బ్రహ్మన్ సమాచక్ష్వ శ్రోతుమిచ్ఛామి సాంప్రతమ్॥

అంత జనకమహారాజు ఓమునీంద్రా! ఆబ్రాహ్మణపుత్రున కేకార
ణమున నెట్టి నీచజన్మ కలిగినది. అదియెట్లుపోయినది? అదినాకు విస్తరించి
చెప్పుడనెను.

వసిష్ఠః—

శృణు రాజన్ ప్రవక్ష్యామి కావేర్యా వైతటే శుభే।
దేవశర్మ ఇతిఖ్యాతో వేదవేదాంగపారగః॥ 15
తస్య సూను ర్దురాచార స్తమాహ స్వసుతం పితా।
వక్ష్యామి శృణు తే పుత్ర సర్వపాపవిముక్తయే॥ 16
కురుష్వ కార్తికే మాసి స్నానం కేశవపూజనం।
దీపమాలార్పణం తస్య విష్ణో రమితతేజసః॥ 17
ఇతి శ్రుత్వా సుత స్తస్య పితరం పున రబ్రవీత్।
కుతః కార్తికధర్మేతి తన్న కార్యం మయాసకృత్॥ 18

అంత నాముని, రాజేంద్రా! కావేరీనదీ తీరమందలి యొకకుగ్రామ
మున దేవశర్మయను విప్రుండు గలడు. అతని కొక కుమారుడుండెను.
వాడు చిన్నతనమునుండి భయభక్తులులేక, పెద్దలను లక్ష్యపెట్టక మిగుల
దురాచారుడయ్యెను. తండ్రి వాని చెడు నడత నెఱింగి వాని నరికట్ట

దుస్సాధ్యమని యెంచి యొకదినమున వానింబిలచి, ఓక్రూరుడా! నీవు నా కడుపు చెడబుట్టితివి. నీ వెంత దుష్ప్రవర్తకుడవైనను కార్తీకమాసమున నదీస్నానముం జేసి శ్రీహరిని పూజించి దేవాలయమున సూర్యాస్తమయమునకు దీపారాధన జేసితివేని సకలపాపంబులనుండి విడివడి కృతార్థుడవగుదువు. ఇది కార్తీకధర్మము. తరువాత నరకబాధల ననుభవించునవస్థ జేడ్చెదవని చెప్పి, వానిచే నెట్లయిన కార్తికమాసమున నదీస్నానము మొదలయినవి చేయింప ప్రయత్న మొనర్చెనుగాని యామూఢుడు తండ్రి చెప్పిన మంచిమాటల నాలింపక యనాదరభావమున కార్తీకమేమిటి స్నానమేమిటి, యని తృణీకరించెను.

తచ్ఛ్రుత్వా కోపతామ్రాక్షః, శశాప సుత మంజసా।
మూషకో భవదుర్బుద్ధే అరణ్యే ద్రుమకోటరే॥ 19
అయాచత విశాపఞ్చ పశ్చాత్తాపేన భూమిప।
దురాచారస్య మే తాత కథం ముక్తిర్భవిష్యతి॥ 20
న చాహం కార్తికం ధర్మం యదా శ్రోష్యసి పుత్రక।
ముక్తిస్తే భవితా నూనం తస్య పుణ్యప్రభావతః॥ 12

తండ్రి వాని నిర్లక్ష్యభావమును గాంచి మహాకోపముతో, ఓదుష్టుడా! కార్తీకస్నాన దీపధర్మాదులను చేయుటకు తిరస్కరించితివి కాన నొక మూషికమవై పుట్టి చెట్టుతొఱ్ఱలో పడియుందువుగాక, యని శపించెను. ఆ కుపుత్రుం డది విని పశ్చాత్తాపమంది, తండ్రీ! నాకీశాపమును తప్పింపుము. ఇక బుద్ధిగలిగి వర్తించెదనని తండ్రిని ప్రార్థించెను. అంత దేవశర్మ, నాశాపమెన్నటికి నమోఘముకాదు. నీవనుభవింపక తప్పదనెను. నాకీశాపవిముక్తి యెప్పుడెట్లగునో యనుగ్రహింపుమని పరిపరివిధంబుల బ్రతిమాలగా, నీవెప్పుడు మూషికమైపడియుండి కార్తీకమహాత్మ్యమును వినగలుగుదువో అప్పుడు నీకు శాపవిముక్తి యగునని చెప్పెను.

ఇత్యుక్త్వా విరతే శ్రీఘ్రం సుతః పితరి సోఽవ్యథ।
తత్క్షణా న్మూషకో భూత్వా గజారణ్యే ద్రుమే న్నృప॥ 22

సుఫలే సర్వజీవానా మాశ్రయే చ సుఖప్రదే।
ఏవ మంతరితే కాలేతత్రాగాత్కౌశికో మునిః 23
శిష్యేభ్యః కార్తికస్నానం కృత్వా తన్మూలమాశ్రితః।
పురాణపఠనం తత్ర మాహాత్మ్యం కార్తికస్య చ। 24
చకార భక్తిభావేన తన్మూలే నరపుంగవ।
తదా కశ్చిద్దురాచారో వ్యాధ శ్చాపధర శ్చరః॥ 25
మృగయాం సంచరన్నాగాత్ప్రాణిహింసాపరాయణః।
విప్రాన్హంతుం సముద్యుక్తో దయాహీనోఘమూర్తిమాన్॥
తేషాం దర్శనసమ్భూతా సంజ్ఞా సర్వార్థసాధినీ।
తా నువాచతతః ప్రీతః కిమిద కర్మ చోత్తమమ్॥ 27
తేనైవ ముక్తోరాజర్షి ర్విశ్వామిత్ర స్త మబ్రవీత్।

వాఁడా క్షణంబుననె యెలుక పుట్టువు పుట్టి యనేకఫలపుష్పాన్వితమై, సుఖాస్పదమైన గజారణ్యమను మహాటవికింబోయి యొకచెట్టు తొఱ్ఱలోనుండి కాయలను దినుచు జీవించుచుండెను. ఆకాననము కావేరీ తీరమందుండుటచేత సర్వకాలముల వివిధ ఫలభరితమై యుండును. ఆవనమున పలువిధములైన జంతుసమూహములు జీవించుచుండెను. ఈరీతి కొంత కాలము గడచిన తర్వాత నొక దినమున విశ్వామిత్రమహర్షి శిష్యులతోఁ గూడవచ్చి కావేరీనదీతీరమునవిడిసి ప్రతిదిన మానదియందు స్నానమొనరించి యొక చెట్టునీడను గూర్చుండి కార్తీకమాహాత్మ్యమును తన శిష్యులకు పురాణము చెప్పుచుండెను. ఆసమయమున నొకనాఁ డొకకిరాతుడు నిత్యము జీవహింసచేయువాఁడు జంతువులను జంపుటకు ధనుర్బాణములను ధరించి యాప్రాంతమునకు వచ్చెను. వేటాడు తమ కంబున నున్న తత్కిరాతునకు మనుజుల వాక్యములు వినబడి నంతనే వారికడకు వచ్చుచుండెను. నిరంతర జీవహింసా పరాయణుఁడైన యా కిరాతుడు వారినిగొట్టి దోచుకొనవలెను. దుర్బుద్ధి నశించి మంచిబుద్ధి కలిగి వారికి నమస్కరించి, మహానుభావా! తాము చెప్పుచున్న దేమని యడిగెను.

విశ్వామిత్రః—

శృణు వ్యాధ ప్రవక్ష్యామి బుద్ధిస్తే విమలోదయా॥ 28
ధర్మః కార్తికమాసస్య నరాణాం కీర్తివర్ధనః।
కార్తికేమాసి యో మోహాత్ స్నానం దానాదికం
చరేత్।
స సర్వపాపనిర్ముక్తో యాతి విష్ణోః పరం పదం।
భగవద్భక్తిభావేన కార్తికే మాసి మానవః॥ 30
ధర్మాం సమాచరేత్సద్యో జీవన్ముక్తోన సంశయః।
వ్యాధః ప్రత్యుక్తమాకర్ణ్య ధర్మం చ ఋషిణాం నృప॥
మూషక స్తత్ర తచ్ఛ్రుత్వా ముక్తదేహ స్తతోఽగమత్
విశ్వామిత్రస్తు తం దృష్ట్వా స బభూ వాతివిస్మితః॥ 32
నివేద్య సకలం కర్మ విప్రసూను రుదారధీః।
సద్య స్సందర్శయం స్తత్ర వ్యాధాయై తత్ఫలం నృప॥33
అనుజ్ఞాతోయయౌ శీఘ్రం విప్రసూను స్స్వమాశ్రమం।
వ్యాధోఽపి సకలం తస్మాచ్ఛ్రుత్వాఽవాపశుభాంగతిమ్।
ఇచ్ఛతే యది యో లోకే గతి మత్యంత దుర్లభాం।
కార్తికస్య చ మాహాత్మ్యం శ్రవణం చాభ్యసేత్సుధీః
పుణ్యా తేనాధికం ప్రాప్య ప్రయాతి పరమాంగతిమ్।

అంత విశ్వామిత్రుడా కిరాతునితో, ఓకిరాతా! నీకు సద్బుద్ధి కలిగినది. నేము చెప్పుకొనునది కార్తీకమాహాత్మ్యము తెలిసిగాని, తెలియకగాని కార్తీకమాసమున ప్రాతఃకాలమున స్నానదానములు చేసినవారి పాపంబులన్నియు నశించును. భక్తితో నాదినమున భగవంతుని పూజించినవారికి జీవన్ముక్తి సిద్ధించును. ఇందులకు సందేహము లేదు. ఆసమయమున చిరకాలమునుండి చెట్టుతొఱ్ఱలో మూషికరూపుడైయున్న బ్రాహ్మణ

కుమారుడు విశ్వామిత్రుడు చెప్పుచున్న కార్తీకమాహాత్మ్యమును వినుటచే శాపము పోయి బ్రాహ్మణరూపంబు ధరించెను; విశ్వామిత్రుడతనిం జూచి యక్కజ పడి నీవెవ్వడవని యడుగ నాతడు తనవృత్తాంతమంతయు నాముని కి జెప్పి తమదయవలన నేను శాపవిముక్తి నొందితినని నమస్కరించి తన దారిని బోయెను. కిరాతునకు విశ్వామిత్ర దర్శనమువలన, సర్వపాపము లును నశించి పుణ్యాత్ముడయ్యెను.

తస్మాత్సర్వప్రయత్నేన కార్తికే ధర్మ మాచరేత్ ॥ 36
ఇదం సత్య మిదం సత్యం ధాత్రా వై సుశ్రుతం మయా।
పురాణేషు మతిం రాజన్ కురు సమ్య క్ప్రయత్నతః॥ 37
యాస్యసి త్వం పుణ్యగతిం నాత్ర కార్యా విచారణా।

కావున మోక్షేచ్ఛగలవారందరును కార్తీకమాహాత్మ్యమును శ్రద్ధా ళువులై వినవలయును. కష్టమని తలంపక శక్తినిబట్టి ప్రయత్నించి స్నాన దానముల నాచరించిన వారికి మోక్షము కరతలామలకము. ఓజనకమహా రాజా! నీవును పురాణములందు నమ్మకముంచి పురాణపఠనము చేయించి వినుచు తత్ప్రకారంబు చరించిన ముక్తినందగలవు. నేను దీనిని పరమేష్ఠి వలన వినియుంటిని. నీవు సదాచారుండవని, పుణ్యాత్ముండవని చెప్పితిని.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
అయిదవ అధ్యాయము

---

# షష్ఠో ఽ ధ్యాయః

వసిష్ఠః—

యః కార్తికే మాసి రాజన్ స్నానం పంచామృతేన చ
కస్తూరీగంధతోయేన విష్ణో రమిత తేజసః॥ 1

యః కుర్యా ద్భక్తిభావేన మాస మేకం నిరంతరం।
సోఽశ్వమేధాయుతఫలం ప్రాప్య యాతి శుభాంగతిమ్॥ 2
యే సాయాహ్నే హరేరగ్రే కార్తిక్యా మవనీపతే।
దీపదానం ప్రకుర్వంతి తద్విష్ణోః పరమం పదమ్॥ 3
కార్తికే మాసి సంప్రాప్తే దీపదానం కరోతి యః।
సుజ్ఞానం ప్రాప్య విమలం విష్ణో ర్లోకమవాప్నుయాత్॥ 4
తూలం సంశోధ్య విధినా వర్తిం కృత్వా ప్రయత్నతః।
శాలిపిష్టేన తత్పాత్రం గోధూమే నాథవా నృప। 5
కార్తిక్యాం కారయే ద్భక్త్యా ఘృతవర్తిసమన్వితమ్।
ఘృతపూరితతత్పాత్రం వహ్ని జ్వాలానియోజితమ్॥ 6
విప్రాయ వేదవిదుషే పూజ్యం భక్త్యా ప్రదాపయేత్।
ఏవం క్రమేణ రాజేంద్ర మాసమేకం నిరంతరమ్॥ 7
మాసాంతే రజతం పాత్రం వర్తిం కృత్వా సువర్ణకం।
శాలిపిష్టస్య మధ్యస్థం పూజ్యాయ చ నివేదయేత్॥ 8
బ్రాహ్మణా న్భోజయేత్పశ్చాత్ స్వయ మేవ తతఃపరం।
మంత్రేణానేన రాజేంద్ర కుర్యాద్దానమిదం శుభమ్॥ 9
సర్వజ్ఞానప్రదం దీపం సర్వసంపత్సుఖావహం।
దీపదానం ప్రదాస్యామి శాంతి రస్తు సదా మమ॥ 10

వశిష్ఠుండు మరల మిథిలాధిపతింగాంచి ఓ జనకమహారాజా! నీకిపుడు కార్తీకమాసమున జేయవలసిన ధర్మములంతయు వివరించి చెప్పుచుంటి నాలింపుము. ఏమానవుడు కార్తీకమాసము నెలదినములు శివకేశవులను పంచామృతస్నానముచేసినా, కస్తూరి కలిపిన మంచిగంధపునీటితోను భక్తితో పూజించునో, వానికి పదివేల అశ్వమేధయాగములు చేసినఫలము లభించును. అంతియే కాక కైవల్యము సిద్ధించును. ఆట్లే శివకేశవాలయములలో దేనియందుగాని దీపముంచిన వైకుంఠవాసుడగును. ఇంక దీపదా

నము నెట్లు చేయవలెనో చెప్పుచుంటిని. ప్రత్తి స్వయముగాతీసి శుభ్ర పఱచి దానితో వత్తి చేయవలెను. ఆవత్తిని వరిపిండితోగాని, గోధుమ పిండితోగాని, జేసిన ప్రమిదలోనుంచి ఆవునేయిపోసి దీపము వెలిగించి యాప్రమిదను బ్రాహ్మణునకు దానమిచ్చి శక్తికొలది దక్షిణనీయవలెను. ఈరీతిగా కార్తికమున నెలదినములు దీపదానమొనర్చి, మాసాంతమున వెండిప్రమిద, బంగారువత్తి చేయించి యాప్రమిదలో వెనుక చెప్పబడి నటుల వరిపిండితోగాని, గోధుమ పిండితోగాని, బుడ్డిచేసిపెట్టి, ప్రత్తితో చేసిన వత్తివేసి, ఆవునెయ్యి నిందుగాపోసి దీపమును వెలిగించి వెలుగు చున్న దీపముతోను నెలదినములు దానము పట్టిన బ్రాహ్మణునకేయిచ్చి షడ్రసోపేతమగు భోజనమునిడి తగుదక్షిణ నీయవలెను.

ఏవంయఃకురుతే రాజన్ నారీ వా పురుషోఽపివా।
కార్తికే మాసి రాజేంద్ర సోఽక్షయ్యం ఫలమశ్నుతే॥
దీపదో లభతే విద్యాం దీపదో లభతే శ్రుతం।
దీపదో లభతే చాయుః దీపదో లభతే దివమ్। 12
జ్ఞానాజ్ఞానకృతంపాపంమనోవాక్కాయ కర్మభిః।
కార్తికే దీపదానేన విలయం యాతి తత్‌క్షణాత్॥ 13

ఈవిధముగా కార్తికమాసమున నెలదినములు శివకేశవారాధనను, దీపదానమును చేసి, మాసాంతమున శక్తి ననుసరించి బ్రాహ్మణసమారాధన చేయవలెను. సమారాధనచేయు శక్తిలేనిచో పదిమందికైనను భోజన మిడవలెను. అంతకును శక్తి చాలదేని దీపదానముపట్టిన బ్రాహ్మణున కొకనికైనను పెట్టవలెను. ఈరీతిని పురుషులుగాని, స్త్రీలుగాని యెవరు చేసినను, అక్షయసుఖముల నందుదురు. ఆయువృద్ధియు, విద్యాధనాభి వృద్ధియు గలిగి యిహలోకమున ననంతసుఖులై పిదప మోక్షమునందును. మనోవాక్కాయకర్మల వలనను, ఎఱిగియు నెఱుగకయు చేసిన పాపంబుల వలనను ముక్తుడగును.

శృణురాజన్ ప్రవక్ష్యామి పురావృత్తం మనోహరం।
పురా ద్రావిడదేశే తు అంగనా కాచిదవ్యభూత్ 14

సుతబంధువిహీనా సా సదా భిక్షాన్నజీవినీ ।
న సంస్కృతాన్న మల్పం చ భుక్త్వా పర్యుషితాశనా॥
పరపాకరతా నిత్యం నిత్యం కుట్టన వేషిణీ ।
క్రయవిక్రయశీ రాజన్ ఆర్జితా భుక్తశేషతః॥
న ధ్యాతం విష్ణుపాదాబ్జం న శ్రుతా హరిసత్కథా।
న గతా పుణ్యతీర్థాని నోపోష్యం విష్ణువాసరే। 17
ద్రవ్యం నానావిధం భూప సంచితం బహుసంతతయా।
నచోపకారం నోదానం న కృతం స్వాత్మభోజనమ్॥ 18

దీనిని గురించి యొక యితిహాసమున్నది. తొల్లి ద్రవిడదేశమున నొక గ్రామమున నొక స్త్రీకలదు. ఆమెకు భర్తలేడు. సంతానములేదు. బంధువులును లేరు. కావున నన్యగృహంబులందు దాస్యముచేసి జీవించుచుండెను. ఒకనాడుకూడ తనయింట వండుకొని భుజింపక నేయింట నేది పెట్టిన దానినే తిని కాలక్షేపము చేసెడిది. మహాలుబ్ధురాలు. పరుల యింట చలిదియన్నమిడిన దానినేతిని గడపుచు కొంతధనమార్జించి, కొన్ని సరకులనుగొని లాభమున కమ్ముచు, పెద్దవడ్డీకప్పులిచ్చుచు, తాకట్టుపెట్టిన వస్తువులు చోరులపహరించిరని, మీరు తాకట్టే పెట్టలేదని యబద్ధమాడి యావస్తువుల నపహరించియు తన మోసపు బలుకులచే నందఱకు తలలోని నాల్కవలెనుండి చాల ధనమార్జించెను. ఆమె రాత్రింబవళ్ళు ధనార్జనమె ప్రధానముగా బెట్టుకొని కాలము గడపుచుండెను. తన జీవితములో నెప్పుడును ఉపవాసముండి యెఱుగదు. ఏపుణ్యతీర్థమును త్రొక్కలేదు. పురాణశ్రవణ మంతకన్నలేదు. పరోపకార మసలేమున్న భగవన్నామస్మరణము స్వప్నమందైన చేయలేదు. ఒక్కబ్రాహ్మణునకు భోజనమిడలేదు. తాను సంపాదించిన ధనముతో నొక్కనాడు, తాను కూడ సుఖింపలేదు.

ఇత్థ మజ్ఞానసంపన్నా మాహ కశ్చి ద్ద్విజోత్తమః
దైవయోగాత్సమాయాతః శ్రీరంగం ద్రష్టు మిచ్ఛయా
స విప్రవర్యస్తాం దృష్ట్వా పాపబుద్ధి ముపాశ్రితాం।
అథాహ కృపయా రాజన్ సర్వభూతదయానిధిః। 20
వక్ష్యామి సాంప్రతం మూఢే మద్వాక్య మవధారయ।
దుఃఖాదుఃఖమయో దేహః త్వఙ్మాంసాస్థిసమన్వితః। 21
దుఃఖాగారోఽస్త్యయం మూఢే భూతైః పంచభిరన్వితః।
దేహావసానే తే యాంతి పంచభూతాః పృథిక్పృథక్॥ 22
యథైవ గేహవలజా నాశం యాంత్యుదబిందవః।
జలబుద్బువద్దేహో నాశ మాయాతి నిశ్చితమ్॥ 23
అనిత్యం దేహ మాశ్రిత్య నిత్యత్వంమన్యసే హృది।
తస్మా దంతస్థ్సితం మోహం త్యజ మూఢే విచారతః॥
పతంగోఽగ్నిం సమాగత్య పతత్యేవ స్వయం యథా।
స్మర సత్యాత్మకం దేవం సర్వభూతదయానిధిమ్॥ 2౫
ధ్యానం కురు మహావిష్ణోః పాదపంకజ ముత్తమం।
కామం క్రోధం భయం లోభం దేహం ద్రవ్యాభిలాషణం
త్యజ విష్ణుపదద్వంద్వం భజ భక్త్యా హ్యనన్యయా।
కురుష్వ కార్తికస్నానం భక్తిభావేన కేశవే। 27
యథా దానం తథా కార్యం కార్తికే చాల్ప మేవ చ।
దీపదానం ప్రయత్నేన బ్రాహ్మణాయ మహాత్మనే॥ 28
తేన నశ్యంతి పాపాని జన్మాంతరకృతాన్యపి।
మా కురుష్వాత్ర సందేహం మహాపాపవిముక్తయే॥ 29
ఇత్యుక్త్వా స యదా ధీమాన్ ఐంద్రీం విప్రవర స్తదా

ఇట్లామె కాలము వెళ్ళించుచుండ నొకబ్రాహ్మణుడామెయున్న గ్రామమునకు వచ్చెను, అతడు శ్రీరంగము పోవుచు మార్గమధ్యమున నీగ్రామమున నిలువవలసి వచ్చెను. ఆవిప్రుడు దయార్ద్రహృదయుడు, శాంతుడు, మహాపండితుడు, పరోపకారి. ఎట్లో యీ లుబ్ధురాలి వృత్తాంత మాయనకు దెలిసెను. వెంటనే యామె యింటికిబోయి పరోపకారియగు నావిప్రుడామెను బిలిచి తల్లీ! నావచనము నాలింపుము. నాపై కోపగింపకుము. శరీరముకన్న దుఃఖభాజనమైన దింకొకటి లేదు. ఇది పంచభూతాత్మకమైన మాంసము, చర్మము, ఎముకలు, రక్తము మొదలగు సప్త ధాతురూపములుగా నిర్మింపబడినది. ప్రాణమున్నంతవరకే దేహమతిప్రియముగానుండి యవసానకాలమున నీటిబుగ్గవలె నాశనమందును. ఆసమయమున పంచభూతములు పంచభూతములలో గలిసిపోవును. నీవీయనిత్యశరీరమును నిత్యమని భావించుచుంటివి. అదియే యజ్ఞానము. ఈయజ్ఞానమును విడిచిపెట్టుము. నీలో నీవే యోచించుకొనుము. శలభమగ్నిజ్వాలలను జూచినంతనే తాను తినదగిన వస్తువని మిట్టిపడుచు పోయి దానిలోబడి చచ్చును. దేహము నిత్యమని భావించువాడు నట్లే నశించును. వాని కిహపరసౌఖ్యము లుండవు. నామాట విశ్వసించి నీవు సంపాదించిన ధనమును నీవనుభవింపుము. దానధర్మములను చేయుము. హరిహరుల కైంకర్యమున కుపయోగింపుము. శ్రీమన్నారాయణ స్మరణ సదా విధముగ చేయుచుండుము. కామక్రోధాద్యరిషడ్వర్గమును విడనాడుము. ధనసంపాదనేచ్ఛ త్యజింపుము. భగవత్పాదసేవన నొనరింపుము. కార్తీకమాసవ్రతమును చేయుము. పురాణశ్రవణము చేయుము. ఇట్లొనర్చితివేని నీవీజన్మయందును, వెనుకటి పుట్టువునందు నొనర్చిన సర్వపాపంబులు నశించి పుణ్యాత్మురాల వగుదువు. కార్తీకమాసమున నెలదినములు నదీస్నానమును జేయుము. శివకేశవులందు భక్తిగలిగి వారియాలయములందు దీపారాధన చేయుము. పిదప దీపదానమును జేయుము. వారిని స్మరింపుము. భజింపుము. తరింపుము. అజ్ఞానమును పరిహరింపుము, సంసారసాగరమునుండి నిస్సహాయురాలవగు నిన్ను నీవే యుద్ధరించుకొనుము. దేహమున పటుత్వము తగ్గి జరాభార మంకురించినపిదప చేయనేరని పలువిధంబుల బోధించి యావిప్రుడు శ్రీరంగమున కేగెను.

ఇతి తేనోదితం శ్రుత్వా విస్మితా రాజసత్తమ॥ 30
పశ్చాత్తాప మనుప్రాప్య సాఽకరోత్కార్తికవ్రతం।
పతంగోదయవేళాయాం కార్తికస్నాన మాఽపసి॥ 31
హరేః పూజాం దీపదానం పురాణశ్రవణం తథా।
మాసాంతే విప్రముఖ్యేభ్యో భోజనం సా ప్రయచ్ఛతి॥ 32
కార్తికేతు సదారాజన్ మాసస్నానం కరోతి సా।
తేన శీతజ్వరోత్పత్తి ర్జాయతే కుక్షిరోగతః॥ 33
తప్యమానా దివారాత్రం దుఃఖా ద్బాష్పాకులేక్షణా।
మమార బంధుహీనా సా స్వర్గలోకంగతా ముదా॥ 34
తస్మాత్కార్తికమాసే తు దీపదానం విశిష్యతే।
జ్ఞానాజ్ఞానకృతం పాపం కార్తికేదీపదానతః॥ 35
నశ్యతేనాత్రసందేహ శ్శంకరేణోదితం పురా।
ఇదం రహస్య మాఖ్యానం కథితం తవ భూపతే॥ 36
యచ్ఛ్రుత్వా ముచ్యతే జంతు ర్జన్మసంసారబంధనాత్।

పిదప యావితంతు వావిప్రోత్తముని సదుపదేశమున జ్ఞానవతియై యాతనిమాటలను విశ్వసించి తన తొల్లిటి నడవడికకు పశ్చాత్తాపమందినది. ప్రతిదిన మేదోయొక దానమును చేయుచుండెడిది. కార్తీకమాసము వచ్చినంతనే యానెలదినములు ప్రతిప్రాతః కాలమున నదీస్నానముజేసి, భగవంతుని పూజించి, పురాణశ్రవణముచేసి, మాసాంతమున దీపదానముచేసి, బ్రాహ్మణసమారాధన గావించి, దక్షిణలిచ్చి తృప్తిచేసెడిది. ఈరీతిగా జీవించియున్నంత కాలము కార్తీక వ్రతమాచరించినది. దానంజేసి పుణ్యాత్మురాలయ్యెను. కొంతకాలమారీతి గడువ నావితంతువు జ్వరపీడితయై మరణించి స్వర్గసౌఖ్యము ననుభవించెను. కార్తీకమున దీపదానము ముఖ్యమనియూ నది సర్వపాపపరిహారక మనియు శంకరుడు వచించెను. కావున

నీవు వ్యయప్రయాసములు స్వల్పముగానుండి ఫలమత్యధికముగా నున్న దీప దానమును చేయుము. ఈప్రకారమాచరించిన జన్మరాహిత్యమునొంది మోక్షప్రాప్తి కలుగును.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని

ఆఱవ అధ్యాయము

---

# సప్తమోఽధ్యాయః

వసిష్ఠః—

పునః కార్తికమాహాత్మ్యం ప్రవక్ష్యామి సమానతః।
తచ్ఛృణుష్వ నరశ్రేష్ఠ ప్రసన్నేనాంతరాత్మనా॥ 1
యః కార్తికేఽర్చయే ద్భక్త్యా కమలైః కమలేక్షణం।
తస్య గేహేవసేన్నిత్యం కమలా నాత్రసంశయః॥ 2
దేవేశం భక్తి యోగేన తులసీజాతి పుష్పకైః।
అర్చయే ద్యది మాసేఽస్మిన్ స చ భూ న జాయతే॥ 3
కార్తికే బిల్వపత్రేన విష్ణువ్యాపక మీశ్వరం।
యః పూజయే న్నరశ్రేష్ఠ స తు భూయోన జాయతే॥ 4
ఫలదానం కార్తికేయః కుర్యా త్సద్భక్తి యుక్తితః।
పాపాని విలయం యాంతి తమాంసీ వారుణోదయే॥ 5
యో ధాత్రీ ఫలమూలే తు ధృత్వావిష్ణుం ప్రపూజయేత్
యమస్తం నేక్షితుంశక్తః నాత్రకార్యా విచారణా॥ 6

సాలగ్రామార్చనం రాజ న్మార్జే మాసి ప్రయత్నతః।
తులసీదళై రర్చ యేచ్చయ స్స ధన్యో న సంశయః॥ 7
యో వనే భోజనం కుర్యా ద్విప్రై స్సార్థం నృపోత్తమ।
కార్తికే తేన నశ్యంతి మహాపాతక కోటయః॥ 8
ధాత్రీవృక్షసమీపేతు సాలగ్రామార్చనం నరః।
యః కుర్యాద్రాజశార్దూల కార్తికే బ్రాహ్మణై స్సహ॥
స వైకుంఠపురం ప్రాప్య విష్ణునా స్మోదతే చిరం।
యః కార్తికే మాసి భక్త్యా తోరణం చూతపల్లవైః॥10
దామోదరాగ్రే యః కుర్యా త్స యాతి వరమాం గతిం।
కదళీస్తంభ పూజాం చ యః కుర్యాత్కార్తికే హరేః
పుష్పైర్వా మంటపం కృత్వా స్స వైకుంఠే చిరం వసేత్।
కార్తిక్యాం కేశవ స్యాగ్రే నమస్కుర్వంతి యే సకృత్।
సర్వపాపవినిర్ముక్తా అశ్వమేధఫలం స్మృతం।
కార్తికే విష్ణుసాన్నిధ్యే జపహోమసురార్చనం। 13
యః కుర్యా ద్యాతి వైకుంఠం పితృభిస్సహ భూమిప।
కార్తికే వస్త్రదానం చ యః కుర్యాత్ స్నానశీతలే॥14
సోఽశ్వమేధాయుతానాం చ ఫలం ప్రాప్నో త్యసంశయః।

వశిష్టమహర్షి మరల జనకమహారాజుం గాంచి, ఓరాజా! ఇంకను కార్తీకమహాత్మ్య విశేషములను చెప్పుచుంటిని నాలింపుము. కార్తీమాసమందు శ్రీహరిని సహస్ర నామావళితోగూడ సహస్రకమలములచే పూజించినవానియింట లక్ష్మిస్థిరముగా నుండును. తులసి బిల్వదళంబులలో నెవనిచే సహస్రనామార్చన మొనరించినను వారికి జన్మరాహిత్యమగును. ఫలదానమేదైనను భక్తితో నొనర్చిన సూర్యోదయమున గాంధాథకారము నశించిన

వగిది వారి పాపములు నశించును. ఉసిరిక చెట్టుక్రింద భగవంతుని కార్తీక మాసమున పూజించిన వానికడకు యముడు రాజాలడు. సాలగ్రామమును పూజించినవాడెట్టి పుణ్యాత్ముడని వచింప నశక్యము. బ్రాహ్మణులతో కలిసి యుసిరి చెట్టుక్రింద భుజించిన వానిపాపరాసులన్నియు పటాపంచలగును. ఉసిరిక చెట్టుక్రింద శ్రీమన్నారాయణుని సాలగ్రామముగ భావించి యర్చించినవాడు వైకుంఠ నివాసుడగును. మామిడి చిగుళ్ళతో కార్తీకమాసమున దేవాలయమునందు తోరణములు గట్టినవాడు కైవల్యము నందును. కదళీ తరువులచే మండపముగట్టి పూలదండలచే నలంకరించి దాని మధ్యమున భగవంతు నర్చించినవాడు వైకుంఠమున స్థిరనివాసుడగును. పై చెప్పినరీతిగా కార్తీకమాసమున స్నానదీపదానాదులు చేయ నశక్తులైనవారు ప్రాతస్సాయంకాలములందు దేవాలయమున కరిగి సాష్టాంగ నమస్కార మొనరించిన వారి పాపములన్నియు నశించి యశ్వమేధయాగ మొనరించిన ఫలితము నందుదురు.

యః కార్తికే మాసి విష్ణోః శిఖరే ధ్వజమర్పయేత్ । 15
తేన నశ్యంతి పాపాని వాయునా పాంసవో యథా।
కార్తిక్యా మతసీపుష్పైరర్చయే దచ్యుతం నరః॥ 16
సితాసితైర్వా రాజేంద్ర యజ్ఞాయుతఫలం భవేత్ ।
బృందావనాగ్రే కార్తిక్యాం గోమయేనోపలిప్య చ॥ 17
స్వస్తికైశ్శంఖ పద్మాద్యైర్యా కుర్యాత్సా హరేః ప్రియా
నందాదీపం తు కార్తిక్యా మర్పయే ద్విష్ణుమందిరే॥ 18
తత్ఫలస్య చ మర్యాదా బ్రహ్మణాపి నశక్యతే।
నశ్యేదేతద్యథా రాజన్ ప్రవిశ్ర భ్రష్టోఽభిజాయతే॥ 19
తిలవ్రీహీ సమాయుక్తం మునిపుష్పైస్సమన్వితం।
నందాదీపం విధానేన కార్తిక్యాం విష్ణవేఽర్పయేత్ 20
యః కార్తిక్యా మర్కపుష్పై రర్చయే ద్గిరిజాపతిం।
న లబ్ధ్వా పూర్ణ మాయుష్యం పశ్చాన్మోక్షమవాప్ను
యాత్ ।

రాజన్ యః కార్తికే మాసి కేశవాలయమంటపం।
అలంకరోతి యో భక్త్యా స యాతి హరిమందిరమ్॥ 22
మల్లికా కుసుమై ర్దేవం మాధవం కార్తికేఽర్చయేత్
తేన నశ్యంతి పాపాని తమ సూర్యోదయే యథా॥ 23
తులసీకాష్ఠ గంధం తు సాలగ్రామస్య యోఽర్పయేత్।
సర్వపాపవినిర్ముక్తః యాతి విష్ణోః పరం పదం
యః కుర్యాత్కార్తికే విష్ణోః నర్తనం నర్తకీ తథా।
జన్మాంతరార్జితం పాపం నాశం యాతి న సంశయః॥ 25
కార్తికే మాసి రాజేంద్ర కేశవాలయమండనం।
యః కుర్యాత్సోపి వైకుంఠే విష్ణుసాయుజ్యమాప్నుయాత్
కార్తికే చాన్నదానం చ యః కుర్యాద్భక్తిమాన్నరః
తస్యాఘం నశ్యతి క్షిప్రం పవమానాద్యథా ఘనః॥ 27
తిలదానం నదీస్నానం భోజన బ్రహ్మసత్రకే।
కార్తికే చాన్నదానం చ ధర్మమేతి చ్చతుష్టయమ్॥
నకుర్యాద్యశ్చ కార్తిక్యాం స్నానదానం నరాధమః।
శ్వానయోనిశతం గత్వా చండాలత్వ మతఃపరమ్॥ 29
నారీ వా పురుషో వాఽపినకుర్యాత్కార్తికవ్రతమ్।
రసభీం యోని మాయాతి శ్వానయోనిశతం తథా॥ 30
కదంబ పుష్పైః కార్తిక్యా మర్చయే ద్భక్తవత్సలం।
స సూర్యమండలం భిత్వా స్వర్గలోకే వసే చ్చిరమ్ 31
కేతక్యా కార్తికే మాసి యః పూజయతి భక్తితః।
సప్తజన్మ భవే ద్విప్రో వేదవేదాంగ పారగః 32
సహస్రపత్రైర్యో విష్ణుపూజాం వై కార్తికే నృప।
స మిత్రపదవీం ప్రాప్య దీర్ఘాయుష్య మవాప్నుయాత్ 33

ఈ మాసమందు భక్తినియమములతో శివకేశవాలయంబుల కరిగి మంత్రజప దేవతార్చన హోమాదులలో నేపుణ్యకార్య మొనరించినను పితృదేవతలతోగూడ వైకుంఠప్రాప్తి యగును. వస్త్రదాన మొనరించిన వారికి పదివేలఅశ్వమేధయాగము లొనర్చిన ఫలమొనగూడును. శివకేశవాలయంబులలో దేనియందైన జండాయెత్తిన వారి పాపరాసులు పెనుగాలిచే ధూళిరాసులు చెదరునట్లు నశించును. నలుపు తెలుపు రంగులలోనే అవిసి పూలతోగాని శ్రీహరినర్చించిన పదివేలయజ్ఞములుచేసిన ఫలముతో సమానమైన ఫలము లభించును. మరియు తులసికోటవద్ద గోమయముచే అలికి వరి పిండితో శంఖచక్రాకారముగ ముగ్గుపెట్టిన భగవంతునకది ఆనందదాయకమగును. శివకేశవాలయములందీ కార్తీకమున నెలదినములు *నందాదీపముంచిన వాని పుణ్యమింతయని చతుర్ముఖబ్రహ్మకైన వచింపజాలడు. ఆనందాదీపమారిపోకుండ చూచుచుండవలయును. అది ఆరిపోయిన వ్రతఫలముండదు. ఆనందాదీపము, భూమిపై నువ్వులుపోసి, వానిపై ధాన్యముంచి, దానిపై నవిసెపువ్వుముంచి, దానిపైమండిగనుంచి వెలిగించవలెను. కార్తీకమాసమున శివుని జిల్లేడుపువ్వులతో నర్చించిన నాయుర్వృద్ధియగును. కల్యాణమండపమున హరిహరుల నర్చించిన వారికి వైకుంఠప్రాప్తి సిద్ధించును. మల్లెపూలచే హరిని పూజించిన సర్వపాపములు హరించును. తులసిగంధము దేవాలయమందున్న విగ్రహమునకుగాని, తాను సదా పూజించు సాలగ్రామమునకుగాని పూసి పూజించినను వైకుంఠము దొరకును. దేవాలయమున వేశ్యాంగనలచే నృత్త గీతవాద్యాదులొనరింపజేసిన వారికి పరమపద ప్రాప్తి చేకూరును. దేవాలయమును తుడిచి యుదకమును జల్లి ముగ్గుచే రంగవల్లుల దీర్చినవారికి కైవల్యము ప్రాప్తించును. ఈమాసమున నతిభక్తితో శక్తికొలదిగ నన్నదానముజేసిన వారి పాపములు మేఘములు పెనుగాలికి దూలుపగిది నశించును. కార్తీకమాసమున ముఖ్యముగా తిలదానము, నదీస్నానము, బ్రహ్మమేడియాకులలో భోజనము, బ్రాహ్మణసమారాధనము చేయదగినవి. ఎవడు దేహబలముండి, డబ్బుకలిగియుండి, ఈమాసమున స్నానదానముల నాచరింపడో వాడే నరాధముడనదగినవాడు. అంతేగాక వాడు శతజన్మలెత్తి పిమ్మట మాలడై పుట్టును. స్త్రీపురుషులలో నెవరైనను సమర్థులైయుండియు కార్తీక

* నందాదీపమన రాత్రింబగళ్ళు విరామములేక వెలుగుదీపము.

వ్రతముచేయుకో వారు జనక గార్భభజన్మలు నూరొందుదురు. కడిమిపూలచే శ్రీహరిని పూజించినవారు సూర్యమండలమును భేదించుకొనిపోయి పరలోకమున పరమసౌభాగ్యాంబుధి నోలలాడుదురు. మొగలిపువ్వులచే మాధవు నర్చించిన వారు సప్తబ్రాహ్మణజన్మలంది వేదవేదాంగ విద్యాపారంగతులై సకలభోగభాగ్యంబుల ననుభవింతురు. సహస్రకమలార్చన జేసిన వారి కాయువు వృద్ధియై తుదను సూర్యలోకవాసము లభించును.

అతసీపుష్పమాలాం యో హ్యలంకృత్య తథా స్వయం।
స్కంధే ధృత్వార్చయే ద్విష్ణుం స చ స్వర్గాధిపో భవేత్
స్త్రీయో మాల్యేన వా విష్ణుం పూజయే త్తులసీదళైః।
స సర్వపాతకా న్ముక్తో యాతి విష్ణోః పరం పదమ్॥ 35
కార్తికే భానువారే తు స్నానకర్మ సమాచరేత్।
మాసస్నానేన య త్పుణ్యం తత్పుణ్యం లభతే నృప॥36
ఆద్యేఽంతిమే మధ్యమే చ దినే యస్స్నాన మాచరేత్
మాసస్నానఫలం తేన లభతే నాత్ర సంశయః 37
అథ వా మాసమాహాత్మ్యం యః శృణో త్యఘనాశనం।
మాస మేకం నృపశ్రేష్ఠ స ముక్తస్సర్వపాతకైః॥ 38
కార్తికేమాసి యో దీపాన్ దృష్ట్వా మోదతి యః పుమాన్
తేనపాపాని నశ్యంతి నాత్ర కార్యా విచారణా॥ 39

కార్తీకమున గరుడధ్వజా నవిసిపూలదండలచే నలంకరించి యవిసెపూలతో బూజించినవాడు కుబేరునంతటి ధనవంతుడగును. తులసీదళంబులచే హరినలంకరించి వానిచే పూజించిన విష్ణుసాయుజ్యము లభించును. కార్తీకమాసమున నొక యాదివారమున నదీస్నానము చేసినవారికి, ఆ నెల దినములు స్నానముచేసిన ఫలము చేకూరును. నెలదినములు స్నానముచేయ నశక్తులైన వారు శుద్ధపాడ్యమి, పూర్ణిమ, అమావాస్య తిథులు మూడునందును స్నానముచేసిన నెలదినము లాచరించిన ఫలితమబ్బును. శుద్ధపాడ్యమి మాసప్రారంభదినము. పూర్ణిమ మాసమధ్యదినము అమావాస్య మాసాంత దినము. అందుచే ముఖ్యముగ నీతిథుల కధికఫల మీయబడినది. దీనికిని

భక్తితోనీ మాసమునందు పూర్తిగా కార్తికమాహాత్మ్యపురాణమును వినవలెను. అట్లుచేసిన మానవస్నానఫలప్రాప్తి కలుగును.

సహాయం కురుతే విష్ణోః పూజార్థం యః ప్రయత్నతః।
కర్మణా మనసా వాచా స స్వర్గఫల మశ్నుతే॥ 40
కార్తికే మాసి యో భక్త్యా హ్యర్చయే దచ్యుతం నరః।
గంధపుష్పైః సుధూపాద్యైః యాతి తత్పద మవ్యయమ్।
కార్తికే కేశవస్యాగ్రే యో జపం న సమాచరేత్।
స జంబుకో భవే ద్భూమౌ సప్తజన్మ స్వసంయుతః 41
యే ప్రదోషే. పురాణం తు కార్తికే కేశవాగ్రతః।
కుర్వంతి నరశార్దూల తే యాంతి హరిమందిరమ్॥ 42
కార్తికే మాసి సాయాహ్నే స్తోత్రపాఠపరో నరః।
స స్వర్గలోక మాసాద్య ధ్రువలోక మతః పరమ్।

దానికిని చాలనివారు హరిపూజాతత్పరులకు తోచిన సహాయము మొనరించి మహాభక్తితో భగవద్భక్తులు చేయుపూజలను, ఉంచినదీపములను జూచి సంతసించిన స్వర్గసౌఖ్యము చేకూరును. ఈమాసమున పురుషసూక్తవిధానముచే శ్రీహరి నర్చించిన వైకుంఠవాసము సమకూడును. హరిహరాదులకు నర్చనగాని, స్నానముగాని, శివకేశవప్రీతికై మంత్రజపముగాని చేయనివా రేడుజన్మలవఱకు నక్కలై జన్మింతురు. సాయంసమయమున నేదేవాలయమందుగాని పురాణము చదివినవారికి వైకుంఠవాసము సిద్ధించును. ఈ మాసములో దేవాలయమందే దేవునిస్తుతించువారైనను స్వర్గసుఖముల ననుభవింతురు. తరువాత ధ్రువలోకమున కేగుదురు.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
ఏడవ అధ్యాయము

---

# అష్టమోఽధ్యాయః

రాజోవాచః—

మచ్చిత్తేఽధికసందేహో వర్తతే బ్రహ్మనందన।
తన్నాశాయాద్య మే బ్రూహి తద్వక్ష్యామి తవప్రభో
త్వత్తో మయా శ్రుతం విప్ర సూక్ష్మధర్మస్య లక్షణం।
తథావిధం పాతకం చ నిందితం విబుధాదిభిః 2
బహుపాపరతానాం చ వర్ణ సంకర కారిణామ్।
ఆచారరహితానాం చ దుర్జనానాం మహామతే॥ 3
ప్రాయశ్చిత్తైస్తు పూయంతే త్రయీవిద్యాదిసంభవైః।
కృత్వా గురూణి పాని మానవా దుష్టబుద్ధయః 4
ధర్మలేశేన తే సర్వే కథం యాంతి హరేఃపదం।
బ్రహ్మన్ బహూని పాపాని గురూణి వివిధాని చ॥ 5
ప్రాయశ్చిత్తైఃహీనాని కృత్వా యాంతి కథం హరిం।
జ్ఞాత్వాసర్వా ణ్యనంతాని పాతకాని నరః క్వచిత్॥ 6
దిష్ట్యోపలబ్ధ ధర్మేణ కథం యాంతి హరేః పదం।
మహావజ్రనగం కించి న్నఖాగ్రేణ నుదో యథా॥ 7
కశ్చిచ్ఛిన్నకురుతే విప్ర న కదాచి త్తదా స్వయం।
స్వయం గృహాంతరే స్థిత్వాహ్యగ్నౌ దత్వాభ్యనుజ్ఞవత్
జ్వలంత మగ్ని మజ్ఞోఽపి నాశమేత్య చ్ఛలకోదకాత్।
మహానదీప్రవాహే తు స్వయం గత్వా తతః పునః 9

తృణసన్నిగ్రహణం కృత్వా తదాధారా భవేన్న చ।
మహాదుర్గం సమారుహ్య తచ్ఛృంగాత్పతితో నరః 10
స కథం చ విముచ్యేత పాతకే నాప్యసంభవం।
ఇదం మమ సమాచక్ష్వ శ్రోతౄణాం విస్మయావహమ్॥

జనకమహారాజు వసిష్ఠుడు వచించిన ధర్మముల నన్నింటికి శ్రద్ధాభక్తులతో నాలకించి మరల నాముని కిట్లనెను. ఓమహాత్మా! మీవలన కార్తీకమాహాత్మ్యమంతయు వింటిని. అందు తాము ధర్మము బహుసూక్ష్మమనియు, పాపపుణ్యములు సులభముగా వచ్చుననియు, ఆయాసూక్ష్మధర్మంబులైన నదీస్నాన దీపదాన ఫలదానములు, అన్నవస్త్రదానములు, హరిహరాలయములందు మంత్రజపములు, వనభోజనాదులు మొదలగు స్వల్పదానధర్మంబులచే నఖిలపాపములు హరింపబడునని చెప్పిరి. వేదోక్త ప్రాయశ్చిత్తంబులవలనగాని మహాపాపములు రూపుమాయవని మీవంటి మహాత్ముల ముఖముననే వినియుంటిని. అట్టి ప్రాయశ్చిత్తమువలన హరించు పాపరాసు లీసూక్ష్మధర్మములచే నశించునా? దురాత్ములు కొందరు సదాచారములను స్మరింపక దురాచారములనే చేయుచు వర్ణసాంకర్యయోగ్య క్రియాకలాపులగుదురు. అట్టి వారుకూడ పైసూక్ష్మధర్మముల నాచరించిన మాత్రమున నిఖిలపాపవిముక్తు లెట్లగుదురు? ప్రాయశ్చిత్తాదులవలన పాయని పాతకములుగూడ పైసూక్ష్మధర్మాచరణమువ నశింపగలవని తాము చెప్పియున్నారు. వజ్రపుకొండ నెంతవాడైన గోళ్ళతోచీరి పిండిజేయ సమర్థుడగునా? ఇంటిలోనుండి యింటికగ్నిరగుల్కొల్పినగాని నెవడైన నుదరింపగలుగునా? దీపాగ్ని జ్వాలల నెవడైన చేత బట్టనేర్చునా? మహాప్రవాహమున మునిగి తేలుచు కొట్టుకొని పోవువాడు గడ్డిపరక నాసరాజేసికొని గట్టెక్కగలడా? పర్వతాగ్రమునుండి దుముకువాడెప్పుడైన సుఖియగునా? ఆతీరుననే మహాపాపికి కల్పపుణ్యప్రాప్తి కలిగినను సుఖముచేకూరుట దుస్సాధ్యమేమోయనెడి సందేహము నన్ను బాధించుచున్నది. ఇది విను వారికి విపరీతాశ్చర్యము గొలుపుచున్నది. ఈసంశయమును నివారింపుడు.

కార్తిక్యాం మాఘ వైశాఖే ధర్మసూక్ష్మం త్వయోదితం
బహూని పాతకాన్యేవ హ్యుదితాని త్వయా మునే॥ 12
తత్సర్వం విలయం కుర్యాత్ యోఽల్పేనైవచ సాంప్రతం

సాధారణముగ వినువారికి మహాపాతకములు, పాతకములు పలువిధము
లని వినియుంటిని. అవి వైశాఖ కార్తీక మాఘమాసంబులం దొనర్చిన
పుణ్యాతిశయముచే నశించునని తమబోటి మహాత్ములు చెప్పియున్నారు. ఇట్టి
మహాపాతకులను పవిత్రవంతులనుగా జేయునది దేశమా, కాలమా,
దానమా ఈనాటిలోను జేసికలిన నింత యోగ్యత లభింపుచున్నది. దీనిని
గూడ విపులీకరించి నాహృదయశల్యమగు సందేహమును పోగొట్టుడనెను

శ్రీసూతః—

ఇతి భూపవచ శ్శ్రుత్వా మందస్మేరముఖాంబుజః॥ 13
ఇద మాహ వసిష్ఠాత్మా రాజానం విస్మయాన్వితమ్ .
శృణు రాజన్ ప్రవక్ష్యామి సాధు సాధువిమర్శనమ్॥ 14
మయా హ్యాలోకితం సర్వాం వేదశాస్త్రవిచారణం।
తత్ర ధర్మా హ్యసంఖ్యాతా బహుసూక్ష్మతరా నృప॥ 15
దృశ్యం తేఽహం ప్రవక్ష్యామిత్వం మా కుర్వత్రసంశయం
గుణత్రయాన్వితా ధర్మాః రాజన్ శాస్త్రే వ్యవస్థితాః॥
సత్వ రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః

వశిష్ఠమహాముని జనకుని పలుకు లాలించి చిఱునవ్వు మొగంబున
మొలకెత్త, ముఖపద్మము వికాసమందగా మహాప్రీతితో జనకమహారాజు
నీక్షించి, ఓజనకమహారాజా! నీవు వేసినప్రశ్న యుక్తియుక్తముగను,
సహేతుకముగను నున్నది. నేను వేదములను, వేదాంగములను విమర్శించి
తిని. వానిలో ననేక సూక్ష్మధర్మంబులున్నవి. అవి సాత్వికధర్మములు,
రాజసధర్మములు, తామసధర్మములు నని ముత్తెఱంగులుగ నున్నవి.

యో ధర్మ స్సత్వ మాలంబ్య త్తం సూక్ష్మంకవయోవిదుః

అందు సాత్వికధర్మమనగా—దేశకాలపాత్రలు మూడును సమకూ
డిన సమయమున విధ్యుక్తముగ సత్వగుణంబు జనించి ఫలమునంతను పరమే
శ్వరార్పితము గావించి మనోవాక్కాయకర్మలచే నొనర్చినధర్మము.
ఆధర్మమంతెంతయో యాధిక్యతకలదు. సాత్వికధర్మము నిఖిలపాపంబులను
నాశనమొనర్చి పవిత్రవంతునిజేసి యుభయలోక సుఖములను చేకూర్చును.

ఒక్క విషయము వినుము. తామ్రపర్ణినది సముద్రమున బడు తావున స్వాతికార్తెలో ముత్తెపుచిప్పలో వర్షోదకముబడి వెలగల ముత్తెమగుచున్నది. ఇట తామ్రపర్ణినది సముద్రమున గలియుతావు దేశము; స్వాతికార్తె కాలము, ముత్తెపుచిప్పపాత్ర ఈ మూడును సమకూడినపుడు పడిన మేఘోదకబిందువున కెంత విలువ సమకూడినదో చూడుము. ఆ రీతిననే కార్తికమాసమునందు గంగా గోదావరీనదీతీరములందు పుష్కరము మొదలగు పుణ్యకాలములందు దేవాలయములందు వేదశాస్త్రముల నభ్యసించి సదాచార్యుడు, కుటుంబికుడు, నిరుపేదయైన బ్రాహ్మణునకు స్వల్పదానమిచ్చినను, ఆ నదీతీరమందలి దేవాలయంబులందు భగవంతుని కీర్తనమైన మంత్రజపతపాదు లాచరించినను విశేషఫలము నిచ్చును.

ప్రాయశ్చిత్తాన్యశేషాణి తపః కర్మాన్వితాని వై।
రజోన్వితాని రాజేంద్ర భూయో జన్మప్రదాని చ। 17

రాజసధర్మమనగా— ఫలాపేక్ష కలిగి శాస్త్రోక్తవిధులను విడచి చేసిన ధర్మము. ఆధర్మము పునర్జన్మ హేతువై కష్టసుఖములను గలిగించునదగును.

ఇదం కృతాకృతఫలం యద్ధర్మం ప్రోచ్యతే బుధైః।
తద్ధర్మం తామసం ప్రాహు ర్నిష్ఫలం పృథివీపతే॥ 18

తామసధర్మమనగా—శాస్త్రోక్తవిధులను విడనాడి దేశకాల పాత్రలు సమకూడని సమయమున ప్రతారణార్థము చేయుధర్మము. ఆధర్మము యత్కించిత్ఫలశూన్యము.

తస్మాత్సాత్త్వికధర్మం తు తే సూక్ష్మం కథితం మయా।
లేశం వా జాయతే రాజన్ సమృద్ధిః కాలయోగతః॥ 19
అదేశకాలే యద్దానం అపాత్రే ప్రతిపాదితం।
విధిహీన మమంత్రం చ ధర్మం తత్తామసం విదుః 20
కాలదేశం న విజ్ఞాయ ధర్మం యః కురుతే నృప।
తదక్షయఫలం ప్రోక్తం ముక్తి హేతు ర్న సంశయః॥ 21

యదాధికం వా స్తోకం వా కాలం విజ్ఞాయ మానవః।
విచారితార్థం కుర్వీత గహనా కర్మ పద్ధతిః॥ 22
లభంతే తేన సౌఖ్యాని దుర్లభాని మహీపతే।
జ్ఞానేనాప్యథవాఽజ్ఞానా త్కాలే దేశే చ దైవతః॥ 23
కరోతి ఫల మక్షయ్యం జాయతే నాస్తి సంశయః।
కాష్ఠభారాన్ సమాదాయ సన్నివేశ్య నగోపమాన్॥24
తత్ర గుంజాఫలం మాత్ర మగ్నిం నిక్షిప్య తాన్ దహేత్
గృహే సంతమసవ్యాప్తే దీపే నాల్పేన యా ద్యుతిః॥
తమిస్రం వినిహంత్యాశు ధర్మోఽల్పో వాఽథవాన్నృప।
యథా కర్దమనీరే తుస్నాత్వా భూయోఽతినిర్మలే॥ 26
జలే స్నానేన రాజేంద్రనిర్మలో జాయతే తథా।
అల్పం వా యేన కేనాపి హ్యజ్ఞానే నాథవా సకృత్ 27
నామసంకీర్తనా ద్విష్ణోః దహ్యంతే బహుపాతకాః।
విష్ణుసంకీర్తనంరాజన్ కీర్తయేత్ జ్ఞానమోహితః॥ 28
క్షయ త్యఘం మహా దపి వేణుగుల్మ మివానలః

దేశకాలపాత్రలు సమకూడినప్పుడు తెలిసిగాని, తెలియకకాని మనుజుడెట్టి స్వల్పదాన మొనరించినను వానికి భగవాను డధికఫలమిచ్చును. మఱొక్క విశేష మాలింపుము. పెద్ద కట్టెలప్రోగులో రవంత యగ్నికణముంచిన నా ప్రోవంతయు భస్మమైనట్లుగ, చిన్నదీపమును వెలిగించిన యింటిలో నాదీపకాంతివలన నందున్న యంధకారమంతయు రూపము లేకుండపోయినరీతిగ, బురదనీటిలో మునిగివచ్చినవాడు మంచినీటిలో మునిగిన నాబురదంతయుపోయి శుభ్రుడైనభాతిగను శ్రీమన్నారాయణ నామోచ్చారణము తెలిసిగాని, తెలియక గాని స్వల్పముగ చేసినను, అధికముగ జేసినను నిఖిల పాపములను హరించును. హరినామ సంకీర్తనము తెలియక చేసినను వెదురుపొదను నిప్పుదహించి నట్లుగ పాపముల నన్నిటిని నశింపజేయును. దీనికొక యితిహాసమును జెప్పెదను వినుము.

పురా కశ్చి ద్దురాచారో విప్రసూను రజామిళః॥ 31
దాసీపతిః క్రూరకర్మా దాసీ సంసర్గలాలసః।
కన్యాకుబ్జే సత్యనిష్ఠో నామ్నా వైస బహుశ్రుతః॥ 32
తస్య భార్యా ధర్మవతీ సాధ్వీ పతిపరాయణా।
తస్య చాంతరితే కాలే సంజాతోఽజామిళ స్తదా। 33
పూర్వకర్మానురోధేన సోఽభవత్పాపిష్ఠ యౌవనః।
కస్యచిద్ద్విజముఖ్యస్య సుకర్మాఖ్యస్య చ భూమిప॥ 34
గృహదాసీపతి శ్చాసీ త్పూర్వకర్మానుబంధతః।
మాతరం పితరం హిత్వా మదనావేశ మోహితః 35
తయా సమంస తన్వంగ్యా పానభోజనభక్షణైః।
కామశాస్త్రకలాపైశ్చ పరిరంభణచుంబనైః॥ 36
అజామిళ స్తయా దాస్యా రేమే కామవిమోహితః।
సర్వకర్మాణి సంత్యజ్య వేదశాస్త్రోదితాని చ॥ 37
చక్రు ర్నిష్కాసనం తత్ర తం తదా బాంధవాః పరే।
పరిత్యజ్య తతో లజ్జాం విప్రసూను స్స పాపధీః 38
తస్మిన్నే వాంత్యజభువం ప్రాప్య తత్సద్మ చాశ్రితః।
పశుపక్షిమృగాదీనాం హత్వా తన్మాంసజీవనః॥ 39
శ్వవాగురిక సంయుక్తో వనే హింసాపరాయణః।
దాస్యా సమం చచారాసౌ వనే దుష్టమృగాకులే॥ 40
కదాచిత్సాలవృక్షే సా మధుదృష్ట్వాఽరుహత్ నృప।
భగ్న శాఖం పతద్భూమౌ మరణం సముపాగతా॥ 41
అజామిళ స్తతో దృష్ట్వా రాజన్ ప్రాణధనేశ్వరీం।
స పుర స్తస్య బహుధా విలలాపాకులేంద్రియః॥ 42
గిరిగర్తే మహారాజన్ తాం విసృజ్య గృహం గతః।

త్రేతాయుగకాలమున కన్యాకుబ్జమను నగరంబున వేదవేదాంగ పారంగతుడగు బ్రాహ్మణుడొకడుండెను. సత్యనిష్ఠుడని యాతని నామము. ఆతని భార్య సకలసద్గుణసంపన్నయు, పతివ్రతయునని ఖ్యాతిగాంచినది. ఆ దంపతులకు సంతతి పుట్టక చాలకాలమున కొక పుత్రుడు కలిగెను. వానికి 'అజామీళుడు' అని నామకరణంబుచేసి గారాబముగ పెంచుకొనుచుండిరి. ఏకాలమందైనను తగని గారాబమును బిడ్డలందు చూపరాదు. అది యా బిడ్డకు శ్రేయముకాదు. అజామీళుడు విద్యాబుద్ధులులేనివాడై స్వేచ్ఛగా తిరుగాడు నలవాటు కలవాడయ్యెను. అతనికి బాల్యముగడచి యౌవనము ప్రవేశించెను. ఆపడుచుదనపు కావరమునను, కామాంధకారమునను నాత డొక దాసీపుత్రికను మోహించి దానితో నిరంతరము కామక్రీడల దేలుచు తల్లిదండ్రులను విడచెను. కొంతకాల మీతీరున నడచినపిమ్మట దానియింటనే వసింపుచు స్నానసంధ్యాదులను, యజ్ఞోపవీతములను విడచి దానియింటనే భుజింపుచు కులధర్మములనే మఱచెను. బంధువులు వానికి వెలిపెట్టిరి. దానితో వాడు మఱింత రెచ్చిలి పక్షులను, మృగములను జంపు సాధనములను సంపాదించి కిరాతునివలెగది జీవహింసచేయుచు, మాంసమును దినుచు బ్రతుకుచుండెను. ఒకనా డా యజామీళుడు తన యుంపుడుకత్తెను వెంటనిడుకొని వేటకేగెను. అట నొక చెట్టుపైన తేనెపట్టుకాన్పింప నా తేనెతీయుట కామె చెట్టెక్కి కొమ్మవిరిగ క్రిందబడి మరణించెను. దానికై యాతడు కొంతసేపేడ్చి కొండలోయలో నొకదానియందా శవమును పూడ్చి యింటికేగెను.

తత స్తస్యా స్సుతా తన్వీ సురూపా ప్రాప్తయౌవనా॥ 43
తాంద్రుష్ట్వా స చ పాపాత్మా తయా రేమే చిరం నృప।
తస్మాత్సా సుషువే రాజన్ పుత్రాన్ కాలే చ వై నృప।
క్షీణాయుషో గతా స్సర్వే కనిష్ఠ శ్చావశేషితః।
నారాయణాభిదానం చ చక్రే హ్యుక్తోఽత్రవర్ణకైః 35
తిష్ఠన్ గచ్ఛన్ పిబన్ భుంజన్ పర్యటన్ ప్రస్వదన్ సదా
పుత్రపాశేన సంబద్ధో తన్నామగ్రహణాతురః। 46

తరువాత కొలది కాలమునకే తా నుంచుకొన్న దాసి కూతురునకు బాల్యముగడచి యౌవనము ప్రవేశింపగా దానినే అజామిళుడుంపుడు కత్తెగా జేకొని కామాతిరేకమున దానితో కామక్రీడలందేలెను. ఆమె యందువానికి కొందరుబిడ్డలు పుట్టిచచ్చిరి. ఒక్కబాలుడుమాత్రము మిగిలెను. వానికజామిళుడు నారాయణుడని పేరుపెట్టి వాత్సల్యముతో బెంచుచుండెను. వానినొక్క నిమేషకాలమైన విడనాడక వాడెందేని యేగినచో మక్కువచే నారాయణ, నారాయణ అని పిలుచుచుండువాడు అతడాబాలునియందలి ప్రేమచే నారాయణా అని యన్నవాడే కాని నారాయణనామస్మరణవలన తనపాపములు నశించి పవిత్రుడనగుదునను నాశయ మాతని హృదయమున లేదు. కొంతకాలమిట్లు గడువ నజామిళునకు దేహదార్ఢ్యము నశించి జరాభారము పైబడెను. శరీరము రోగభూయిష్ఠమై మరణకాలము సమీపించెను.

తతః కాలే సమాయాతే మరణే సముపస్థితే।
తస్మైతు మాగతా రాజన్ యమదూతా భయంకరాః॥
రక్తశ్మశ్రుముఖా లోష్టదండహస్తాసిపాణయః।
తాన్ దృష్ట్వా భయసంత్రస్త మాత్మానం నేతు మాగ
తాన్ ॥

ఉవాచ వాక్య మేతచ్చ పుత్రస్నేహపరిప్లుతః।
దూరే క్రీడనకాసక్తం పుత్రం నారాయణాహ్వయం। 49
ప్రాపితేన స్వరే ణోచ్చై రాజుహా వాకులేంద్రియః।
శ్రుత్వా తన్మ్రియమాణస్య వదనా ద్విష్ణుకీర్తనం॥ 50
తే విచింత్యతతో దూరం జాతకంపా స్థితా నృప।
తదా జగ్ము ర్విమానస్థా విష్ణుదూతాః సుతేజసః॥ 51
యమప్రేష్యా న్విష్ణుదూతా వారయామాసు రోజసా।
అస్మాకం వశగోఽయం చ ఊచు స్తే యమకింకరాన్॥52

తే సర్వే విష్ణువ ద్రాజన్ పద్మపత్రాయ తేక్షణాః।
పీతాంబరధరా ముఖ్యా స్సర్వే పుష్కరమాలినః॥ 3
కిరీటినః కుండలినో నాదాస్రగ్వస్త్రభూషణాః
చతుర్భుజా శ్చారురూపా శ్శంఖచక్రభుజశ్రియః 54
దేశం సుమిశ్రితాలోకాః కుర్వంత స్స్వేన తేజసా।
దృష్ట్వాచవిష్ణుదూతాం స్తే యామ్యా వాక్యం సమబ్రువన్

అప్పుడే యమభటులు భయంకరాకారములతో చేత పాశములను బట్టుకొని వాని యెట్టయెదుట గోచరించిరి. ఆయమభటుల రూపములను, చేతనున్న పాశాయుధంబులను గాంచి యజామిళుడు భీతచిత్తుడై యింకను పుత్రవాత్సల్యమును వీడనేరక సమీపముగా నాడుకొనుచున్న పుత్రుని నారాయణా, నారాయణా యిటురమ్మని బిగ్గరగ పదింబదిసారులు పిలిచెను. ఆనారాయణ నామోచ్చారణను యమభటులు విని గజగజవణకుచుండిరి. అంతలో దివ్యమంగళవిగ్రహులును, పద్మపత్రవిశాల నేత్రులును, పీతాంబరధారులును, పద్మమాలాలంకృతులును, శంఖచక్రాంకితభుజులును, మహాతేజ స్సంపన్నులును, విష్ణుసమానరూపులు నయిన విష్ణుదూతలట లోకవిమానము నధిష్ఠించివచ్చి వీడు మావాడు, మీరు వీనినంటవలదని యమభటుల నడ్డగించి యదలించి యజామిళు నావిమాన మెక్కించిరి.

యూయం హి ఉప దేవా వా కిన్నరా స్సిద్ధచారణాః।
ఇతి తేషాం వచ శ్శ్రుత్వా తా ననాదృత్య పుష్పకే 56
అజామిళం సన్ని వేశ్య గంతుకామా వచోఽబ్రువన్

యమభటు లపుడు విష్ణుదూతలంగాంచి, అయ్యా! తా మెవరు? కిన్నరులా; చారణులా; సిద్ధులా, గంధర్వులా! అని యడుగుచుండగనే యెట్టి ప్రతివచన మీయకుండగనే విమానమధిష్ఠించిరి. పిమ్మట యమదూతల కిట్లు పలికిరి.

స్కాందపురాణమునందలి కార్తీకమహాత్మ్యములోని
ఎనిమిదవ అధ్యాయము.

---

# నవమోఽధ్యాయః

విష్ణుదూతాః—

భవతాం స్వామినా కింకిం వదధ్వం కథితం యతః
కోఽస్త్యోఽత్రయమదండస్య కేఽధర్మాఃపుణ్యపాతకాః॥ 1
సూనమస్మాక మగ్రేతు బ్రూత సర్వం యమానుగాః।
ఇతి తై రుదితం శ్రుత్వా ఊచు స్తే యమకింకరాః 2

విష్ణుదూతలు:—ఓ యమభటులారా! మీ ప్రభువైన యమధర్మరా జెట్టివారిని తనలోకమునకు గొనిరమ్మని యాజ్ఞ యిచ్చెను? పుణ్యాత్ములన నెట్టివారు? పాపులన నెట్టివారు? ధర్మమన నెట్టిది? మాకు నిశ్చయముగ దెలుపుడు.

యమదూతాః—

శృణుధ్వ మవధానేన విష్ణుదూతా స్సునిర్మలాః।
పతంగః పావకో వ్యోమ వాయు ర్గావో నిశాశతిః 3
సంధ్యాహానీ దిశః కాల ఇతి దేహస్య సాక్షిణః।
ఏతై రధర్మో విజ్ఞాత స్థానం దండస్య యుజ్యతే॥ 4
యో వేదమార్గరహితః శ్రుతిస్మృత్యాదిదూషకః
నిందక స్సాధువృత్తానాం స మే దండ్యో న సంశయః॥ 5
విప్రం చ గురు మస్వస్థం పాదాద్యైర్యది తాడయేత్।
యో మాతాపితరౌ ద్వేష్టి న దండ్యోనాత్ర సంశయః॥
యో నిత్య మనృతం వక్తి ప్రాణి హింసాపరాయణః
కులాచారపరిభ్రష్ట స్స యాతి యమమందిరమ్॥ 7
దత్తాపహారకో దంభో దయాశాంతివివర్జితః
యః పాపకర్మనిరత స్స యాతి యమమందిరమ్।

పరదారాభిగమనం స భుఙ్క్తే యమయాతనాం।
యోఽసాక్షికం పదేద్ద్రివ్యలోభే నాత్యంతదుష్టధీః 9
అహం తు దానశూరేతిప భుఙ్క్తే యమయాతనాం।
మిత్రద్రోహీ కృతఘ్నశ్చ న భుఙ్క్తే యమయాతనామ్
వివాహవిఘ్నం యః కుర్యాత్స భుఙ్క్తే యమశాసనం।
యో వా పరేషా మైశ్వర్యం దృష్ట్వాఽసూయేత దుష్టధీః
పరేషా మర్భకానాం చ న గచ్ఛే ద్యమయాతనాం।
కన్యాద్రవ్యేణ యో జీవే త్తథా వార్ధుషికేణ గ॥ 12
తటాకకూపకల్యానాం విఘ్న మాచరతే యది।
తథా చ విఘ్నకర్తా చ పాతకీ చ న సంశయః॥ 13
యః పిత్రాన్న సముద్దిశ్య శ్రాద్ధం మోహేన వా నరః
నిత్యకర్మపరిత్యాగీ స భుఙ్క్తే యమశాసనం
పరపాకాపరిత్యాగీ వరపాకరత స్తథా॥ 14
పితృశేషాన్నభోక్తా చ న భుఙ్క్తే యమయాతనమ్॥ 15
నా దదశ్నీతి యో బ్రూయత్ సదద్యా ద్బ్రాహ్మణేషు చ
శరణాగతహంతా చ సభుఙ్క్తే యమయాతనామ్ 16
స్నానసంధ్యాపరిత్యాగీ నిత్యం బ్రాహ్మణనిందకః।
బ్రహ్మఘ్న శ్చాశ్వగోఘ్న శ్చ స యాతియమమందిరమ్
ఏవమాదీని పాపాని యమే నోక్తానివైష్ణవాః
యే కుర్వంతి యమే లోకే తేఽనుభూయంతియాతనామ్
అయం విప్రాన్వయే జాతో దాసీపతి రజామిళః।
అనే నార్జితపాపానాం సంఖ్యా నాస్తిన సంశయః॥ 19

జన్మప్రభృతి జన్మాంతం పాప మేన మహార్జితం।
అయం వై విష్ణులోకస్య కథ మర్హతి దుష్టధీః॥ 20
ఇతి తేషాం వచ శ్శ్రుత్వా విష్ణుదూతా స్సువిస్మితాః।
మేఘగంభీరయా వాచా ఊచుః స్మేరముఖాంబుజాః 21

యమదూతలు:—ఓవిష్ణుదూతలారా! మానవుడుచేయు పుణ్యాపాపములకు సూర్యచంద్రులు, భూమ్యాకాశములు, ధనంజయవాయువులు, రాత్రిం బవళ్ళు, సంధ్యాకాలములు సాక్షులు. ఈపైసాక్షులు ప్రతిదినము మానవులొనర్చు పుణ్యపాపంబులను మా ప్రభుకడకు వచ్చి తెక్కించుదురు. మాప్రభువు వారిసాక్ష్యమునుబట్టి పాపులను నిర్ణయించి యా పాపాత్ములను దెచ్చుటకు మమ్ము నియోగింతురు. ఆపాపు లెట్టివారో వినుడు. వేదోక్త సదాచారములను విడనాడి, వేదశాస్త్ర తిరస్కారమును సజ్జనదూషణమును జేయువారును, గురువును, బ్రాహ్మణుని, రోగబాధితుని గొట్టువారును, తలిదండ్రులను దిట్టువారును, అసత్యములాడువారును, జీవకోటిని జంపువారును, కులాచారములను త్యజించినవారును నరకబాధలను నందదగినవారు. మఱియు మా రాజు మాకు కూటసాక్షులను డాంబికులను, మిత్రద్రోహులను తానిచ్చినదానిని దొంగిలించువారిని, సత్యదయాశౌచహీనులై పాపపుబనుల చేయువారిని, పరదారలగూడువారిని, స్వల్పదానముచేసి మహాదాతలమని గర్వించువారిని, కృతఘ్నుని వివాహాది శుభకార్యములను కారణములేకయే చెఱచినవారిని, అన్యుల ధనధాన్యభోగ సంతానములనుచూచి యసూయపడువారిని కన్యావిక్రయులను వడ్డీవ్యాపారము చేయువారిని, పితృకర్మలను త్యజించినవారిని, స్నానసంధ్యావందనాది నిత్యకర్మత్యాగులను, పితృశేషము తినువారిని, పరులెక్కడ కణమేని యడిగినను పెట్టక స్వోదరపోషణము మాత్రమే చేసుకొనువారిని, ఇతరుల కెప్పుడొక మెతుకైనను బెట్టక పరునియింటనే నిత్యము తినువారిని, ఇతరులు దానముచేయునపు డడ్డుపెట్టినవారిని, శరణాగతుని హింసించువారిని, బ్రాహ్మణనిందను బ్రహ్మహత్యను చేయువారిని, గోహంతకులను, అశ్వహంతకులను, తప్పుడుపద్దులు వ్రాయువారిని, ఒకపనికై నిర్ణయించుకొన్న రొక్కమీయనివారిని నరకమున బడద్రోసి బాధింపుడని యాన వెట్టెను. ఈ యజామీళుడు బ్రాహ్మణజన్మమెత్తి

దురాచారుడై దాసీసాంగత్య మొనర్చి వర్ణభ్రష్టుడగుటయేగాక జీవహింస గావించి మాంసభక్షకుడై కిరాతకృత్యము గావించినవాడు. పుట్టినదాది గిట్టువఱ కితడొక్క పుణ్యకార్యము చేయలేదు సరిగదా అన్నియు మహాపాప కార్యములనే యొనర్చినాడు. వీడు విష్ణులోకమును బొందుట కెట్లు పూజ్యుడయ్యెనో?

విష్ణుదూతాః—

అహో ఆశ్చర్య మేతద్ధి యద్యూయం మూఢచేతసః।
శృణ్వంతు ధర్మమర్యాదాం సావధానేన చేతసా 22
యో దుస్సంగ పరిత్యాగీ సత్సంగతి ముపాశ్రయేత్।
బ్రహ్మజ్ఞానరతో నిత్యం న దండ్య స్స యమేన వై 23
స్నానసంధ్యాదినిరతో జపహోమపరాయణః।
సర్వభూతదయాయుక్తో న స యాతి యమాలయమ్ 24
బ్రహ్మ ణ్యాధాయ కర్మాణి సత్యవా గనసూయకః।
జపాగ్నిహోత్రే యః కుర్యాత్ న సయాతి యమాలయమ్
యోఽన్నదానరతో నిత్యం వారిదానం ప్రయత్నతః।
గోదానం చ వృషోత్సర్గం యః కుర్యా న్న స పాతకీ॥26
విద్యాదానం బాలకేభ్యో యః కుర్యా ద్భక్తిమాన్నరః।
పరోపకారనిరతో న స యాతి యమాలయం॥ 27
యే విష్ణుమర్చయే ద్భక్త్యాతస్యాంగే జపముత్తమమ్।
వివాహోపనయనా కర్తాన సయాతి యమాలయమ్॥ 28
యోఽనాథమంటపం మార్గే వాసనిర్మాణ మేవ వా।
అనాథ ప్రేతసంస్కారాన్న సయాతి యమాలయమ్॥ 29
సాలగ్రామార్చనం నిత్యం తత్తీర్థం యః పిబేన్నరః
తస్య దండ ప్రణామం చ యః కుర్యా న్న స పాతకీ॥

తులసీమణిమాలాం తు గళే ధృత్వాఽర్చయేద్ధరిం।
సాలగ్రామశిలావాసం న స యాతి యమాలయమ్। 31
యేషాం గృహే హి తులసీ వర్తతే హరిసత్కథా।
గీతపాఠపరా యే చ న తే యాంతి యమాలయమ్॥ 32
నిత్యం భాగవతం యస్య లిఖితం పుస్తకం గృహే।
తిష్ఠతే చార్చయేద్వాపి న స యాతి యమాలయమ్॥ 33
తులాసంస్థే దినకరే మకరస్థే చ భాస్కరే।
మేషసంక్రమణే భానౌ స్నానశీలా నయాంత్యథ॥ 34
రుద్రాక్షమాలికాం ధృత్వా కృతం యేన జపం శుభం।
దానహోమపరో నిత్యం న స యాతి యమాలయమ్ 35
అచ్యుతానంత గోవింద కృష్ణ నారాయణావ్యయ।
ఇతి యో వదతే నిత్యం నసయాతియమాలయమ్॥ 36
యః కర్ణికాయాం మ్రియతే మరణే హరి ముచ్చరన్।
సర్వపాపరతో వాపి నసయాతి యమాలయమ్॥ 37
స్తేయస్సురాపో మిత్రఘ్నో బ్రహ్మహా గురుతల్పగః।
స్త్రీరాజగురుగోహంతా యేఽన్యే పాతకినోఽపరే॥ 33

విష్ణుదూతలు:—యమభటులారా! మీమాట లత్యాశ్చర్యకరముగా నున్నవి. మీరుధర్మమును గుర్తింపక వివేకహీనులై మాటలాడుచున్నారు. ధర్మసూక్ష్మము మీకు తెలియదు. చెప్పుచున్నాము వాలింపుడు. సజ్జనసహవాసము చేయువారును, దుష్టసహవాస మొల్లనివారును, బ్రహ్మజ్ఞానాసక్తులును, స్నానసంధ్యాద్యనుష్ఠానతత్పరులును. భూతదయాభిలాషులును, తాము మంచి పనులను జేసియు నాఫలమును కోరక నీశ్వరార్పితము చేయువారును, నిత్య సత్యవ్రతులును, నిరతాన్నదానోదకప్రదాతలును, గోదాన మొనరించువారును, వృషోత్సర్జన మొనరించువారును, ఇతరుల ధనధాన్యాదులం దసూయపడని వారును, విద్యాదాతలును, పరోపకారపారాయణులును, నారాయణునిసన్నిధిని మంత్రజపాదు లొనర్చువారును, విష్ణుసన్ని

ధిని వివాహాదిశుభకార్యము లొనర్చువారును, బాటసారులకు నిలువ నాధా రములు కల్పించినవారును, అనాధప్రేతాగ్ని సంస్కారకులును, ప్రతి దినము సాలగ్రామము నర్చించువారును, సాలగ్రామతీర్థపానమాచరించి దానికి సాష్టాంగనమస్కార మాచరించువారును, తులసిపూసల దండలుగ దాల్చువారును, నిరంతరసాలగ్రామమును చెంతనుంచుకొనువారును, నిం టిలో తులసినిస్థాపించి యర్చించి దానికడ హరిభజన చేయువారును, భాగవతముల్వ్రాసి యింట నుంచుకొని పూజించువారును, సూర్యుడు తులా రాశి యందున్న కార్తీకమాసమునందును, సూర్యుడు మకరరాశియందున్న మాఘమాసమునందును, సూర్యుడు మేషరాశియందున్న వైశాఖమాసము నందును ప్రాతఃకాలమున నదీస్నాన మొనరించువారును, రుద్రాక్షలను ధరించి మంత్రజపహోమాదు లొనర్చువారును, నారాయణగోవింద మాధ వాచ్యుతానంతేత్యాది విష్ణునామస్మరణచేయువారునునగు సజ్జనులు యమ లోకమునకు గొంపోతగనివారు.

నామవ్యాహరణం విష్ణోర్స్మరణేఽప్యఘ ష్కృతిః
అజ్ఞానా దథవా జ్ఞానా దుత్తమశ్లోకనామయత్ ॥ 39
సంకీర్తనాదఘహరం పుంసాం దుష్కృతినా మపి।
సాంకేత్యాత్ పారిహాస్యాద్వా స్తోత్రం బోధన మేవవా।
వైకుంఠనామగ్రహణేహ్యవేషాఘహరం విదుః।
పతితస్స్ఖలితో భగ్న స్స దుష్ట స్తప్తజాహతః। 41
హరి రిత్యవశే నాహ పుమా న్నార్హతి యాతనాం।
యచ్చిత్తే సర్వపాపఘ్న హరినామాన్య శేషతః 42
పాపాని జన్మాంతర సంచితాని యేనై వతన్నిష్కృతివర్జి తాని।
పూయంతి నామగ్రహణేనవిష్ణోర్మనుష్యలోకే దివివానసం శయః।
గురూణాం చ లఘూనాం చ పాపానాం నాశఏవ చ।
యద్యసౌ భగవన్నామ మ్రియమాణ స్సమగ్రహీత్ ॥44

తేన పాపాని నశ్యంతి వహ్నౌ ప్రక్షిప్త తూలవత్।
ఇత్యుక్త్వా తాన్ యమభటాన్ విష్ణుదూతా స్సుతేజసః
హైమపుష్పక మధ్యస్థ మజామిళ మతంద్రితాః।
ఆహృత్య జగ్ముర్వైకుంఠం తదాహాజామిళో నృప॥ 46
వందే శిరసా దేవం కిన్నరానపర్ణనోత్సుకః।
అథాజామిళ ఆకర్ణ్య దూతానాం యమకృష్ణయోః 47

అంతేకాక మరణకాలమున హరిహర నామస్మరణ మొనర్చిన శివకేశవులను, నామములనుగాని, ఆ నామాక్షరములలో నొకదానినిగాని స్మరించుట లేక వినుట సంభవించినవారి బ్రహ్మహత్యాది మహాపాతకములు గూడ నశించి వైకుంఠనివాసము ప్రాప్తించును. భగవన్నామ స్మరణ తెలిసి చేసినను, తెలియక చేసినను, అన్యుల పేరుతో నుచ్ఛరించినను, ఆవ్యాపదేశముగ వాకొన్నను మరణకాలమున భగవన్నామము చెవిని బడినను వారు పుణ్యాత్ములే అని చెప్పుచు నజామిళుని దివ్యవిమాన మెక్కించి వైకుంఠమునకు గొంపోయిరి.

ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి యుష్మత్సందర్శనా దహం
అహో మే పరమం కష్టం యదభూ దచిదాత్మనః 43

ధిఙ్మాం విగర్హితం సద్భిః దుష్కృతం కుల కజ్జలమ్।
హిత్వా బాలాం సతీం యోఽహం సురాపానసతీమియామ్
వృద్ధావనాథౌ పితరౌ నాన్యగౌ ధూతపాపినౌ।
అహో మయాఽధునా త్యక్తౌ వనభిజ్ఞేవ నీచవత్॥ 50
సోఽహం వ్యక్తం పతిష్యామి నరకే భృశదారుణే।
ధర్మఘ్నాః కామినో యత్ర విందంతి యమయాతనామ్॥
కి మిదం స్వప్న ఆహోస్విత్ మయాదృష్టమహాద్భుతం।
క్వ వాఽద్య యాతా యామ్యాస్తే కృష్ణఘోరాసిపాణ
యః॥ 52

అజామిళుఁడావిష్ణు యమదూతలసంవాదము నాలించి విగుల నాశ్చ ర్యపడి యిట్లు తనలోఁదలపోసెను. ఓవిష్ణుదూతలారా! నేను ధన్యుఁడను. పుణ్యాత్ముఁడను. తొల్లిటిజన్మమున నేనెంతో పుణ్యమును జేసితిని. నేనవ సానకాలమున భగవన్నామసంకీర్తనము చేయఁగలిగితిని. తల్లిదండ్రులను జరాభార పీడితులను రక్షింపక త్యజించి నిరపరాధులును నేనే దిక్కైయిన్న వారు నగువారలను బంధించితిని. నీచస్త్రీని మోహించి కులకాంతనువిడచి వర్ణభ్రష్టుండనై మహాపాపినైతిని.

పురా మయా కృతే నైవ భావ్యం పుణ్యేన కర్మణా।
అన్యథా మ్రియమాణస్య న స్మృతి ర్వ్యవలీపతేః॥ 53
వైకుంఠనామగ్రహణం జిహ్వా ఏక్తు మిహార్హతి।
క్వచాహం కితవః పాపో బ్రహ్మఘ్నో నిరవత్రవః॥ 54
క్వచ నారాయణేత్యేవ భగవన్నామ మంగళమ్।
ఇత్యుక్త్వా భగవద్భక్తి మాలం జ్ఞాత్వాన మాత్మని॥55
తత స్సంయుజ్య పదవీం లేఖే యన్నామకీర్తనాత్।
నారాయణేతి యన్నామ జగదచ్యుత రక్షణమ్॥ 56
యాతి విష్ణోః పదం రాజన్ నిర్ధూతాశేషకిల్బిషః

అట్లయ్యును ఘోరనరకబాధల ననుభవింప నవసరము లేకుండా నా శ్రీహరి నాయందు కరుణించి నానోటివెంట నన్యాపదేశమున తన్నామ స్మరణజేయించెను. అది నాపూర్వజన్మ సుకృతమని యూహింపుచు వైకుం ఠవాసుడయ్యెను. ఓజనకచక్రవర్తీ! తెలిసిగాని తెలియకగాని భగవ న్నామస్మరణచేసినను, వినినను సమస్తపాపములు నశించి మోక్షము చేకూరును.

## స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని తొమ్మిదవ అధ్యాయము

# దశమో౽ధ్యాయః

విదేహః—

కోసా వజామిళః పూర్వం దుష్కృతం కేన సంచితం।
కథం తూష్ణీం గతా యామ్యాః కిమూచుస్స్వామినం సది 1

మరల జనకమహారాజు వశిష్ఠుని గాంచి ఓమునితిలకా! ఈ యజామిళుడు పూర్వజన్మంబున నెవడు? ఆజన్మమున నెట్టిదుష్కృత మొనరించెను? విష్ణుకింకరు లతనిని వైకుంఠమునకు గొంపోయినతరువాత యమకింకరు లేమిచేసిరి? విశదంబుగా సెలవిండనెను.

వసిష్ఠః—

ఏవం ప్రచోదితా యామ్యాః ద్రుతం గత్వా యమాంతికం
యమరాజాయ తత్సర్వ మాచఖ్యు రరిందమ॥ 2
పాపిష్ఠం చ దురాచారం నిందితం కర్మ చాశ్రితం।
తం విష్ణుదూతా వై జగ్ముః వైకుంఠం విష్ణుమందిరమ్॥ 3
వయం తత్కార్యకరణే శక్తిహీనాః పునఃపునః।
తచ్ఛ్రుత్వా కోపతామ్రాక్షః జ్ఞానచక్షు ర్దదర్శ సః॥ 4
మ్రియమాణస్య దుర్బుద్ధే ర్విష్ణునామప్రభావతః।
విష్ణుదూతా స్త మాదాయ యయు ర్వైకుంఠ మందిరమ్। 5
హరినామామృతం చైవ మృతికాలే హ్యజామిళః।
స సర్వపాపనిర్ముక్తో విష్ణులోకం గతో౽ధునా। 6
హరి ర్హరతి పాపాని దుష్టచిత్తై రపి స్మృతః।
అనిచ్ఛయా౽పి సంస్పృష్టో దహత్యేవహి పావకః॥ 7
యస్స్మరే ద్భక్తిభావేన నారాయణ మనామయం।

శివస్మృత్రైః న విజ్ఞేయః సత్రాత్రైపల్యా మస్నుతే॥ 8
ఇత్యాలోచ్య యయౌ స్వర్ణ్ణే నారీ ప్రైవస్వతో యమః।

అంతవసిష్ఠుడు జనక రాజేంద్రుని గాంచి, ఓ రాజా! విష్ణుకింకరులచే నిరాకరింపబడిన యమకింకరులు తమప్రభువగు యమునిగ్రోల చేతులు మోడ్చి నిలచి, దేవా! తమ యాకతిని తలవాల్చి "మేమాయజామిళుని గొనిరానుండ విష్ణుదూతలు మముగద్దించి యాతనిని వైకుంఠమునకు దోడ్కొని పోయిరని చెప్పిరి. ప్రేతనాథుడు దాపలుకులాలించి కోపావేశ పరవశుడై పండ్లు పటపటగీటుచు తనకింకరుల నేమో యనబోయెను. కాని యంతలో విష్ణుదూతలు తగినంత కారణములేనిదే వానినేల గొంపోదురని దివ్యదృష్టి నాలోకించి, వీ డవసానకాలమున నన్యాపదేశముగనైన నారాయణ నామస్మరణ జేసినందువలన వారు కొంపోయిరని తెలిసికొనెను. మహాపాతకుడైనను నవసానకాలమున నారాయణ నామోచ్చారణ గావించిన పుణ్యాత్ముడగును. నిప్పును ముట్టుకొనిన కాల్చునని తెలిసిన వాడు ముట్టుకొన్నను, ఏమియు నెఱుంగని పసిపాపముట్టుకొనినను కాల్చి తీరును. అరీతిగనే భగవన్నామస్మరణ సకలదురితాపహారమని యెఱిగి చేసినను, ఎఱుగక చేసినను దానిమహాఫలమది యిచ్చితీరును.

అసౌ వజామిళః పూర్వం విప్ర సౌరాష్ట్రికే నృప। 9
శివాగారార్చకో నిత్యం శివద్రవ్యా పహారకః।
శస్త్రపాణి ర్దురాచార స్స్నానహీన స్తథాఽశుచిః 10
న మంత్రో న విధి శ్శంభుం యోఽర్చయ త్యన్యమానసః
మృడ స్యాభిముఖే పాదౌ ప్రసార్య స్తేన దుర్మదః 11
వయస్యై రన్వితో రాజన్ బహుభాషీ దురాగ్రహః
రూపయౌవనసపన్నో నానాలంకారభూషితః॥ 12
తస్య కాచిద్ద్విజసతీ సురూపా ప్రాప్తయౌవనా।
పతి స్తస్యా హి దుఃఖేన దారిద్ర్యేణాతిపీడితః। 13

అన్యాన్నం చైవ మాకాంక్షన్ పర్యటన్ వర్తనాదిషు।
ఘోషగ్రామాది సర్వేషు యాచనాం వృత్తి మాశ్రితః।
కదా చిత్క్షుధయా తప్తో భారవాహో గృహం గతః।
ఉవాచ భార్యాం శీఘ్రేణ కురు పాకం తు మంగళే॥ 15
బాధతే మాం క్షుధా సుభ్రు తచ్ఛాంతిం కురువారిణా।
ఇతి తస్య వచ శ్శ్రుత్వా ఛలీకృత్యాతిదుర్మదా।
కించి న్నోవాచ తం విప్రం గృహకర్మరతా శనైః।
చిత్తం విటజనే సమ్య గావేశ్యాతీవ దుర్మదా।
తాం కర్కశాం తదా దృష్ట్వా యష్టిమాదాయ తాడ
సా పునః పతిమావిశ్య దృఢం ముష్ట్యాఽహన త్పునః॥
తేన స్వభవనం హిత్వా యయౌ గ్రామాంతరం ద్విజః।
భిక్షాన్నభోజనం కృత్వా చింత యన్మనసా నృప॥ 19
సా సాయ మశనం కృత్వా హ్యాలకృత్య సువాససా।
తత స్తాంబూల మాదాయ రజకాలయ మాగమత్॥ 20
రజకం రూపసంపన్నం రహస్యోవాచ సా నిశి।
కిమత్రాగమనం మూఢే గృహేస్మిన్ కారణంవినా 21
బ్రాహ్మణీ బ్రహ్మకులజా కర్మణా నిందితా వయమ్।

అజామీళుడు తొల్లిటి పుట్టువునందు మహారాష్ట్రదేశములో నొక శివాలయమున నర్చకుడు. అతడు సౌందర్యఘనమదంబులచే మత్తెక్కి నిరంతర మద్యపానియై యుండువాడు. మరియు శివధనాపహారణుండు, స్నానసంధ్యాద్యనుష్ఠానవర్జితుడు. ఒక్కనాడైన దేవుని నర్చింపలేదు. దుష్టులతో విచ్చలవిడిగ విహరించువాడు. శివునకెదురుగా పాదంబులు సాచి పరుండువాడు. ఆదుష్టునకొక పేదపాఱుని భార్యతో సంబంధ మేర్పడినది. ఆమె మిగుల రూపవతి. భర్త పేదవాడగుటచే నామెను ద్రవ్యవస్త్రాదులచే సంతోషపెట్టలేకపోయెను. ఆత డూరూరదిరిగి భిక్షు

మెత్తియేవో యొకవేళ కింటికి జేరువాడు. ఒకదినమున నా పేదబాప డెటకోపోయి యాచించి కొంతసంభారమునుదెచ్చి యలసి యింటికి వచ్చెను. నాకాకలిబాధ మిక్కుటముగ నున్నది. తొందరగా వంటచేయు మని భార్యనుపిలచి చెప్పెను. ఆకులట మనసు తనవిటకానియందే నిలిపి భర్తకుత్తరవుచెప్పక దాహమున కుదకమైన నీయక నిర్లక్ష్యముగా నూరకుండెను. వానికనాదు కోపోద్రిక్తుడై దుడ్డుకర్రతో నామెనుగొట్టెను. ఆమెయు నాకజ్జలాగికొని భర్తను మూడింతలుగ మోదెను. అతడు చేయు నదిలేక వేరొకగ్రామమునకేగి బిచ్చమెత్తి జీవింపుచు నింటిమాట తల పెట్టక కాలముగడపుచుండెను. ఆజారిణి భర్త లేచి పోవుటకింకుకేని విచారింపక యారాత్రి స్వేచ్ఛగా భుజించి, తమలము సేవించి, సింగా రించుకొని యొక రజకునింటికేగి నిన్ను మోహించి వచ్చితినని తెలిపెను. అంతవాడు అమ్మా! మీరగ్రకులజులు. నేను నీచకులజుడను. నేనట్టిపని చేయ నంగీకరింపననెను.

ఏవం వివదమానాం తు దృష్ట్వా తద్ధర్మచారిణీం। 22
కోపరక్తాంత వాసశ్చ సంరక్తాంబరలోచనః।
గృహీత్వా ముసలం శీఘ్రం తాడయామాస కౌశలాత్॥
సాఽవమానతయా శేషం చ హిత్వా రాజపథం గతా।
తత్రేమం దేవలం దృష్ట్వా తస్య సాపాణి మగ్రహీత్।24
వశ్చాదాగత్య వేగేన తేన సా వ్యరమ న్నిశి।
రాత్రిశేషం తతో నీత్వా బ్రాహ్మణీ వ్యభిచారిణీ। 25
పశ్చాత్తాపం గతా రాజన్ ప్రభాతే పతి మాగమత్।
పతిం సంబోధయామాస వాక్యై స్సాధు కృశోదరైః॥
తయా సహ గృహం భూయో గత్వాఽవాత్సీద్యథాసుఖం

ఆమె నాకోరిక నీడేర్చుమని బ్రతిమాలుచున్నది. వాడు నేనెంత నీచకులమున బుట్టినను, నీచవృత్తిచే జీవింపుచున్నను నిట్టి చెడుపనిని చేయ జాలననుచుండెను. ఇంతలో గస్తీతిరుగువారి యజమాని యటకు వచ్చి యామెనుకోపముతో నదిరించి బెదరించెను. ఆపాపాత్మురాలించుకేనియు చలింపక నటనున్న రోకలితో వానినెత్తిపైగొట్టి యటనుండి తిన్నగా

వార్చుకు నింటికరిగి యా రాత్రియంతయును వానితో రతిక్రీడల దేలెను. ప్రాతఃకాలముననే లేచి యింటికరిగి తన చెడునడతకు పశ్చాత్తప్తురాలై, అయ్యో! నాభర్త నన్ను సంతోషపరుప నూరూరదిరిగి యెంతో బాధ నొంది కొంత ధనమార్జించి యింటికి శ్రమపడి రాగా నతనికి తిండిపెట్టక, దాహమైన నీరుక కొట్టిపంపితిని. ఆ పురుషుడెచ్చట నేమికష్టములపాల య్యెనో? ఈపాడువృత్తి కలవడి శరీరసౌఖ్యముకుగోరి యిహపరములకు దూరమైతిని. భర్తను సుఖపెట్టలేని భార్య జీవించుట నిరర్థకము, అని విచారించుచుండ లేచిపోయిన నామె పెనిమిటి మరల యింటికివచ్చెను. తోడనే యామెభర్తకు పాదప్రక్షాళన కుదకమిచ్చి, మంచిమాటలచే నాదరించి నాటినుండి వ్యభిచారము మాని కులకాంతయై, భర్తృపద సేవా పరాయణయై యుండెను.

ఏవ మంతరితే కాలే శివాగారార్చకో నృప। 27
గతాసు రభవ ద్రాజన్ నిరయే యాతనాలయే।
భుక్త్వాతత్ర క్రమా త్పాపం రౌరవాదిషు భూపతే। 28
స పునర్భవ మభ్యేత్య సత్యనిష్ఠసుతోఽభవత్।
కార్తికే కృత్తికాయోగే స కుర్యాత్స్వామిదర్శనమ్॥
సప్తజన్మ గతం పాపం హంతి హ్యేత ద్ద్విజన్మనః।
పశ్చాద్భూమింగతో రాజన్ యమాజ్ఞామస్మరణాద్ధరేః।
ఏషా విప్రసతీ పాపా కాలధర్మా త్క్షయం గతా।
నరకే యాతనాం భుక్త్వా పునర్భూమి ముపాగతా॥ 31
చండాలయోనౌ సంజాతా కన్యాకుబ్జే నరేశ్వర।
చండాలః కాలసుద్ధ్యర్థం గత్వా విప్ర మపృచ్ఛత॥ 32
స జగా దాంత్యజం రాజన్ పితృగండం భవిష్యతి।
శ్రుత్వేత్థం త్వరితో భాగ్యాత్ శిశుం నిష్కాస్యదూరతః
రాజన్ తత్ర ద్విజః కశ్చిత్ పుత్రహీనో దదర్శ తం।
శిశుం బాల్యే త్వనాథత్వా ద్రోదమానం సమగ్రహీత్॥

జత్వోపమాతృహ స్త్రీచ శూద్ర్యా సమ్యక్ప్రపోషితః।
విధింగతాయా స్తద్దాస్యాః విప్రోఽయ ముభవ త్పతిః॥ 35

ఆ శివార్చకుడు కొలదికాలములో మరణించి పలువిధంబులగు నరక బాధల ననుభవించి భూమిపై మరల సత్యనిష్ఠునకు సుతుడై జన్మించి కార్తీకమాసమున నొకనాడు నదీస్నానమాచరించి శివాలయంబున కరిగి శివదర్శనమును జేసెను. ఆపుణ్యంబువలన నేడుజన్మంబులందలి పాపములు పరిహారమై పుణ్యాత్ముడయ్యెను. అతడే అజామిళుడు. అవసానకాలమున భగవన్నామోచ్చారణమున వైకుంఠవాసుడయ్యెను. బ్రాహ్మణుని భార్య యగు నాకులట కాలక్రమంబున నసువులనుబాసి, చాలయమబాధలనంది యొక మాలవానికి కుమార్తెయై జన్మించెను. ఆమాలవాడు తనకు పిల్ల పుట్టిన వేళావిశేషమును జైన్యుని యొక బ్రాహ్మణు నడిగెను. ఆవిప్రు డీపిల్ల తండ్రిగండమున పుట్టెనని చెప్పగ నామెను దూరముగా బారవే యించెను. ఆబాలిక దిక్కులేక యేడ్చుచుండ నొక విప్రుండు గొంపోయి తన దాసిచే పోషింపజేసెను. ఆబాలికయు వయసుకలదియై యాబ్రాహ్మణు నింటిలో దాసిగానుండెను. దానినే యజామిళుడు మోహించెను. వాని పూర్వవృత్తాంత మిదియే.

ఏతత్తే కథితం సర్వం రాజన్ జన్మాంతరాగ్జితం।
యాని పాపాని రాజేంద్ర జన్మాంతరకృతాని వై।
ప్రాయశ్చిత్తా న్యశేషాణి విష్ణుధ్యానం వినా నృప। 36
జిహ్వా నవక్తి యది మాధవనామధేయం।
చేత శ్చ న స్మరతి మాధవపాదపద్మమ్।
శ్రోత్రం కథాం న చ శృణోతి హరే ర్నరేంద్ర
పాపాని తస్య విలయం తు కథం ప్రయాంతి॥ 37
న చ పాపచయా తస్య విలయంయాతినైవచ॥ 38
అనన్యచేతా స్సతతం యే స్మరంతిచ జనార్దనం।
లభంతే తేన నిర్వాణం నాత్ర కార్యా విచారణా॥ 39

తస్మాద్గురుం వా లేశం వా నిహానివృత్తి పాతకం।
కార్తికే మాసి యశ్శక్తో ధర్మస్సూక్ష్మో మహానఘ
పాపానాం దహనే శక్తి రస్తి రాజ న్న సంశయః।
తస్మాత్కార్తికమాసే తు యో ధర్మం న సమాచరేత్
స యాతి నరకం రాజన్ నాత్ర కార్యా విచారణా।
ఇదం యః పుణ్యమాఖ్యానం శృణోత్యఘవినాశనమ్॥
స సర్వపాపనిర్ముక్తో యాతి వైకుంఠమందిరం।
య ఇదం పుణ్యమాఖ్యానం శ్రావయేద్వా సమాహితః॥
తేన పాపాని నశ్యంతి విష్ణునా సహ మోదతే।

ఎప్పుడును పవిత్రహృదయముతో భగవంతుని ధ్యానింపక, హరి కథల నాలింపక, యెన్ని ప్రాయశ్చిత్తములను చేసికొనినను మానవుని పాపము లంతరింపవు. భగవద్భక్తులందరకును మోక్షము కరతలామలక మే. కార్తీక మాసమున చేసిన ధర్మము సూక్ష్మమైనను ఫల మనంతము. శక్తి కలిగియుండియు నేదియు చేయని వారన్ని నరకబాధలను పొందుదురు. ఈ కార్తీక మాహాత్మ్యమును నిర్మల చిత్తముతో చదువువారు, వినువారు కూడ వైకుంఠవాసు లగుదురు.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
పదవ అధ్యాయము



# ఏకాదశోఽధ్యాయః

వసిష్ఠః—

భూయః శృణుష్వ రాజేంద్ర పుణ్యాం కార్తిక సంభవమ్।
కార్తిక్యామతసీపుష్పైరర్చయేద్యో జనార్దనం 1
తస్య పాపాని నశ్యంతి చాంద్రాయణఫలం లభేత్।
యో దూర్వాంకుశాగ్రైశ్చ పూజయేత్కార్తికోచ్యు
తమ్।

సర్వపాపవినిర్ముక్తో యాతి తత్పదమవ్యయమ్।
యోఽర్చయేదచ్యుతం భక్త్యా కార్తికే రాజసత్తమ॥3
వస్త్రైర్విచిత్రవర్ణైశ్చ స లభేత్ఫలముత్తమం।
కార్తికే మాసి యస్స్నాత్వా దీపమాలాభి రర్చయేత్॥
యః శ్రావయేత్పురాణం చ యః కుర్యాచ్ఛ్రవణంతథా
సర్వపాపవినిర్ముక్తస్తత్పదం యాతి భూమిప॥ 5

వసిష్ఠమహర్షి మఱల జనకమహారాజుతో, ఓరాజా! కార్తీకమహాత్మ్యము నింకను వినిపించెదను. శ్రద్ధగావినుము. ఈమాసమునందవిసి పూలచే శ్రీహరిని పూజించినవారు చాంద్రాయణ వ్రతమొనర్చిన ఫలము నందుదురు. దూర్వాంకుర దర్భాగ్రంబులచే నర్చించినవా రఖిలపాపవిమోచనులై హరిని జేరుదురు. చిత్రవస్త్రములచే నలంకరించి దీపమాలికలుంచి సేవించినవారు విష్ణుసాయుజ్యమందుదురు. నదీస్నాన మొనరించి భగవత్సన్నిధానమున పురాణమును పఠించువారును, వినువారును వైకుంఠమున విష్ణుసేవకులగుదురు. దీనింగూర్చి విగులనాశ్చర్యకరము, పాపపరిహారకము, ఆయురారోగ్యైశ్వర్యదమునగు నొక యితిహాసముకలదు.

అత్రైవోదాహరంతీమమితిహాసం పురాతనం।
పాపఘ్నం మహదాశ్చర్య మాయురారోగ్యవర్ధనమ్॥ 6

కశ్చిత్కళింగదేశస్థో బ్రాహ్మణో మందరాహ్వయః
స్నానసంధ్యావిహీనస్సన్ పరేషాం భృత్యతాంగతః 7
తస్య భార్యా సుశీలా చ పాతివ్రత్యపరాయణా।
సర్వలక్షణసంపన్నా నారీణా ముత్తమా వధూః ॥ 8
నాసూయాం కురుతే క్వాపి పతినా రాజసత్తమ।
స తథా జీవనోపాయం జానీతే న కదాచన॥ 9

ఖడ్గపాణిశ్చ కాంతారే చౌర్యవిత్త ముపాశ్రయన్।
పాంథానాం బాధతే నిత్యం హృత్వా వస్త్రాణి వై నృప॥
గత్వాఽన్యదేశం బలవాన్ క్రీత్వా వస్త్రాణి సర్వశః।
తేనోపజీవనం కుర్వన్ కుటుంబభరణాతురః॥ 11

పాంథం కంచి ద్ద్విజం దృష్ట్వా ఖడ్గపాణి స్స కాననే।
తమభ్యేత్యాశు సంగృహ్య నకే బద్ధ్వాఽహరద్ధనమ్॥ 12
తం దృష్ట్వా లుబ్ధకః క్రూర శ్శూర శ్చాపధర శ్శరః।
స్వయం జగ్రాహ తత్సర్వం తౌ హత్వా దుష్టధీర్నృప॥
వ్యాఘ్ర స్తదా గుహాంతస్థోఽప్యాజగామ గుహాద్బహిః।
తద్గంధ మాఘ్రాయాగత్య వ్యాధం దృష్ట్వాఽగ్రహీన్నృప
సోఽపి ఖడ్గేన తం వ్యాఘ్రం మహాన క్రోధసంయుతః।
అన్యోన్యఘాతదోషేణ కాలస్యాయతనం గతౌ॥ 15
తావేక కాలే హ్యేకత్ర ద్వౌ విప్రౌ వ్యాఘ్రలుబ్ధకౌ।
జగ్ము ర్నరక మేకత్ర కాలసూత్రం తతః పరమ్॥ 16
తత్రైవ కూపే క్రిమివిష్టసంకులే మహాభయధ్వాంతసుతప్త
రక్తకే, నిమజ్జయామాసు రథాపరం తాన్ దుఃఖాన్వి
తాన్ పాపభరేణ ఘాపతే॥ 17

సౌరాష్ట్ర దేశమున మందరుడను విప్రుడు కలడు. అతడితరుల యిండ్లలో వంటలుచేసి, స్నానసంధ్యాదులు విసర్జించి, దురాచారుడై యుండెను. అతని భార్య మహాసాధ్వి, శాంతురాలు. బుద్ధిమంతురాలు, కులాంగన యని ఖ్యాతినందినది. ఆమె భర్త చెడునడతకు గోపము చెందక భర్తనే దైవముగా నెంచి పూజించుచుండెను. అతడు వంటలుచేయుటవలన పొట్టగడువక నన్యదేశీయ వస్తువులను కొని విక్రయించుచు వర్తకము చేయ మొదలిడెను. దానివలనను నుదరపోషణగాకుండుటచే దొంగతనములు చేయ మొదలిడెను. గదా చేత నాయుధమును ధరించి బాటసారులను గొట్టి దోచుకొని జీవించుచుండెను. నొకదినమున నొక విప్రుడు బాటసారియై పోవుచుండ వానింబట్టుకొని మఱ్ఱిచెట్టునకుగట్టి వానికడనున్న సొత్తును దొంగిలించెను. ఒకకిరాతుడింతలోవచ్చి యాబ్రాహ్మణుల నిరువురనుజంపి యాద్రవ్యము నపహరించెను. ఆప్రాంతముననే కొండగుహలో వసించు వ్యాఘ్రమొకండు మనుష్యవాసనను పసిపట్టి యందుండి బయలువెడలివచ్చి యాకిరాతునిపైబడెను. వాడు దానితో కలియబడి దానిం జంపెను. అదియును కిరాతుని జంపెను. ఈరీతి నొకేసమయమున జచ్చి కర్మవశమున వా నలువురును కాలసూత్రమనెడి నరకమున మలమూత్రభూయిష్టమై క్రిమిసంకులంబైన నొక కూపమున బడియుండి నెత్తురు ద్రావుచు, భయంకర గర్జనముల జేయుచు పలుబాధలందుచుండిరి.

సావిత్రపవత్నీ సకలైశ్చ ధర్మై ర్రాచారనిష్ఠా హరిభక్తి
సంస్థా సత్సం
గసల్లాప ముపాశ్రితా జనై స్సదా పతిధ్యానపరా, నరే
శ్వర॥ 18

అస్యా గృహం యతిః కశ్చి దాగతో దైవయోగతః।
విష్ణుమేవ స్మర న్నుచ్చైః ప్రనృత్యన్ పులకాంకితః 19
విష్ణుభక్త్యమృతం పీత్వా విష్ణుం సర్వత్ర చింతకః।
రోమాంచితతనుర్బ్భాప ఆనందాశ్రావ్యాకులేక్షణః॥ 20
తం దృష్ట్వా సా చ తేభ్యోఽన్నం దత్వోవాచ యతించసా

భవదాగమనం మహ్యం దుర్లభం గృహమేధినాం॥ 21
గృహీ నాస్త్యత్ర గేహేఽస్మిన్ ఏకాకీ తత్పరాయణా।
ఏవముక్తస్తయా యోగి శ్యామాం తు ప్రియవాదినీమ్॥
శ్రుణు భద్రే ప్రవక్ష్యామి మహదాశ్రమివ మందిరే।
దినాంతే విష్ణుపురతః పురాణపఠనం మయా॥ 23
కార్యం తదర్థం దీపస్య వర్తిం కృత్వా దదస్వ మే।
ఆనేష్యామ్యహమేవాత్ర తైలం తద్భక్తికారకః॥ 24
ఇదానీం కార్తికే మాసి పౌర్ణమీ వర్తతే శుభా।

మందరుని మరణానంతర మాతని భార్య సర్వదా సదాచారవతియై, హరిభక్తితత్పరయై సజ్జనులతో సహవాసముజేసి భర్తృధ్యానపరాయణయై యుండెను. ఒకదినమున నామె గృహమునకొక యతి వచ్చెను. ఆ సన్యాసి నామె గాంచి సంతసమున దేలుచు ఓమహాసుభాగా! నావంటి యనాథలకు మీవంటి మహాత్ములదర్శనము దొరకుట కష్టసాధ్యము. నాకు భర్త లేదు. సంతతిలేదు. నన్ననుగ్రహించి కృతార్థురాలిగా జేయుమని ప్రార్థించెను. వినయవిధేయురాలును సదాచారవతియునగు నాకాంతంజూచి యా సన్యాసి, అమ్మా! నేను నేటిరాత్రి దేవాలయమందు పురాణపఠనముగావింతును. అందుకు దీపమొండు కావలసియున్నది. తైలమును నేను తెచ్చుకొందును. నీవొక దీపపాత్రను, వత్తిని చేకొనిరమ్ము. ఆదీపకాంతిలో పురాణమును జదువుదును. ఇది కార్తికమాసమగుటవలన, నేడు పూర్ణిమగుటవలన, దేవాలయమున దీపముంచిన మహాఫలితముకలుగును. దీపపాత్రను వత్తిని దెచ్చినఫలము నీకందుదువనెను.

ఇతి తస్య వచః శ్రుత్వా జాతహార్దాన్వితా నృప॥ 25
గృహసమ్మార్జనం సమ్యగ్గోమయేనోపలిప్య చ।
రంగవల్ల్యా స్వస్తికాద్యైర్యలంకృత్య తతః పరమ్॥ 26
తూలం సంశోధ్య విధివద్వర్తిద్వయమరిందమ।
తేనాసీతేన తైలేన దీపం సావిష్ణువేఽర్పయత్॥ 27

దీపపాత్రం తథా వర్తి స్స్వయం దత్వాఽపి హర్షితః।
ప్రజ్వాల్య పావకం భక్త్యా జ్వాలాం చ సమయోజయేత్
తత్పరికాళస్థలే యోగీ సమభ్యర్చ్య జనార్దనం।
పురాణపఠనం తత్ర చ కారాత్మ విశుద్ధయే॥ 29
గృహం గృహం తతో గత్వా జనానాహూయ సాసతీ।
పురాణశ్రవణార్థం తు శుశ్రావ చ జనై స్స్వయం॥ ౩0
అనన్యబుద్ధ్యా రాజేంద్ర స్వయ మేవ యథా గతా।
పశ్చాదంతరితే కాలే కాలధర్మేణ సా నృప॥ 31
మమార విష్ణుధ్యానేన జ్ఞానేనాత్యంతనిర్మలా।

అంత నాగుణవతి సంతసించి వెంటనే దేవాలయమున కరిగి, సమ్మార్జనచేసి, గోమయముచే నలికి, ముగ్గులుంచి, స్వయముగా ప్రత్తివిడదీసి వత్తులు రెండుచేసి యతి తెచ్చిన తైలము నొకపాత్రలోబోసి వత్తులు వేసి పెద్దదీపము వెలిగించెను. పిమ్మట నింటికేగి కనపడినవారినెల్ల నేడు కార్తీకపూర్ణిమయనియు నొకస్వామి ఆలయమున పురాణపఠనము గావించుననియు బిలచుకొనివచ్చి వారితోగూడ సాంతముగ పురాణము వినెను. అప్పటినుండి యామె జీవితశేషమంతయు విష్ణుచింతనయందును, హరిసేవయందును గడపి మరణించెను.

తదా జగ్ము ర్విష్ణుదూతా శ్శంఖచక్రాంబుజశ్రియః॥ 32
చతుర్భుజారవిందాక్షాః పీతాంబరధరా శ్శుభాః।
మనోహరేణ దివ్యేన విమానే నార్కవర్చసా 33
నానాపుష్పఫలై స్తస్వ దమరో ద్యాస స భవైః।
ప్రవాళముక్తామణిభిర్విచిత్రై ర్వస్త్రభూషణైః। 34
అలంకృత్య విమానాగ్ర్యం తన్మధ్యే తాన్నివేశ్య చ।
విష్ణుభక్తైర్వినీతైశ్చ కరతాళైశ్చ నర్తనైః॥ 35

జయశబ్దై స్తూయమానా యయౌ వైకుంఠమందిరమ్।
తదా తద్గమనే బాలా దృష్ట్వా తన్నిరయాలయమ్॥ 36
విష్ణుదూతా నువాచేదం పృష్టేనాంతరాత్మనా।
తిష్ఠంతు నిమిషం దేహా నరకే తు నిపాతితః॥ 37
అత్రాంధకూపే పతితః పతి ర్మే దుష్కృతిమాగతః।
త్రిభి స్స్వయం నివత్యాశో వదధ్వం మమ వైష్ణవాః॥ 38

ఆమె పుణ్యాత్మురాలగుటచే విష్ణుదూతలు వైకుంఠమునకు గొనిపోవుటకు విమానముతో వచ్చిరి. అది హేమ మయరత్నాలంకారములతో నిండి నిండుకాంతి వెదజల్లుచుండెను. అది యామెను గూర్చుండజేసి విష్ణుదూతలు వైకుంఠమునకు గొంపోవుచుండిరి. అంతరిక్షమధ్యమున నాకాంత నరకలోకమును జూచెను. అప్పుడామె విష్ణుదూతలం గాంచి. ఓమహాత్ములారా! ఒక్కనిమిషకాలమిచ్చట విమానమాపుడు. నాభర్త మరణించి యానరకమున మహాదుష్కృతులతో నానాబాధల ననుభవించుచుండెను. నాభర్తను చూడవలెనని యున్నది. ఈప్రాంతమున గట్టుకొనుడు. అదుగో నాపతి. అతనితోనున్న మువ్వురు నెవరు? చెప్పుడు. అని ప్రార్థించెను.

విష్ణుదూతాః—

పతి స్త్వత్తో మహాభాగే పరేషాం దానకర్మభిః।
చచార చోరవృత్తిం చ పరవిత్తైక జీవనః॥ 39
వేదమార్గం పరిత్యజ్య హ్యశుద్ధమార్గే వ్యవస్థితః।
తేన కర్మవిపాకేన నిరయం యాతి మంగళే॥ 40
ద్వితీయోఽయం ద్విజస్సుభ్రు మిత్రఘ్న శ్చాతిపాతకః।
బాల్యా దారభ్య తన్మిత్రం ప్రాణా దప్యధికం శుభే॥ 41
తం హత్వా తద్ధనం హృత్వా దేశాంతర ముపాగమత్।
పతి స్తవాశుభాచారః తద్ధనం స్వయమాహరత్॥ 42

మార్గే సంధ్యావిహీనస్సమగాత్ కాననే కమలేక్షణే।
తౌ హత్వా లుబ్ధకస్తత్ర సోఽపి వ్యాఘ్రేణ దంశితః॥ 43
శార్దూల మసినా ఘోరో మృతౌ తౌ వ్యాఘ్రలుబ్ధకౌ।
నిరయాలయవాసీ చ లుబ్ధకో బ్రహ్మహత్యయా॥ 44
వ్యాఘ్రోఽయం చ పురా పాపీ బ్రాహ్మణో ద్రావిడశ్శుచిః
ద్వాదశ్యాం తైలభోక్తాఽభక్ష్యభక్ష్యవిచారవాన్ 45
తేన కర్మవిపాకేన నిరయాలయ మాశ్రితం।

అంత విష్ణుదూతలిట్లనిరి. అమ్మా! నీభర్త పవిత్రబ్రాహ్మణవంశమున జనించియు పరులయింట వంటలవాడై స్నానసంధ్యాద్యనుష్ఠానముల విడనాడి యంతటితో బోక చోరవృత్తి నవలంబించి దురాచారుడయ్యెను. ఆపాతకముల ననుభవింప నరకమున నుండెను. అటనిచ్చటనున్న రెండవవాడును ద్విజాతే. వీడు తన కెన్నాళ్లనాటి స్నేహితుని మోసమున జంపి వాని ధనమంతయు నపహరించి మిత్రద్రోహియయ్యెను. నీభర్త వీనిని మఱ్ఱిచెట్టునకు గట్టి యాధన మపహరించెను. ఇంతలో నామూడవవాడగు కిరాతుడు వీరి నిద్దరను సంహరించి యాధన మపహరించి బ్రహ్మహంతకుడయ్యెను. ఆనాల్గవవాడొక వ్యాఘ్రము, అదియీ కిరాతుని జంపినది. ఆపులి పూర్వజన్మమున ద్రావిడదేశస్థుడైన యొక విప్రుడు. తైల ప్రియుడై యిది తినదగును. ఇది తినదగదను నాలోచనము లేక ద్వాదశినాడు నూనెతో చేసిన భక్ష్యములను దినుచుండు దురాచారుడు. వీరు నల్వురును మిగుల పాపాత్ములగుట నరకబాధల నందుచుండిరని చెప్పిరి.

తైరేవ ముదితా తన్వీ పునస్తా నాహ భూపతే॥ 46
కేన పుణ్యేన తేషాం తు కథం ముక్తి ర్భవిష్యతి।
త ఊచు రిత్థం రాజేంద్ర కార్తికే చరితం త్వయా॥ 47
ఫలం దదస్వ పౌరాణశ్రవణస్య శుభాననే।
పత్యుః కార్తమాసస్య తేన ముక్తి ర్భవిష్యతి॥ 48
తత్పురాణస్య యద్వృత్తిం తత్పాత్రే యత్సమర్పితత్।

మృగలుబ్ధకయోః న్యస్యాం దస్యాం దేహి శుభాననే॥ 49
మిత్రఘ్నస్యాపి మహ్యఘ్నే ద్విజస్య కుటిలాలకే।
యదాహూతాః జనా నాథ పురాణశ్రవణోత్సుకా। 50
తత్ఫలం దేహి విప్రస్య కృతఘ్నస్య సుభేక్షణే।
తేన తేన ప్రభావేన ముక్తిం యాంతి న సంశయః॥ 51
ఇతి తేషాంవచ శ్శ్రుత్వా విస్మయాదతి తేక్షణా।
దత్తం దత్తం మయా రాజన్ తావం యన్ముక్తి కారణం।
తదా తే పాతకాన్ముక్తా విమానం హ్యధిరుహ్య చ।
యయుర్విష్ణుపదం సర్వేశం సంతప్తా నరాధిప॥ 53
శనైస్తేజ్ఞానగమ్యస్య ముక్తిం యాంతి పరంపదం।
తస్మాత్కార్తికమాసేతు పురాణశ్రవణం యది॥ 54
కురుతే రాజశార్దూల స యాతి హరిమందిరం।
య ఇదం దివ్యమాఖ్యానం శృణోతి శ్రద్ధయాన్వితః॥ 55
కర్మత్రయార్జితం పాపం తత్క్షణాదేవ నశ్యతి।

ఆమె యీ మాటలనాలకించి, ఓ మహాత్ములారా! నా భర్తను వానితో నున్న ముగ్గురను నరకబాధనుండి యుద్ధరింప తగిన నుపాయము మున్న వచింపుడని వేడెను. అంత నా విష్ణుకింకరులు, తల్లీ! నీవు కార్తిక శుద్ధపూర్ణిమనాడు పురాణమునువినిన ఫలమును నీభర్త కిచ్చితివేని యాతనికి పుణ్యలోకమబ్బును ఆపురాణశ్రవణమునకుగాను సన్యాసిచే వెలిగింపబడిన దీపమునకు నీవుచేసిన వత్తి నుపయోగించుటచే గలిగిన పుణ్యమును పులికిని, దీపపాత్ర నిచ్చినందున వచ్చిన పుణ్యమును కిరాతునకును, పురాణశ్రవణార్ధము జనులను వారి గృహములకేగి పిలిచినపుణ్యమును మిత్రవంచకుడగు విప్రునకును నిచ్చితివేని యీ నలువురకును వైకుంఠవాసము సిద్ధించును. అని చెప్పినంతనే యామె మిగుల నాశ్చర్యమంది యట్లు చేసెను. అప్పుడు

వారు నరకమునుండి యుద్ధరింపబడి తామును పలువిధంబుల గొనియాడుచు నామెతో విమానారూఢులై వైకుంఠమున కరిగిరి. ఓ మిథిలాధినాథా! కార్తీకమాసమున పురాణమును వినుటకును దీపదానము చేయుటకును నింతఫలమున్నది. ఈకథను గూడ వినినవారి పాపములు మాపుమాసి పుణ్యాత్ములగుదురు.

స్కాందపురాణమునందలి కార్తీకమహాత్మ్యములోని
పదునొకండవ అధ్యాయము

---

# ద్వాదశోఽధ్యాయః

వసిష్ఠః—

కార్తిక్యా మిందువారస్య మహాత్మ్యం శృణు భూపతే।
తస్మాచ్ఛతగుణం తస్మిన్ వ్రతం సౌరిత్రయోదశీ॥ 1
సహస్రగుణితం తస్మాత్కార్తికే మాసి పౌర్ణిమా।
తయా లక్షగుణం ప్రోక్తం మాసన్య ప్రతిపద్దినమ్। 2
తస్మాత్కోటిగుణాం రాజన్ అంతిమైకాదశీం విదుః।
తస్మాదనంతగుణితం కార్తికే ద్వాదశీదినమ్॥ 3
అంతిమైకాదశీం మోహాదుపోష్య యది మందిరే।
గీతవాద్యపురాణైశ్చ కుర్యాజ్జాగరణం నరః॥ 4
స సర్వపాపనిర్ముక్తో విష్ణులోకే వసేచ్చిరం।
తథా పరదినే ప్రాప్తే పారణం బ్రాహ్మణైస్సహ॥ 5
యః కార్తికే మాసి రాజన్ స సాయుజ్యం లభేద్ధరేః।
కార్తికేయశ్చ ద్వాదశ్యాం అన్నదానం మహాత్మనే॥ 6

యః కుర్యా ద్రాజతాబ్జాలు సర్వపాపన్నివర్తతే।
గంగాతీరే కురుక్షేత్రే కోటిబ్రాహ్మణభోజనాత్॥ 7
యత్ఫలం లభతే జంతుః తత్ఫలం ద్వాదశీం విభుః।
ఉపరాగసహస్రాణి వ్యతీపాతాయుతాని చ॥ 8
అమాలక్షం తు ద్వాదశ్యాః కళాం నార్హంతి షోడశీమ్।
తదేకతిథయ స్సంతి సదా సత్పుణ్యవాహకాః॥ 9
తసా మనంతగుణితా ద్వాదశీ విష్ణువల్లభా।
కార్తికే శుక్లపక్షే తు ద్వాదశీ హరిబోధినీ॥ 10
తస్యా మేకస్య విప్రస్య పన్నదానం కరోతి యః।
స సర్వసౌఖ్యం లభతే పశ్చాద్విష్ణుపురే నృప॥ 11
కార్తికే మాసి ద్వాదశ్యాం దధ్యన్నం దాన ముత్తమం
యః కుర్యా త్సోఽపి ధర్మేభ్యో హ్యధికం ఫల మశ్నుతే॥
నారీ వా పురుషో వాపి కార్తిక్యాం ద్వాదశీదినే॥
స్వర్ణశృంగా రౌప్యఖురాం సవత్సాం సుపయస్వినీః॥ 13
గా మభ్యర్చ్య విధానేన దానం యః కురుతే నఘ।
యావంతి రోమ్ణాం సంఖ్యా స్యా త్తావ త్స్వర్గాధిపో భవేత్
ద్వాదశ్యాం కార్తికే మాసి వస్త్రదానం కరోతి యః।
భక్త్యా ప్రయత్నతో రాజన్ పాపైః పూర్వార్జితై రపి॥
విముచ్య విష్ణుభవనం యాంతి నా స్త్యత్ర సంశయః।
ద్వాదశ్యాం కార్తికే మాసి పౌర్ణమాస్యాం ప్రతిపద్దినే॥ 16
యో దీపదానం కురుతే సకాంస్యం చ ఘృతాదికం।
కోటిజన్మార్జితం పాపం తత్క్షణేన వినశ్యతి॥ 17
ఫలం యజ్ఞోపవీతం చ సతాంబూలం సుదక్షిణమ్।
ద్వాదశ్యాం యే ప్రకుర్వంతి తత్ఫలం శృణు భూమిప 18

గత్వా మహాశిష్టాన్ భోగాన్ స్వర్గేఽప్యంతేతు దుర్ల
భాన్।
పశ్చాద్విష్ణుపురం ప్రాప్య మోదతే విష్ణువచ్చిరమ్॥ 19
సువర్ణతిలదానం ద్వాదశ్యాం కార్తికేనృప।
సాలగ్రామం సదక్షిణం శ్రోత్రియాయ కుటుంబినే 20
దానం యః కురుతే భక్త్యా తస్య పుణ్యఫలం శృణు।
చతుస్సాగరపర్యంతం భూదానాద్యత్ఫలం విదుః 21
తత్ఫలం సమవాప్నోతి ద్వాదశ్యాం కార్తికస్య చ।

ఓ జనకమహారాజా! కార్తీకసోమవార వ్రతమహిమను, కార్తీక శుద్ధ ద్వాదశి రోజున బ్రాహ్మణునకు భోజనమిడిన ఫలమహిమను, సాలగ్రామదానమహిమను చెప్పెద నాలింపుము. కార్తీక సోమవారమున నుపవాసముండి సాయంకాలమున శివకేశవాలయములలో దేనికైనబోయి యాదేవునర్చించి నక్షత్రదర్శనము చేసినపిమ్మట భుజించిన వానికి విష్ణు సాయుజ్యమగును. సోమవారవ్రతముకంటెను కార్తీకమాసమున శనిత్రయోదశి వచ్చిన నా డావ్రతమొనరించిన నూరురెట్లు ఫలము లభించును. శనిత్రయోదశీ వ్రతముకంటెను వేయిరెట్లు ఫలమిచ్చునది కార్తీకశుద్ధపూర్ణిమ. దానికంటె లక్షరెట్లు ఫలమిచ్చునది కార్తీక శుద్ధపాడ్యమి. దానికంటె ఫలమిచ్చునది కార్తీకశుద్ధద్వాదశి కార్తీకశుద్ధ ఏకాదశినాడు పూర్ణోపవాసముచేసి యారాత్రివిష్ణ్వాలయంబునకరిగి హరిని పూజించి జాగరణ మొనర్పవలెను. మఱునాడు ద్వాదశియగుట నాదినమున బ్రాహ్మణ సమారాధనను చేయవలెను. పిమ్మట తానుభుజింపవలెను. అట్టివానికి నారాయణసన్నిధానమున నిరంతరముండు నవకాశము లభించును. ఆద్వాదశిరోజున నొక్క సద్విప్రునకు భోజనమిడిన సంపత్సమృద్ధి సిద్ధించి సూర్యగ్రహణసమయమున గంగాస్నానమొనరించి తత్తీరమున కోటి బ్రాహ్మణులకు మృష్టాన్నమిడిన ఫలముచేకూరును. సూర్యగ్రహణములు వేయిగాని, వ్యతిపాతయోగములు పదివేలుగాని, అమవాస్యలు లక్షగాని కార్తీకశుద్ధద్వాదశియొక్క పదునారవభాగముతో సరికావు. ఆదినమున శ్రీమన్నారాయణుండు శేషశయ్య నుండి లేచునుగావున శ్రీహరి కతిప్రియమగు దినమయ్యెను. అందును నా

అత్రస్థిత్వా ఋణం సర్వం గృహీత్వా గంతు మర్హసి।
యో జీవతి ఋణీ నిత్యం నిరయం కల్ప మశ్నుతే 28
పశ్చాత్తస్య సుతో భూత్వా తత్సర్వం ప్రతిదాస్యతి।
ఏవముక్తే ద్విజే వైశ్యః కోపాదారక్తలోచనః 29
మూఢాద్య దేహి మే ద్రవ్యం నోచే త్ఖడ్గేన తాడయే।
ఆకృష్య కేశా నాదాయ దుష్టాత్మా పాపధీ రయమ్ 30
తేనాశు పతితం భూమౌ విప్రం పాదాదతాడయత్।
కోపావేశేన పాపాత్మా విప్రం వేదాంతపారగమ్ 31
ఖడ్గేనైవాహనత్తూర్ణం హరిస్తు హరితో యథా।
మమార తేన ఘాతేన బ్రాహ్మణో బంధువత్సలః 32
స దుద్రావ తతో వేగా ద్భయాద్రాజ్ఞో మహీపతే।
పున ర్గృహం ప్రవిశ్యాసౌ బ్రహ్మఘ్నో నిరపత్రపః 33
ఆయురంతరితే కాలే మరణం సముపాగతః।

గోదావరీతీరమందలి యొకపల్లెయందు వైశ్యుడొక డుండెడువాడు. మిగుల దురాశాపరుడు, దురాచారుడు; నిత్యము ధనార్జనాసక్తుడు; తానార్జించిన దనుభవింపడు; ఇతరులకు బెట్టడు. దానధర్మములన్న నతనికి కిట్టదు. పరనింద చేయుటన్న నానందము. ఏజంతువునకుగూడ నుపకారము చేయనొల్లడు. పరద్రవ్యంబు నపహరించుట వాని నైజగుణము. తన గ్రామమునకు సమీపమందున్న యొకబ్రాహ్మణున కతడు విశేషధన మిచ్చెను. వగ్తరకు డావిప్రుని తనకీయవలసిన ధనమిమ్మని గడువుకోరెను. ఋణబాధ నరకబాధకంటె గొప్పది. ఉత్తమర్ణునిఋణ మీజన్మయందు దీర్చకున్న ముందు జన్మలోనైన వానియింటబుట్టి తీర్చవలసియుండునని నెమ్మదిగా సమాధానము చెప్పెను. ఆమాటకా కోమటి మండిపడుచు, నాడబ్బు నాకిప్పుడు కక్కవలయును. లేనిచో నీకత్తితో నీకుత్తుక నుత్తరింతునని గద్దించి పలుకుచునే యాబ్రాహ్మణుని మెడపట్టి యీడ్చి వంచి కత్తితో కంఠము నఱికెను. ఇంక నాతావుననున్నచో రక్షకభటులు

పట్టుకొనుటకును భయమున పారిపోయి యింటిలో దాగెను. కొంతకాలము నకు బ్రహ్మహత్యాపాతకముచే రోగభూయిష్ఠుడై మరణించెను.

ఆయనము ర్వ్యతీపాతాశ్చ చండహస్తాభయంకరాః 34
కరాళావదనా రాజన్ కృష్ణరాత్రిసమప్రభాః।
పాశై రాబధ్య తం నిన్యుః యమస్య తు నికేతనమ్ 35
తస్మిం స్తే రౌరవే ఘోరే ఎవపజ్జ ర్యమాజ్ఞయా।
తస్య సూను స్సుశీలాల ధర్మగిరేతి విశ్రుతః॥ 36
పిత్రార్జితధనం హారి సదా ధర్మపరాయణః।
కూపోద్యానశిలాకారాది సేతుబంధన కారకః॥ 37
వివాహోపనయా కర్తా యజ్ఞకేష్వతిలాలసః।
అన్నదానపరో నిత్యం సూపు రాణాం ద్విజన్మనామ్॥ 38
సర్వేషామపి వర్ణానాం క్షుధార్తానాం మహీపతే।
తస్య చాంతరితే కాలే గృహీతః పుణ్యయోగతః। 39
నారదః పర్యటన్ స్థానా ద్ధర్మరాజాలయాచ్ఛుచిః।
వీణాసుతంత్రీః ధ్వనయన్ స గాయ న్విష్ణుకీర్తనమ్। 40
వశిగ్వ్యపార్శ్వే కాలే ప్రసృత్యన్ పులకాంచితః।
గోవింద నారాయణ కృష్ణ విష్ణో అనంత వైకుంఠ నివాస మూర్తే
శ్రీవత్స విశ్వంభర దేవదేవ నమ స్తదేవేశ నమో నమస్తే
నృత్యంత మేనం గృహ మాగతం వణిక్ స తు స్తసంతోష
పయోధిమగ్నః, ననామ పాదౌ మునయే మహాత్మనే
హ్యానంద బాష్పోన్న యన స్సదండవత్॥ 41
తం పాదపద్మావనతం దయాళు ర్ముని స్తదా తం పరిరభ్య

హార్షితః, స ప్రాహ వైశ్యః పురతః కృతాంజలిః తం
విష్ణు మర్ఘ్యాదిభిరర్చ్య తం నృప॥ 43
భవదాగమనం మహ్యాం మునే హ్యాత్యంత దుర్లభమ్।
యదార్జితం మయా పూర్వం ధర్మపాకముపాగతం॥ 44
యన్మయా చరితం త్వద్య ఫలితం తవ దర్శనాత్।
సేవాం విధాస్యే విప్రేంద్ర ప్రాప్తయే ప్రణవేన చ॥ 45
ఇతి తస్య వచశ్శ్రుత్వా మందస్మేర ముఖాంబుజః।
ఉవాచ ధర్మవీరం తం నారదో భగవాన్ మునిః॥ 46

అంత యమకింకరులువచ్చి వానిని పాశములచే బంధించికొని పోయి నరకమున నుంచిపలువిధములుగ బాధించుచుండిరి. వానికొకపుత్రుడు కలడు వానిపేరు ధర్మవీరుడు. అతడు సార్థకనాముడై ధర్మమునకును దానమునకును తండ్రిసంపాదించిన ధనమును వ్యయపఱచుచు బీదలను గాపాడుచు, వాపీకూపతటాకాదులను మరుభూములందు త్రవ్వించుచు, యజ్ఞయాగాదులకు ధనమొసంగుచు నిరతాన్నప్రదాతయై మిక్కిలి కీర్తిసంపాదించెను. కొంతకాలమిట్లు గడువ నావైశ్యుని భాగ్యవశమున సకలలోక సంచారి యగు నారదుడు యమలోకమునుండి భూలోకమునకుగిగి హరినామస్మరణ చేయుచు ధర్మవీరునికడకువచ్చెను. ధర్మవీరుడు నారదునకు సాష్టాంగనమస్కార మొనరించి యతనిని విష్ణుదేవునిగా భావించి యర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి, ఓమహానుభావా! నాపూర్వపుణ్యంబువలన తమదర్శనంబు లభించినది నే నీజన్మమున ధన్యుడను. నాయిల్లు తమరాకవలన ధన్యత్వము జెందినది. తమయాజ్ఞలివి తలదాల్చి మిమ్ము సేవింపగలను. నావలన తామందదలచినపనుల నందుకొని తమవచ్చినకార్యము తెల్పి నన్ను కృతార్థునిగ నొనర్పుడని వేడుకొనెను.

నారదః—

ధర్మవీరాద్య మే వాక్యం సావధానమనా శృణు॥ 47
కార్తికస్య తు మాసస్య త్వాఖ్యే హరివల్లభా॥

స్నానదానాదికం తస్య సదా నంతఫలం విభుః॥ 48
ఆఢ్యకో వా దరిద్రో వా యతి ర్వానస్థ ఏవ వా।
బ్రాహ్మణః క్షత్రియో వాఽపి వైశ్యశ్శూద్రోఽపి వా సతీ
సాలగ్రామశిలాదానం యే కుర్వంతి ప్రయత్నతః।
తులాసంస్థే దినకరే ద్వాదశ్యాం కార్తికే దినే॥ 50
తేన పాపాని నశ్యంతి జన్మాంతరకృతాని చ।
ధర్మరాజాలయే వైశ్యః పితా తవ స్మృతిం గతః॥ 51
రౌరవాఖ్యే మహాఘోరే పచ్యతే నరకాగ్నినా।
తస్య పాపవిశుద్ధ్యర్థం ద్వాదశ్యాం కార్తికస్య చ। 52
సాలగ్రామశిలాదానం కురు త్వం మా విలంబితం।
మునే స్తస్య వచ శ్శ్రుత్వా వైశ్యః ప్రాహమునింనృప।
గోభూతిలహిరణ్యాదిదానానాం యత్ఫలం మునే।
నాస్తి తత్ఫలతో ముక్తిశ్శిలాదానేన కిం భవేత్॥ 54
శిలాదానం వృథామన్యే న భోజ్యా న చ భక్షణం।
నాతః కార్యమయా విప్ర శిలాదానం చ నీచవత్॥ 55

అంత నారదుడు చిఱునవ్వు మొగంబున చిందులాడ, ఓధర్మవీరుఁడా! నేను నీకొక హితవు చెప్పవచ్చితిని. కార్తీకశుద్ధద్వాదశి శ్రీహరికి మిగుల ప్రీతికరమైనది. ఆదినమున స్నానదానాదులేవి యొనర్చినను ననంతఫలమిచ్చును. నాలుగాశ్రమములందున్న వారిలో నెవరైనను, పతివ్రతయైనను, వ్యభిచారిణియైనను సూర్యుడు తులారాశియందున్నపుడు కార్తీకశుద్ధద్వాదశినాడు సాలగ్రామదాన మొనరించిన నీజన్మయందును జన్మాంతరములందును జేసిన మహాపాతకములు నశించును. అదిగాక నీ తండ్రి మహానరకబాధల నందుచున్నాడు. ఆతని నుద్ధరింప కార్తీకశుద్ధద్వా

దశినాడు సాలగ్రామదాన మొనర్చుము. అని పలుక ధర్మనిరుడు, ఓనారద మునీంద్రా! నేను గోభూహిరణ్యాది మహాదానము లనేకములు చేసి యుంటిని. వానివలన నత డుద్ధరింపబడకుండె నని రాత్రి దానము చేయుటచే నెట్లుద్ధరింపబడునో యని సందియము గలుగుచున్నది. సాలగ్రామము క్షుద్బాధను తీర్పజాలదు. బాహ్య శాంతి చేయదు. భిక్షణీయముగాదు. వృథాగా సెంపలను చేయవలెను. ధనవంతుడైన నేనట్టి దానమును చేయజాల నని ఖండితముగా పలికెను.

బహుధా బోధ్యతం వైశ్యం మునిరంతరధీయత।
న కుర్యాద్యది మాహాత్మ్యా బోధితో బ్రహ్మసూనునా
సోఽపి కాలాంతరేఽతీతే గతాయు రధన స్నృపః।
మహాద్వ్యాపచన మజ్ఞేన క్రోశ క్రమణగోపతః॥ 57
సాలగ్రామశిలాదాన మనాదృత్య మహీపతే।
తేన దోషేణ సంజాతో వ్యాఘ్రయోనౌ త్రిజన్మసు॥ 58
త్రివారం మర్కటత్వం చ పంచవారం వృషస్య చ।
దశవారం పునః స్త్రీత్వం గతభర్త్రా మహాజసా॥ 59
జన్మన్యేకాదశే రాజన్ యాచకస్య సుతాభవేత్।
తాం దృష్ట్వా విప్రశార్దూల స్సురూపాం ప్రాప్తయౌవనామ్
సమాన కులగోత్రాయ వివాహం మకరోత్పితా।
తతో జామాతరం హిత్వా సపోఢా జననీ పితా॥ 61
ఆయుర్బాంధవాస్సర్వే దుఃఖా దాకులశ్చన్ద్రియా।
యాచకోఽపి విచార్యేదం దివ్యదృష్ట్యా స్వయాకృతమ్ 62
పూర్వజన్మని రాజేంద్ర సుకృతం దుష్కృతం ద్విజ।
విజ్ఞాయాథ సర్వేభ్యో బంధుభ్యో రాజసత్తమ॥ 63
తస్యాః పాపవిశుద్ధ్యర్థం పితా తం యుక్తికారణమ్।

జన్మాంతరార్జితానేకాఘ నాశహేతుం సుఖప్రదం॥ 64
సాలగ్రామశిలాదానం కార్తిక్యామిందువాసరే।
విప్రం వేదాంతనిరతం సమభ్యర్చ్య విధానతః॥ 65
పుణ్యం పాపవినిర్ముక్తం నాదయామాస భూసురః।
పతి రుజ్జీవతి స్త్రీణాం మనుష్య భువి దంపతీ॥ 66
స్థిత్వా కాలం సమాయాతే స్వర్గం గత్వాఽనుభూయ చ।
స పునస్స్వ మహేన్ద్రోత్ర సుత స్స్వతపసోఽభవత్॥ 67

నారదుడంతట ధనేశ్వరునిని చింతించి, ఓ వైశ్యుడా! దానిని నీవు శిలమాత్రముగ భావించుచుంటివి. అది శ్రీసాలగ్రామమూర్తి. అన్ని దానములకంటెను గొప్పది. నీ తండ్రిని నరకమునుండి యుద్ధరింపదలచితివేని యీదానము చేయుట కన్న సన్మార్గము లేదని వచించి యదృశ్యుడయ్యెను. ధర్మవీరుడు నారదోపదేశమును వినియు సాలగ్రామమును శిలగనే భావించి యీదానమును చేయలేదు. కొంతకాలమున కతడును గూడ మరణించెను. నారదునంతటివాడు చెప్పినదానిని నిరాకరించి, సాలగ్రామమును శిలగా భావించి నిరాదరించి సమర్థుడయ్యును సాలగ్రామదానము చేయనందున మూడుజన్మలందు క్రూరవ్యాఘ్రమై పుట్టెను. మరి మూడు పుట్టుకలందు వానరమై పుట్టెను యయ్యెను. ఐదుజన్మలందు వృషభమ పదిపుట్టుకలు మానవస్త్రీగా జన్మించి ప్రతిజన్మయందును బాల విధవయగుచుండెను. పదునొకండవ స్త్రీ పుట్టుక యొక పేదబాపని యింట గలిగెను. ఆ పేద బాపడు తన కూతును మహావిద్వాంసుడైన యొక సద్విజున కిచ్చి పెండ్లి చేసెను. ఆమె భర్త వివాహమైన కొలదికాలమునకే మృతిజెందెను. బంధువులందరును దుఃఖసముద్రమున మునిగియుండిరి. ఆ పేదబాపడు తన కూతునకంత చిన్నవయసుననే భర్త మరణించుటకు గారణమేమని దివ్యజ్ఞానంబున నెఱింగెను. వెంటనే యామెచే నొక మహానుభావునకు సాలగ్రామదానము చేయించి, 'నాకు బాలవైధవ్యమునకు హేతువైన పాపము నశించుటకు గా' నని తత్ఫలము ధారవోయించెను. ఆనాడు కార్తీక సోమ

వారము. అంతటితో ముక్తినందిరి నారదా, శ్రద్ధతో వినుము. పిదప నాదంప
తులు జిరకాల మిహలోకమున సుఖముగా నుండి మరణించిన పిమ్మట
స్వర్గసుఖముల ననుభవించిరి. తిరిగి నేను వైశ్యజాతిని సుతపుత్రుడను వానికి
తనయుడుగా పూర్వపుణ్యవశమున జన్మాంతరజ్ఞాని నయ్యెను. అప్పటి
నుండి ప్రతిసంవత్సరము కార్తీకశుద్ధ ద్వాదశిరోజున సాలగ్రామదానము
చేయుచు ముక్తిని పొందితి నందెను.

పూర్వాభ్యాసేన పుణ్యేన తస్య జ్ఞానోదయోఽభవత్ ।
వైశ్యేన చ సుకృతం కార్తిక్యాం ద్వాదశీదినే 68
సాలగ్రామశిలాదానే నైవ ముక్తి మవాప సః।
కారవే మాత్రకస్యాపి ముక్తి రాసీ చ్చ తత్పితుః 69
తస్మా ద్రాజేంద్ర యత్నేన కార్తికే కమలాపతేః।
సాలగ్రామశిలాదానం తుష్ట్యర్థక న్నాత్ర సంశయః॥ 70
కోటిజన్మసు యత్పాపం సంచితం పాపిభిస్సదా।
తత్పాపనాశహేతు ర్వై కార్తికే హరిబోధినీ 71
సర్వపాపప్రశమనం ప్రాయశ్చిత్తం జగత్త్రయే।
సాలగ్రామశిలాదానా త్పరం నాస్తి న సంశయః 72

ఆకోమటి నారదునిమాట జ్ఞప్తికిరాగా వైశ్యజన్మమున తనకుతండ్రి యైనవాని పాపనాశనమునకు సాలగ్రామదానమును జేసెను. అతడును పిదప ముక్తినందెను. కార్తీకశుద్ధ ద్వాదశినాడు చేసిన సాలగ్రామదానమున కింత ప్రభావము కలదు. జనకమహారాజా! కోటిజన్మలందొనర్చిన పాపములు బాయుటకైనను ప్రాయశ్చిత్తము సాలగ్రామదానము తప్ప వేరొకటిలేదని వచించెను.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
పండ్రెండవ అధ్యాయము

# త్రయోదశోఽధ్యాయః

వసిష్ఠః—

అథేదానీం ప్రవక్ష్యామి ధర్మాన్ కార్తిక సంభవాన్।
ప్రశస్తాత్మా సవై భూప తథా చావశ్యకా చ్ఛృణు॥ 1
సంసారభయభీతస్య పాపధర్మో ర్మిరస్య చ।
కార్తికే మాసి యత్రోక్తం ముక్తిస్త్రా విధినాపురా॥ 2
సత్యం బ్రవీమి కర్తవ్యానో చేత్తాహ్ భవేన్నృప।
కన్యాదానం తులాస్నానం శిష్టపుత్రోపనాయనమ్॥ 3
విద్యావస్త్రాన్నదానాని ఊర్జ్జే శస్తాని భూపతే।
విత్తహీనస్య విప్రస్య సూనోశ్చాప్యుపనాయనమ్॥ 4
సదక్షిణం ససంభారం ఊర్జ్జే కృత్వా నరోఽనఘ।
తస్య పాపాని నశ్యంతి కృతాని బహుళాన్యపి॥ 5
జపేనైకేన గాయత్ర్యా ప్రత్యహం తు ఫలం శృణు।
అగమ్యాగమనాదీని హత్యాదీని సహస్రశః॥ 6
తథాఽన్యాన్యుగ్రపాపాని భస్మసాద్యాంతి భూమిప।
గాయత్రీం జప్య దేవస్య పూజా స్వాధ్యాయ తార్పణమ్॥ 7
ఏతేషామధికం పుణ్యం సుమహా వక్తుం న శక్యతే।
తటాకాయుతనిర్మాణ మశ్వత్థారోపణం శతమ్॥ 8
కోటయః కూపవాపీనాం క్రమాన్మండపపానాత్।
బ్రహ్మప్రతిష్ఠాపుణ్యస్య కలాం నార్హంతి షోడశీమ్॥ 9
మాఘ్యాం వై మాధవే మాసి చోత్తమం మౌంజిబంధనం

ఓ జనకమహారాజా! కార్తీకమాసమున నింకను ముఖ్యముగా జేయ దగిన కొన్ని ధర్మములను చెప్పెదను. ఏ మానవుడు పరపీడకుడు, పాపభీతి కలవాడును తరించుటకు చేయతగిన ధర్మములు నావలన విని యుంటిని. అట్టివాని నెరిగియుండి యన్యులకు చెప్పక పోయిన మహాపాపము కార్తీకమాసమున నదీస్నానము ముఖ్యము. అంతకంటెను ముఖ్యమైనది కన్యాదానము. దానికంటె నొక పేదవానికి, ఆచారవంతుడునగు బ్రాహ్మణకుమారున కుపనయనము జేయించుట ముఖ్యము. ఉపనయన వ్యయమంతయు భరించ శక్తిలేనప్పుడు మంత్రదక్షిణయు, కొన్ని సంభారములను నిచ్చినను ఫలముగలదు. ఉపనయనము నొకటి జేయించిన వానికి వరుసగా స్త్రీలతో సంగమించిన పాపముకంటె వేలకొలది మహాపాపములు నశించును. ఉపనయనమునకు ధనమిచ్చిన వానియొక్కయు, ధనవ్యయము నొనర్చి వేదాధ్యయనము చేయించినవానియొక్కయు పుణ్యమెంత విలువైనదని చెప్పనలవిగానిది. అక్షయతటాకములు, కోటిసూపములు, దిగుడుబావులు త్రవ్వించిన ఫలమును, నూరు రావిచెట్లను పాతించి పోషించిన ఫలమును, ఇతరులు తనవద్ద దాచుకొన్న ధనమును వానికిచ్చివేసిన ఫలమును ఉపనయనమునకు ధనదాన మొనర్చిన పుణ్యమునందు పదియారవవంతునకైన సరిపడదు.

కారయిష్యంతి తే రాజన్ దానం దద్యాత్తు కార్తికే। 10
సాధుభ్యశ్శ్రోత్రియేభ్యశ్చ బ్రాహ్మణేభ్యో యథావిధి।
తథా తేషాం సుతానాం చ బ్రహ్మచర్యానుబంధనమ్॥ 11
తేనానంతఫలం ప్రాహుర్మునయో ధర్మవిత్తమాః।
తథా తేషాం విధానం చ కార్తికే మాసి ధర్మవిత్॥ 12
కుర్యాత్తస్య ఫలం వక్తుం కశ్శక్తో దివి వా భువి।
సోఽప తీర్థానుగమనం దేవబ్రాహ్మణతర్పణమ్॥ 13
యః కర్మ కురుతే వాఽపి బ్రహ్మదాతుః ఫలం లభేత్।
మౌంజీవివాహమేకస్య యః కుర్యాన్మేదినీపతే॥ 14

దత్త్వాఽర్థం కార్తికే మాసి తదనంతఫలం స్మృతం।
కన్యాదానం తు కార్తిక్యాం యః కుర్యాద్భక్తితోఽనఘ
స్వయం పాపైర్వినిర్ముక్తః పితౄణాం బ్రహ్మణః పదం।

ధర్మవేత్తలైన మునులు కార్తీకమాసమున విప్రబాలుని యుపనయనమునకు డబ్బిత్తునని మాటయిచ్చి యాకార్యమును సాధువులైన బ్రాహ్మణబాలురకు మాఘవైశాఖమాసంబులందు చేయించినవారికిట్టి సుకృతములభించునని చెప్ప శక్యముగాదని వచించిరి. స్వర్గమందుగాని, భూమియందుగాని యెవ్వరును చెప్పజాలనిది. ఉపనయన వివాహములకు ధనమిచ్చినవాడును, వానికితోడ్పడినవాడును, బ్రాహ్మణభోజనము మొదలగు వాటికి వంట మొదలగు పనులు చేసినవాడును సమానఫలము నందుదురు. కార్తీకమాసమున నతిభక్తితో కన్యాదానము చేసినవాడును, ధనమొసంగి చేయించువాడును తాను తరించి తనపిత్రాదులనుగూడ సత్యలోకమును బొందించినవాడగును. ఇందులకు పురాతనేతిహాస మొండుగలదు.

అత్రైవోదాహరంతీమం పురావృత్తం మహీపతే॥ 16
తచ్ఛృణుష్వ బ్రవీమ్యేనం భక్త్యా మైథిల సాదరం।
ద్వాపరే బాహుజః కశ్చిద్దురాత్మా వంగదేశగః॥ 17
సోఽపి నామ్నా సువీరేతి బహుశౌర్యపరాక్రమః।
రాజ్ఞస్తస్య మహీపాల భార్యా బాలమృగేక్షణా॥ 18
సోఽపి కాలాత్తు దాయాదైర్నిర్గతో వనమావిశత్।
అర్ధాంగ్యా భార్యయా సాకం విచచార గహనే వనే॥ 19
దుఃఖేన మహతా యుక్తో నిర్ధనశ్చ మహీపతిః।
తత్ర సా గర్భిణీ తస్య భార్యా పత్యాఫలాశనా॥ 20
నిర్గమే నర్మదాతీరే పర్ణశాలాం మహీపతిః।
తతః కాలే ప్రసూతా సా కన్యకాం తత్ర సుందరీ॥ 21

సంరక్షయ త్తతోరాజా పూర్వపాప మనుస్మరన్।
వృద్ధింగతా రాజకన్యా సుకృతేన పురాకృతా॥ 22
రూపలావణ్యసంపన్నా నయనోత్సవకారిణీ।
అష్టవర్షాం మనోరమ్యాం దృష్ట్వా కశ్చిన్మునే స్సుతః॥23
వివాహార్థం మతిం చక్రే సువీరం సమయాచత।
తతోవాచ తదా సోపి దరిద్రోహం మునేస్సుతః॥ 24
ద్రవ్యం దేహి యథోద్దిష్టం ఉద్వాహం యది కాంక్షసే।
ఇతి భూపవచశ్శ్రుత్వా కన్యకాసక్తమానసః॥ 25
మునిసూనురువాచేదం రాజానం మిథిలేశ్వర।
దాస్యామి ద్రవిణం భూరి రాజన్ గేహం తపోబలాత్॥
తేన తే రాజసౌఖ్యాని భవిష్యంతి న సంశయః।
ఇతి శ్రుత్వావనే రాజా హామిత్యాహ ముదాన్వితః॥27
తప శ్చచార తత్తీరే మునిసూను రుదారధీః।
యత్రరాజన్ బలాద్ద్రివ్యం సమాకర్ష్య హ్యాతంద్రితం॥
తత్సర్వ మర్థం నృపతేః ప్రదదే మునిపుత్రకః।
గృహీత్వార్థం వసూన్ రాజా హర్షాల్లబ్ధమనోరథః॥ 29
వివాహ మకరోత్కన్యాం మునే స్తాపసజన్మనః।
స్వగృహోక్తవిధానేన కన్యా ముద్వాహాయ ద్వనే॥ 30
నవోఢాసాపి తత్పార్శ్వం జగామ మనుజేశ్వర।

ద్వాపరయుగంబునందు వంగదేశమున పరాక్రమవంతుడును క్రూరుడునైన సువీరుండను నొక రాజుండెను. ఆరాజున కతిసౌందర్యవతి యగు నర్ధాంగికలదు. అతడు శత్రువులచే నోడింపబడి భార్యతోగూడ నరణ్యము లకు బారిపోయెను. ధనమించుకైనలేక యాత డరణ్యమున మిగుల బాధల

నొందుచుండెను. నర్మదానదీతీరమున నారాజొక యాకులతో గట్టిన శాలలో కందమూలఫలాదులను దినుచు వసించుచుండెను. అట సతనిభార్య యొక బాలికను గనెను. ఆమె నతి గారాబముతో తలిదండ్రులు పెంచుచుండిరి. ఆమె కౌమారాదిసౌఖ్యంబులు లేక పోయినను శుక్లపక్షచంద్రునిమాడ్కి దినదినాభివృద్ధినందుచు సంపాలప్రాయమై పూమువాడికి కన్నులపండువు గావించుచుండెను. ఎనిమిదేండ్లవయసప్పు డొక వానప్రస్థునికుమారు డాబాలికనుజూచి యానందమంది తనకాబాలికను పెండ్లిచేయుమని రాజు నడిగెను. అందులకారాజు, ఓమునికుమారా! నే నిప్పుడు మిగుల పేదగా నుంటిని. నాకు గొంతధనమిచ్చిన నాకిల్లను నీకిచ్చి పెండ్లిగావింతుననెను. మునికుమారుడందుల కంగీకరించెను. అతనికడ యొజ్జని యేగాణిలేదు. ఆ బాలికమీద మక్కువచే ధనమెట్లయిన నార్జించి యామెను పెండ్లాడ వలెనని నర్మదానదీతీరమున ఘోరతపం బొనరించెను. ఆతపః ప్రభావమున గొంతధనము నార్జించి సువీరున కొసంగి యారాజకుమార్తెను పెండ్లాడి తనయింటికి గొనివచ్చెను. ఆమెయూ గొంతకాలమునకు జవ్వనురాలై పతితో సర్వసుఖముల ననుభవించుచుండెను.

కన్యాద్రవ్యేణ నిత్యం వై హ్యభూత్స్వోదరపోషకః। 31
పున స్సువీరభార్యా సా ప్రజజ్ఞే కన్యకాం తథా।
ద్వితీయాం తనుజాం దృష్ట్వా పునర్లబ్ధాం ముదాన్వితః 32
ఇతః పరం యథేష్టం మేద్రవ్యం భూరి భవిష్యతి।
ఏవం విచింతయానే తు పుణ్యేన మహతా నృప॥ 33
ఆజగామ యతిః కశ్చి త్స్నానార్థం నర్మదాం ప్రతి।
పర్ణశాలాంకణే భూపం సభార్య మవలోకయత్॥ 34
త మువాచ కృపాసింధు ర్యతిః కౌండిన్యగోత్రజః
కిమర్థ మత్ర కాంతారే శోభవా న్వద సాంప్రతమ్॥ 35
ఏవం బ్రువంత మాపేదం భూపాలః కరుణానిధిం।
రాజాఽహం వంగదేశీయ స్సువీర ఇతి విశ్రుతః॥ 36

రాజ్యమంతే చ దాయాద్యై ర్నిర్జితో౽స్మి వనం గతః।
న దారిద్ర్యసమం దుఃఖం న శోకః పుత్రమారణాత్ ॥ 37
నచ వ్యథానుగమ నేనవియోగః ప్రియాపహాత్।
తస్మాత్తే నైవదుఃఖేన వనవాసం కృతం మయా॥ 38
శాకమూల ఫలాద్యైశ్చకృతాహారో౽స్మి కాననే।
కాంతారేస్మిన్ తతో జాతా వర్ణాగారే తు కన్యకా॥ 39
తాంప్రాప్తయౌవనాం దృష్ట్వా కస్మైచి విప్రసుతాయ చ।
యస్మాద్భూరి ధనం విప్ర గృహీతం యన్మయానఘ॥ 40
నివసామి సుఖం త్వస్మిన్ కి మన్య చ్ఛ్రోతు మిచ్ఛసి।

సువీరు డాకూతును విక్రయించిన ధనముతో పొట్టపోసుకొనుచుండెను. ఇంతలో నారజునకు మరొకకుమార్తె పుట్టెను. అందుల కాతఁడీమెనుగూడ విక్రయించిన కొంతధనము రాగఁ బదను సంతోషముతో నుండెను. ఒక దినమున నొక సాధువు నర్మదానదికి స్నానార్థమరుదెంచి సమీపమందున్న యాసువీరుని పర్ణకుటీరమున కరిగి యాతని సుకృతవశంబున నిట్లు ప్రశంసించెను. నీవెరడవు? సుకుమారుడవయ్యు నీవీ వనవాస మేల చేయుచుంటివని యడిగెను. అంత సువీరుడు; ఓమహాత్మా! నాది వంగదేశము, నా పేరు సువీరుడు. నారాజ్యమును శత్రువులు లాగికొనిరి. దారిద్ర్యముకంటె గొప్పకష్టమేదియు లేదు. పుత్రశోకముకంటె గొప్పదుఃఖము లేదు. భార్యావియోగముకంటె గొప్పసంతాపములేదు. దారిద్ర్యపీడితుడనై వనవాస మొనర్చుచుంటిని. ఇచ్చట నా కిరువురు బాలికలు గలిగిరి. అందు మొదటిదాని నొక మునికుమారున కమ్మి పొట్టపోసికొనుచుంటినని చెప్పెను.

ఇతి భూపవచః శ్రుత్వాపున రాహ యతి స్తదా॥ 41
మాధవ త్సుఁరు షే రాజన్ మహాపాతకసంచయం।
కన్యాద్రవ్యేణ యో జీవేదసిపత్రం స గచ్ఛతి॥ 42
దేవాన్ ఋషీ న్పితౄ న్నాత్వాపి కన్యాద్రవ్యేణతర్పయేత్
శాపం దాస్యతి తే సర్వే జన్మజన్మస్యపుత్రతామ్॥ 43

యః కన్యాద్రవ్యాలుపాం గృహీత్వా వృత్తిమాశ్రయేత్
సోఽశ్నీయా త్సర్వనాపాని రౌరవం నరకం వ్రజేత్ ॥ 44
సర్వేషా మేవ పాపానాం ప్రాయశ్చిత్తం విదు ర్బుధాః।
కన్యావిక్రయశీలస్య ప్రాయశ్చిత్తం న చోదితమ్। 45
కార్తికే శుక్లపక్షే తు ద్వితీయాం కన్యకాం తవ।
కన్యాదానం కురుష్వత్వం సహిరణ్యోదకేన చ॥ 46
విజ్ఞాయ తేజోయుక్తాయ శుభశీలాయ ధర్మిణే।
కన్యాదానం తు యః కుర్యా త్కార్తిక్యాం చ శుభే దినే
గంగాదిసర్వతీర్థేషు స్నానదానేన యత్ఫలం।
అశ్వమేధాదిభిర్యాగై రుక్తదక్షిణసంయుతైః। 48

అపు డాసన్యాసి రాజా! నీవు చేసినపని మంచిదికాదు. కన్య నమ్మట పాపహేతువు. కన్యావిక్రయమున అసిపత్రవననరకము ననుభవించి తీరవలెను. ఆద్రవ్యముతో దేవముని పితృదేవతాప్రీతి కేదిచేసినను వారు శపింతురు. దాని వలన సుఖముండదు. పితృదేవతలు కన్యావిక్రయము చేసినవానికి పురుషసంతతి కలుగగూడదని శపింతురు. కన్యకను డబ్బిచ్చుకొని పెండ్లాడినవాడు జరుపుగృహస్థధర్మములు వ్యర్థములగుటయేకాక నాతడును మహానరక మనుభవించును. కన్యావిక్రయము చేసినవారికెట్టి ప్రాయశ్చిత్తము లేదని పెద్దలుగ చెప్పబడిన మహర్షులు వచించిరి. కావున వచ్చెడి కార్తీకమాసమున నీ రెండవ కుమార్తెను శక్తికొలదిగ బంగారుచే నలంకరించి సదాచారసంపన్నుడైన ధర్మబుద్ధిగలవానికి కన్యాదానము చేయుము. దానివలన గంగాస్నాన మొనరించిన ఫలమును, విధ్యుక్తముగా దక్షిణలొసంగి చేసిన యశ్వమేధయాగఫలమునులభించునని చెప్పెను.

యత్ఫలం జాయతే రాజన్ తత్ఫలం సోఽపి గచ్ఛతి।
ఇత్యేవం గదితం శ్రుత్వా రాజరాజకులేశ్వర॥ 49
యతిం ధర్మార్థతత్వజ్ఞం బాహుజః కృపణోఽబ్రవీత్।
కుతో లోకః కుతో ధర్మః కుతో దానం కుతః ఫలమ్॥50

సుఖభోగై ర్వినా విప్ర దేహేఽస్మిన్ సుఖకాంక్షిణి।
పుత్రదారాదయ స్సర్వే వాసోఽలంకరణాని చ॥ 51
గృహక్షేత్రాణి సర్వాణి దేహాద్యా ధర్మసాధనం।
ద్వితీయా మ్మే దుహితరం యో ద్రవ్యం భూరి దాస్యతి॥
తస్య దాస్యే న సందేహో విప్ర గచ్ఛ యథా సుఖం।

ఈవిధంబుగ హితబోధచేయు నాయతిశర్యునకు సువీరు డల్పబుద్ధి కలవాడు కావున, ఓ సన్యాసీ! దేహసుఖముకంటె దానధర్మము లెక్కువెట్లగును? పుణ్యలోక మెట్లెక్కువగును? భార్యాబిడ్డలతో మంచి గృహమును గట్టుకొని వాసముచేయుచు వారితో సుఖించుటకంటె నితరమైన సౌఖ్యమేలేదు. గృహక్షేత్రదేహాదులు ధర్మసాధనములు. శరీరముబాగున్ననే ధర్మమైనను జేయవచ్చును. అది లేనివా డేధర్మమును జేయజాలడు. శరీరసుఖములే గొప్పసుఖములు. అదియే యుత్తమధర్మము. నా రెండవ కూతును నెవడు నేనడిగినంతధన మొసంగునో వానికే యిచ్చి పెండ్లి గావింతును. గాని యన్యునకీయను. ఇది నామనోనిశ్చయము. కన్యాదానము చేతును. తాము తమపని చూచుకొనుడు. దయచేయుండని పలికెను ఆసన్యాసి ప్రత్యుత్తర మెట్టిదికొని యీయకుండ నర్మదానదీస్నానము గావించుకొని తన దారిని బోయెను.

తతో యయౌ నర్మదాయాం స్నానార్థం నృపపుంగవ॥
నృపస్యాప్యగతే కాలే కాంతారే మరణం గతః।
అథ యు ర్యమదూతా శ్చ పాశై రాబధ్య పాపినమ్॥
యమానుగా దక్షిణాశాం తతో జగ్ము ర్యథాగతం।
తత్రతం సమ్యగాలోక్య యమ స్తామ్రారుణేక్షణః॥ 55
నరకేషు విచిత్రేషు బహుబాధ రవినందనః।
యథాఽసిపత్రే ఘోరే చ పితృభిస్సహి పాతయేత్॥

సువీరస్యాన్వయే కశ్చిచ్ఛ్రుతకీర్తి ర్మహీపతిః।
సర్వధర్మాంశ్చ కారాసౌ తథా క్రతుశతాని చ॥ 57
ప్రచకార స్వకం రాజ్యం ధర్మేణ మిథిలేశ్వర।
శ్చాత్స్వర్గం సమాసాద్య సేవ్యమానస్సురేశ్వరైః 58
సువీరః కర్మ శేషేణ పిత్రృభి ర్నరకం గతః।
తత్రత్రివ్యచింతయద్దుఃఖా ద్యాతనా హేతు మాత్మనః॥ 59
పూర్వపుణ్య ప్రభావేన యమం ప్రాహాతినిర్భయః।
వాక్యం మే శృణు సర్వజ్ఞ ధర్మరాజ మహామతే॥ 60
పాపలేశవిహీనస్య కిమియం దుర్గతిర్మమ।
సర్వధర్మా వృథా యాంతి ప్రోక్తాః పూర్వమహర్షిభిః 61
దివం విహాయ నరకాగమనం చ న సాంప్రతం।

సువీరుడు కొంతకాలమునకు మరణించెను. వెంటనే కాలకింకరులు వానిని దీసికొనిపోయి యమలోకమున నసిపత్రవనమను నరకమున బడద్రోసి పలువిధంబులుగ బాధించిరి. సువీరునకు పూర్వీకుడైన శ్రుతకీర్తి యనురాజు ధర్మయుక్తముగ ప్రజాపాలన మొనరించి ధర్మాత్ముడై మృతినందిన పిదప స్వర్గలోకమున సర్వసౌఖ్యముల నందుచుండెను. సువీరుడు చేసిన కన్యావిక్రయ పాపము నతని వంశీకుడైన శ్రుతకీర్తికంటగట్టి యతనిని గూడ నరకమునకు దెచ్చి పలుబాధలను పెట్టుచుండిరి. ఆశ్రుతకీర్తి తనలో నాయెఱింగినంతవఱకు నన్యాయముగాని, అధర్మముగాని, అక్రమముగాని చేసియుండుగను. నాకీ నరకబాధలేల? యని యాలోచించుకొని దానిని గూర్చి యమధర్మరాజు నడుగ నిశ్చయించుకొనెను. ఒకనాడు యముడు నిండుకొలువుండగా శ్రుతకీర్తి జంకుగొంకులేక యముని సన్నిధికరిగి చేతులు జోడించి నిలబడి, ఓధర్మస్వరూపా సమవర్తీ! నీవు సర్వజ్ఞుడవు. ధర్మమూర్తివి. బుద్ధిశాలివి. ప్రాణికోటి నంతను సమభావములో జూచువాడను నే నెప్పుడు నేపాపమును జేసియుండలేదు. నావిన్నప మాలింపుడు.

పెద్దలు, మహర్షులు, మహాత్ములు వచించినదానికి వ్యతిరిక్తముగ నెప్పుడును చేయలేరు. నన్ను స్వర్గమునుండి నరలోకములోనికి గొంటుకొని వచ్చిరి. దానికేమి హేతువో తెలియజెప్ప వేడుచున్నాను.

ఇతి శ్రుత్వా యమః ప్రాహ శ్రుతకీర్తిం మహామునిమ్॥
ఆస్తి కశ్చి ద్దురాచారో వంశజశ్చ తవాద్యపై।
సోఽపినామ్నా సువీరేతి కన్యా ద్రవ్యేణ జీవితః 63
తేన పాపేన పితరః పుణ్యాలోకం గతా అపి।
దివశ్చ్యుతా భవంతీహ దుష్టయోనిషు భూతలే॥ 64
ద్వితీయా తనుజా తస్య వర్ధతే మాతృసన్నిధౌ।
పర్ణాగారే నృపశ్రేష్ఠ నర్మదాయా స్తటేవనే॥ 65
మత్ప్రసాదా ద్భువం గచ్ఛ దేహేనానేన చానఘ।
తత్ర తిష్ఠంతి మునయ స్తేషా మేత న్నివేదయ॥ 66
కన్యాంతాం శ్రుతశీలాయ కార్తికే మాసి భక్తితః।
కన్యాదానం కురుష్వత్వం సహిరణ్యోదకేన చ॥ 67
సర్వాభరణసంపన్నాం యః కన్యా కార్తికేఽనఘ।
ప్రయచ్ఛతి విధానేన సోఽపి లోకేశ్వరో భవేత్॥ 68
యది కన్యా న జాయేత మూల్యం వా యః ప్రయచ్ఛతి।
దాతు ర్గోమిధునం మాల్యం కన్యాదానం తదుచ్యతే।69
కన్యాదానఫలం తస్య భవిష్యతి న సంశయః।
కురు త్వంద్రాక్చ విప్రేభ్యః కన్యామాల్యం విధానతః।
ప్రీణంతి పితర స్సర్వే ధర్మేణానేన సంతతం।

అంత యముడు శ్రుతకీర్తిని జూచి, ఓ శ్రుతకీర్తీ! నీవు ధర్మజ్ఞుడవు, న్యాయమూర్తివియైనమాట నిక్కువమే. కాని నీవంశమునబుట్టిన సువీరుడను రాజు దురాచారుడై కన్యావిక్రయము చేసి నాధనముతో పొట్టపోసి

తత స్స్వర్గగతో రాజా శ్రుతకీర్తి ర్వ్యధాగలం।
యస్తు స్నాత్వా కార్తికే మాసి కన్యాదానం కరిష్యతి॥ 76
హత్యాదిపాతకై స్సర్వై ర్విముక్తో నాత్ర సంశయః।
వాణ్యా వా సులభం యోఽపి వివాహార్థం సర్వేశ్వర॥ 77
సహాయం యే ప్రకుర్వంతి తేషాం పుణ్య మనంతకం।
యః కార్తిక్యా వ్రతే నిష్ఠో విధినా తత్సమాచరేత్॥ 78
స యాతి విష్ణుసాయుజ్యం సత్యం సత్యం మయోదితం।
నాచరేద్యది వా మూఢో రౌరవం తు సమశ్నుతే॥ 79

శ్రుతకీర్తి సంయమునికడ సెలవంది మానవశరీరముతో నర్మదానదీ తీరమునకేగి సువీరునిభార్యను, కూతురునుజూచి సంతసించి యామెతో నాలోచించి కార్తీకమాసమున సువీరునిపుత్రికను సాలంకృత కన్యాదాన పూర్వకముగ శ్రుతశీలసంపన్నుడగు మునికుమారునకిచ్చి వివాహము చేసెను. ఆకన్యాదానమువలన సువీరుడుకూడ పాపవిముక్తుడై స్వర్గలోకమున సుఖియైయుండెను. శ్రుతకీర్తియు నాసువీరుని పుత్రికను వివాహము వేళ మఱి పదమంది బ్రాహ్మణులకు తనద్రవ్యముతో వివాహములను జేయించెను ఆప్రభావమువలన శ్రుతకీర్తి మొదలగు సువీరుని పితరులందఱును పుణ్య లోకముల నొందిరి. కన్యాదానమువలన మహాపాతకములుగూడ నాశన మగును. పెండ్లివిషయమున వాక్పూర్వమగు నుపకారము చేసినను పుణ్యాత్ముడగును. కార్తీకమాసమున కన్యాదానం చేయవలెనని దీక్షబూని కృతార్థతనందినవాడు విష్ణుసాన్నిధ్యము నొందును. శక్తిగలిగి యుండియు నుపేక్షవహించినవాడు శాశ్వతముగ రౌరవాదినరకము నందును.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
పదమూడవ అధ్యాయము

# చతుర్దశో౽ధ్యాయః

వసిష్ఠః—

పౌర్ణమాస్యాం కార్తికే మాసి వృషోత్సర్గం కరోతి యః।
తస్య పాపాని నశ్యంతి జన్మాంతరకృతాని చ॥ 1
యః కార్తికే వృషోత్సర్గం పౌర్ణమాస్యాం పితృతుష్టయే।
సంకుర్యాద్విధినా రాజన్ తస్య పుణ్యఫలం శృణు॥ 2
గయాశ్రాద్ధం కృతం తేన కోటివారం న సంశయః।
పుణ్యదం మానుషే లోకే దుర్లభం కార్తికవ్రతమ్॥ 3
యః కో వా౽స్మత్కులే జాతః పౌర్ణమాస్యాం తు కార్తికే।
ఉత్సృజేద్వృషభం నీలం తేన తృప్తా వయం త్వితి॥ 4
కాంక్షంతి నృపశార్దూల పుణ్యలోకస్థితా అపి।
పౌర్ణమాస్యాం కార్తికే మాసి అశక్త్యా వా౽వ్యథమోపి వా।
నోత్సృజేద్వృషభం లోభాత్స యాత్యంధం తమో యమాత్।
పిండదానాద్గయాశ్రాద్ధాత్పవిత్రాత్ ప్రతివత్సరం। 6
పుణ్యతీర్థానుగమనాత్తర్పణాచ్చ మహాలయాత్।
కార్తికే పౌర్ణమాస్యాం తు వృషోత్సర్గం వినా గతిః 7
గయాశ్రాద్ధం వృషోత్సర్గం సమమాహుర్మనీషిణః।
ప్రశస్త ఊర్జే పౌర్ణమాస్యాం వృషోత్సర్గః సుఖప్రదః॥ 8
యః కుర్యాత్కార్తికే మాసి సర్వధర్మాధికం ఫలమ్।
ఋణత్రయాద్విముచ్యేత కిమన్యైర్బహుభాషణైః॥ 9

మరల వసిష్ఠమహాముని, ఓ మిథిలేశా! కార్తీకపూర్ణిమనాడు వృషోత్సర్జనోత్సవము చేయుటవలన వెనుకటి జన్మలయందార్జించిన పాపములన్నియు పటాపంచలగును. ఆనాడాబోతు నచ్చుబోసిన వారికి కోటిమారులు గయాశ్రాద్ధ మొనరించినందువలన గలుగునంతటి ఫలమబ్బును. వృషోత్సర్జనము కార్తీకమాసముల చేయునవకాశము పుణ్యాత్ములకే లభించును. ప్రతి మనుజుని పితరులును తన వంశమునబుట్టినవాడెవడైన కార్తీకమాసమున నాబోతు నచ్చుపోసి విడచునాయని కోరుచు నెదురుచూచుచుందురు. ధనమున్నను, లేకపోయినను లోభత్వముచే నెవడు కార్తీకమాసమున వృషోత్సర్జనము చేయడో వాడు యమలోకమున నంధతామిస్రనరకబాధల నందును. జ్ఞానులైన పెద్దలీమాసమున నొనర్చిన వృషోత్సర్జన ఫలము పితృదేవతలకు గయలో పిండము వేయుట కంటెను, తీర్థయాత్రలను సేవించుటకంటెను, ఏటేట తద్దినము పెట్టుటకంటెను, మహాలయశ్రాద్ధముకంటెను ప్రీతికరమని వచించుదురు. ఈమాసమున నాబోతు నచ్చుబోసినవాడు ఋణత్రయమునుండి విముక్తుడగును.

యోధాత్రీఫలదానం తు పౌర్ణమాస్యాం చ సదక్షిణం।
కురుతే నృప శార్దూల సార్వభౌమో భవేద్ధ్రువమ్॥ 10
యః కుర్యాద్దీపదానం చ పౌర్ణమాస్యాం తు కార్తికేనఘ।
సర్వపాపవినిర్ముక్త స్తతో యాతి పరాం గతిమ్॥ 11
కర్మణా మనసా వాచా పాపం య స్సమ్యగాచరేత్।
తస్య పాపాని నశ్యంతి పౌర్ణమాస్యాం దీపదానతః॥ 12
లింగదానం పౌర్ణమాస్యాం కార్తిక్యాం శివతుష్టయే।
ఇహ సమ్యక్ఫలం ప్రాప్య సార్వభౌమో భవేద్ధ్రువమ్॥
పాపఘ్నం పుణ్యదం ప్రాహుర్లింగదానం మనీషిణః।
లింగదాన మనాదృత్య యః కుర్యాత్కార్తికవ్రతమ్॥ 14
వజ్రలేపో భవే త్తస్య పాపరాశిర్న సంశయః।
అనంతఫలదం ప్రోక్తం దుర్లభం కార్తికవ్రతమ్॥ 15

మఱియు కార్తికపూర్ణిమనాఁడు దుప్పటితో గలసి దక్షిణతోఁ గూడ దానముజేసినవారు జన్మాంతరమున సార్వభౌముఁడగును. శివకేశవులసన్నిధి నానాఁడు దీపముంచినవారు సర్వవిధంబులగు పాతకములనుండి విముక్త బడును. ఆదినమున శివనాథసన్నిధి సాలగ్రామదాన మొనరించినవాఁడీ జన్మమందు సకల సౌఖ్యంబులనంది రాబోవుజన్మమున చక్రవర్తియై జనించును. కార్తికవ్రతమును జేయుచుండినవారు శివనాథలింగదానముచేసి తీరవలయును. అది లభించుటతిదుర్లభము. లభించెనేని యనంతపుణ్యఫలమబ్బును. రాయిదాని యనాదరణజేసిన వానిపాపము జన్మజన్మమునను బాధించుచునే యుండును. వానికి ముక్తియనునది యుండదు.

పరాన్నం పితృశేషం చ నిషిద్ధస్య చ రక్షణం।
శ్రాద్ధాన్నం తిలదానం చ కార్తికే పంచ వర్జయేత్॥ 16
గణాన్నం వృషలస్యాన్నం దేవలాన్న మసంస్కృతం।
వ్రాత్యాన్నం విధవాన్నం చ కార్తికే షడ్వివర్జయేత్॥
అమాయాం పౌర్ణమాస్యాం చ ప్రత్యబ్దే భానువారకే।
సోమసూర్యోపరాగే చ వర్జయేన నిశి భోజనం॥ 18
ఏకాదశ్యా మహోరాత్రం వ్యతీపాతే చ వైధృతౌ।
నిషిద్ధదివసే రాజన్ గృహీ యః కార్తికవ్రతీ॥ 19
విష్ణోర్దినస్య యత్నేన పూర్వోత్తరదినద్వయే।
మాసచక్రవ్రతాధీనో న కుర్యాన్నిశి భోజనం॥ 20
నిషిద్ధదివసే ప్రోక్తం ఛాయానక్తం మహర్షిభిః
నక్తవ్రతఫలం తేన న నక్తం నిశి భోజనమ్॥ 21
సర్వపుణ్యప్రదే రాజన్ కార్తికే మాసి యః పుమాన్।
నిషిద్ధదివసే చాన్నం భోజనం కురుతే యది॥ 22
తస్యపాపస్య విస్తారం కథం తే ప్రబ్రవీమ్యహం।
తస్మాద్విచార్యయత్నేన కార్తికవ్రత మాచరేత్॥ 23

తైలాభ్యంగం దివాస్వాపం తథాప్యై కాంస్యభోజనం।
హుతాన్నిద్రాం గృహేస్నానం నిషిద్ధే నిశిభోజనమ్॥ 24
వేదశాస్త్రవినిందాం చ కార్తికే సప్తవర్జయేత్।
ఉష్ణోదకే న కర్తవ్యం స్నానం యత్రైవ కార్తికే॥ 25
స్నానం తత్సురయా ప్రోక్తం నిశ్చితం బ్రహ్మణాపురా
పటుర్భూత్వా గృహే స్నానం యః కుర్యాదుష్ణవారిణా
నదీస్నానం తు కర్తవ్యం తులాసంస్థే దివాకరే।
కార్తికే మాసి రాజేంద్ర ఉత్తమం తం ప్రచక్షతే॥ 27
తటాకకూతకుల్యానాం జలే వా స్నానమాచరేత్।
వినా గంగాం వినా గోదాం వినా తద్వత్సరిద్వరామ్॥ 28
తటాకకూప కుల్యానాం సుగంగా మభివాదయేత్।
సంప్రాప్య కార్తికం మాసం స్నానం యో న సమాచరేత్
స గచ్ఛేన్నరకం ఘోరం చండాలీం యోనిమాప్నుయాత్।
గంగాదిసర్వనద్యశ్చ స్మృత్వా స్నానం సమాచరేత్॥31
తతోఽభివాదనం కుర్యాత్సూర్యమండలగం హరిం।
కృత్వా విష్ణుకథాం దివ్యాం విప్రైస్సార్థం గృహంవ్రజేత్
దినాంతే సర్వకర్మాణి సమాప్య విధినా నృప।
పాదౌ ప్రక్షాళ్య చాచమ్య పూజాస్థానం ప్రవేశయేత్
పూజయేదీశ్వరం తత్ర షోడశై రుపచారకైః।

ఈమాసమునందు పరాన్నభక్షణము, పితృశేషము తినుట మానవలెను. శ్రాద్ధాన్నమును, ఉల్లిపాయ మొదలగు నిషిద్ధవస్తువులను భుజింప

రాదు. తిలదానమును పట్టరాదు, శివార్పిత, గణ, శూద్రాన్నములను, సంధ్యావందనాది నిత్యకర్మలను చేయనివాని యన్నమును, విధవాన్నమును తినకూడదు. అమావాస పూర్ణిమలందును, పితృదినంబులందును, భానువాసరమున సూర్యచంద్ర గ్రహణములు పట్టిన నాడును, కార్తీకమాసము నెల దినములును రాత్రిభోజనము కూడదు. ఏకాదశి నాడంతయును భుజింపగూడదు. వ్యతీపాత వైధృతి యోగములందును, నిషిద్ధదినములందును రాత్రి భుజింపరాదు. కార్తీకమాస మంతయును నదీస్నాన మొనరింప దీక్షబట్టిన వాడు రాత్రిభోజనమును మానవలెను. ఏకాదశీవ్రతము చేయువాడు దశమి ద్వాదశి రెండు రాత్రులును భోజనము చేయకూడదు. అట్లు చేసినవాని పాపమిట్టిదని వచింప శక్యముగాదు. కార్తీకమాసమున తైలస్నానము చేయరాదు. పగటియందు నిద్రించుట, కంచుపాత్రలో భుజించుట, ఇంటిలో స్నానముచేయుట కూడదు. వేదశాస్త్రములను నిందింపరాదు. ఆరోగ్యవంతుడైయుండి వేడినీళ్ళతో స్నానము చేయరాదు. ఆనీరు కల్లుతో సమానమని బ్రహ్మదేవుడు చెప్పెను. కార్తీకమాసమున నదీస్నానమే ప్రధానము. అనారోగ్యవంతులు ఉష్ణోదకస్నానము చేయవచ్చును. పుణ్యనదులు సమీపమందున్నవారు వాపీకూపతటాకాదులలో మునుగరాదు. సమీపమందు లేనివారు వాపీకూపతటాకాదులలో స్నానము చేయవచ్చును. అట్లు చేయునప్పుడు గంగా గోదావర్యాదినదులను స్మరించి, నమస్కరించి స్నానము చేయవలెను. శక్తిగలిగియుండియు నదీస్నానము చేయనివారనంతనరకబాధల నందుదురు. ఏనది తనకు సమీపముందున్న నానదిలో స్నానముచేయవలెను. అట్లు చేయనివాడు చండాలుడై జన్మించును. ఈ మాసమునందు నదీస్నానము చేయువారు గంగాగోదావర్యాదినదులను స్మరింప నక్కరలేదు. వాపీకూపతటాకాదులందు చేయువారు "గంగేచ యమునే కృష్ణే గోదావరి సరస్వతి, నర్మదే సింధుకావేర్యౌ జలేస్మిన్ సన్నిధింకురు." అని పఠించవలెను.

పీఠస్థం పూజయేచ్ఛంభుం కల్పోక్తవిధినా ఽనఘ। ౩౩
పంచామృతవిధానేన ఫలతోయైః కుశోదకైః।
స్నాపయేత్పుణ్యసూక్తైశ్చ భక్త్యా గౌరీపతిం ప్రభుమ్ ౩౪
తతస్త్వావాహనోద్దేశం శంకరం పరమేశ్వరం।

వృషధ్వజాయ స్నానం చ పాద్యం గౌరీప్రియాయ చ॥ 35
అర్ఘ్యం లోకేశ్వరా యేతి రుద్రాయాచమనీయకం।
స్నానం గంగాధరా యేతి వస్త్రం మాశాంబరాయ చ
జగన్నాథాయోపవీతం గంధం కాపాలధారిణే।
అక్షతా నీశ్వరాయేతి పుష్పం పూర్ణగుణాత్మనే॥ 37
ధూపం మూడాయేతి నైవేద్యం తేజోరూపాయ దీపకమ్।
లోకరక్షాయ నైవేద్యం తాంబూలం లోకసాక్షిణే॥ 38
ప్రదక్షిణాం భవా యేతి నమస్కారం కపాలినే।
ఏతైర్నామభిర్భక్త్యా పూజయే ద్గిరిజాపతిమ్॥ 30

అట్లు చెప్పుచు స్నానముచేసి యచ్చటనే పురాణము చదువుటగాని వినుటగానిచేసి గృహమునకేగవలయును. కార్తికవ్రతము చేయువారు పగలంతయు పురాణపఠన శ్రవణాదులవలనను, హరికథా కాలక్షేపము వలనను గడపి సాయంకాలమున సంధ్యావందనాది కృత్యములను ముగించి పూజామందిరమున నున్న శివుని కల్పోక్తప్రకారముగ షోడశోపచారములచే నర్చింపవలయును.

| | |
|---|---|
| శివాయనమః | ధ్యానం సమర్పయామి |
| పరమేశ్వరాయనమః | ఆవాహనం సమర్పయామి |
| కైలాసవాసాయనమః | రత్నసింహాసనం సమర్పయామి |
| గౌరీప్రియాయనమః | పాద్యం సమర్పయామి |
| లోకేశ్వరాయనమః | అర్ఘ్యం సమర్పయామి |
| వృషధ్వజాయనమః | * స్నానం సమర్పయామి |
| జగంబరాయనమః | వస్త్రం సమర్పయామి |
| జగన్నాథాయనమః | యజ్ఞోపవీతం సమర్పయామి |

* స్నానము చేయించునపుడు పురుషసూక్తముగాని, నమకచమకములుగాని పఠించుచు పంచామృతములుగాని, నారికేళోదకముగాని యుపయోగింపవలెను.

కపాలధారిణేనమః గంధం సమర్పయామి
మహేశ్వరాయనమః అక్షతాన్ సమర్పయామి
పరిపూర్ణగుణాయనమః పుష్పం సమర్పయామి
ధూమ్రాక్షాయనమః ధూపమాఘ్రాపయామి
తేజోరూపాయనమః దీపసందర్శయామి
లోకరక్షాయనమః నైవేద్యం సమర్పయామి
లోకసాక్షిణేనమః తాంబూలం సమర్పయామి
త్రిలోచనాయనమః కర్పూరనీరాజనం సమర్పయామి
శంకరాయనమః సువర్ణమంత్రపుష్పం సమర్పయామి
భవాయనమః ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి

శంభోర్నామసహస్రేణ మాస మేకం నిరంతరం।
పూజాంతే చార్పయే దర్ఘ్యం మాసనక్తవ్రతే నృప॥ 40
పార్వతీకాంత దేవేశ పద్మజార్చ్యాంఘ్రిపంకజ।
అర్ఘ్యం గృహాణ దైత్యారే దత్తం చేద ముమాపతే।41
అర్చయే చ్ఛంకరం భక్త్యాయ స్స ధన్యో న సంశయః।
తథా విత్తానుసారేణ దీపమాలార్పణం నృప॥ 42
దత్వా దానం తు విప్రేభ్యో పిత్తశాఠ్యం న కారయేత్
ఏవం విప్రవరై స్సార్ధం నక్తం యః కార్తికవ్రతీ॥ 43
కురుతే నృపశార్దూల తస్య పుణ్యఫలం శృణు।
అగ్నిష్టోమ సహస్రాణి వాజపేయశతాని చ॥ 44
అశ్వమేధసహస్రాణాం ఫలం ప్రాప్నో త్యసంశయః।
మాసనక్తం చ యః కుర్యా దిత్యేనం విధినాఽనఘ॥ 45
పాపమూలోద్ఘాటనం చ త మాహుర్నారదాదయః।
మాసనక్తం మహాత్పుణ్యం సర్వపాపనిషేదనమ్॥ 46

సర్వపుణ్య ప్రదం నృణాం కార్తికే నాత్రసంశయః।
యః కార్తికేతుర్దశ్యాం పితౄ నుద్దిశ్య భుక్తితః॥ 47
బ్రాహ్మణం భోజయే దేకం ప్రీణంతి పితరోఽఖిలాః।
యః కార్తికే సితే పక్షే చతుర్దశ్యాం సరేశ్వరః 48
ఔరసః పితృభక్తో యః తిలైస్సంతర్పయే జ్జలే।
ప్రీణంతి పితర స్సర్వే పితృలోకం గతా అపి 49
యః కుర్యా త్ఫలదానం తు చతుర్దశ్యాం తు కార్తికే।
న తస్య సంతతే ర్హాని ర్జాయతే నాత్రసంశయః॥ 50
యః కుర్యా త్తిలదానం తు చతుర్దశ్యాం తు కార్తికే।
ఉపోష్య శంకరం పూజ్య సకైలాసేశ్వరో భవేత్॥ 51
సర్వపాపప్రశమనం పుణ్యదం కార్తికవ్రతం।
యః కుర్యాత్సోఽపి పాపేభ్యో విముక్తోఽమృతమశ్నుతే
ఇదం పవిత్రం పరమ మధ్యాయం యః శృణోత్యతః।
ప్రాయశ్చిత్తం పరం ప్రాహుః పాపానాం నాత్ర సంశయః
న కరోతీవ కార్తిక్యాం వ్రతం యో మనుజాధమః।
సర్వయోనిం సమాసాద్య శతవారం తథాఽనఘ।
పశ్చా జ్జంబుకయోనౌ తు ద్విశతం జన్మకుత్సితమ్॥ 54
త్రిశతం చ వరాహేతు శ్వానయోనౌ చతుశ్శతం।
తథాపంచశతం జన్మ మార్జాలేషు పునఃపునః 55
షట్ఛతం త్వాఖుయోనౌ తు సంజాత స్థితవాన్ భవేత్।
ప్రారబ్ధపుణ్యం తే వక్ష్యే సాంప్రతం శృణు సాదరమ్॥ 56

మనుష్యస్య పురా పంచ దశజన్మని సూరతేః।
కార్తిక వ్రతశీలస్య జాయతే దర్శనం సుభమ్॥ 57
తేన పుణ్యప్రభావేన ఆత్మార్థం వర్తి సంగ్రహాః।
జ్వాలావర్తిస్తదైకేన సంయోగస్సముజాయత॥ 58
ద్వాదశ్యాం కార్తికేమాసి ఉచ్చై రుజ్జ్వలయోత్తతా।
అస్మిన్ దేవగృహే విష్ణో రగ్రతః పుణ్యయోగతః॥ 59
అంజసా తు తనుం హిత్వా తతో దివ్యవపుర్భవేత్।
ఇతీదం కథితం సర్వం కూర్పార్యజన్మని చేష్టితమ్॥ 60
అశక్తః కార్తికే మాసి ద్వాదశ్యాం యో ముదాన్వితః
స గచ్ఛే ద్వైష్ణవంధామ పరదీపప్రబోధనాత్। 61

అని యీరీతిగా పూజించి సహస్రనామార్చన గూడ చేయవల యును. నెలదినములిట్లు పూజించి పూజానంతరము తిరిగి పశుపతినిగూర్చి, "ఓ దేవేశా! చంద్రశేఖరా! ప్రమథాధిపా! నా యిచ్చు నర్ఘ్యమును గ్రహింపుము." అని అర్ఘ్యము నీయవలయును. శివసన్నిధిని దీపమాలిక అను యథాశక్తిగ నుంచవలెను. ఇట్లు శివపూజ చేసినవాడు ధన్యుడగును. శివపూజానంతరము శక్తినిబట్టి బ్రాహ్మణులకు సమారాధన చేసి దక్షిణ తాంబూలము లీయవలెను. ఇట్లు చేసినవారికి నూరు వాజపేయ యాగము లను, వేయి యజ్ఞములను, వేయి అశ్వమేధయాగములను జేసిన ఫలితము సిద్ధించును. నారదాది మహాముని లీరీతిని కార్తిక నక్తములు చేసినవారి పాతకములు మొదలంట నశించునని చెప్పిరి. కార్తీకనక్తవ్రతము మహా ఫలప్రదము. నిఖిలపాపహరము. ఈమాసమునందు శుద్ధ చతుర్దశి దినమున పితృదేవతల నుద్దేశించి యొక సద్బ్రాహ్మణుని భోజనముచే తృప్తిపఱచిన పితృలోకమందున్న వాని పితృదేవతలందఱు తృప్తులగుదురు. మహాభక్తితో నదీతీరమున కరిగి తజ్జలమునందు తిలతర్పణ మొనరించినను సంతసింతురు. ఈదినమున ఫలదానము చేసినవారికి సంతాన నష్టముండదు. శివుని పూజించి తిలదానముచేసిన శివసాయుజ్యము దొరకును. ఈ వ్రతమును

చేయువారును, వ్రతఫలమును దెలుపు నీ మహాత్మ్యమును చదివినవారును పుణ్యాత్ము లగుదురు. నిఖిల పాపములకును నిదే ప్రాయశ్చిత్తము. శక్తి కలిగియుండియు నీవ్రతమును జేయనివాడు నూరు పుట్టుకలు నానాయోను లందు జన్మించి, పిదప రెండువందల జన్మములు నక్కయై పుట్టి, అనంత రము మూడువందల జన్మలు పందిగను, నాలుగువందల జన్మలు కుక్కగను అయిదు వందల జన్మలు పిల్లిగను, ఆఱు వందల జన్మలు మూషికముగను పుట్టును. ఈ వ్రతమును శాస్త్రోక్తముగ చేసినవారికి పోయిన పదునేడు జన్మలయొక్క పూర్వజ్ఞానమును కలుగును. ఆ జ్ఞానము కలిగినపిమ్మట కార్తీక శుద్ధ ద్వాదశినాడు శివకేశవులలో నేదేవుని సన్నిధినైన దీపమా లికల నుంచినవానికి మోక్షము కరతలామలకము. దీప ముంచుటకు శక్తి లేనిచో నితరు లుంచిన దీపములను ప్రజ్వలింపజేసినను వైకుంఠవాసము లభించునని చెప్పెను.

ఏవం మునే ర్వచశ్శ్రుత్వా పరిక్రమ్య ప్రణమ్య చ।
ఆజ్ఞాపితో యయౌ శీఘ్రం నదీం పాపప్రణాశినీమ్॥ 62
త్రయోదశ్యాం చతుర్దశ్యాం పౌర్ణమాస్యాం దినత్రయే।
స్నాత్వా తత్ర సరస్వత్యాం కార్తికేమాసి భూపతే॥ 63
తత్ర తేనైవ పుణ్యేన జ్ఞానసిద్ధి మవాప్య చ।
ప్రతివర్షం చకారాసౌ ధర్మ్యం కార్తికసంభవమ్॥ 64
తేన పుణ్యప్రభావేన విష్ణుసాయుజ్య మాప్నుయాత్।
తస్మా ద్యః కార్తికేమాసి సితేపక్షే నరేశ్వర॥ 65
ద్వాదశ్యాంయే ప్రకుర్వంతి స్నానదానాదితర్పణం।
దీపమాలార్పణం పూజాం యః కుర్యా త్స హరిప్రియః॥
సర్వపాపవినిర్ముక్తః పశ్చా న్నిర్వాణ మృచ్ఛతి

ఇట్లు శివకు కార్తీకవ్రత విధానమును, తత్ఫలమును నుపదేశించిన వశిష్ఠమహర్షికి జనక మహారాజు ప్రదక్షిణ పూర్వకనమస్కార మొనరించి

సరస్వతీనది కేగి కార్తీక శుద్ధ త్రయోదశీ చతుర్దశీ పూర్ణిమలందు మూడు స్నానములు జేసి యాపుణ్యమువలన జ్ఞానసిద్ధిగలవాడై యేటేట నీవ్రతము చేసి విష్ణుసాయుజ్యము నందెను.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
పదునాలుగవ అధ్యాయము

---

# పంచదశోఽధ్యాయః

వసిష్ఠః—

రాజన్ కార్తికమాహాత్మ్యం పవిత్రం పాపనాశనం।
సర్వపుణ్యప్రదం భూయో వక్ష్యామి శృణు భక్తితః॥ 1
కార్తికే విష్ణువేఽగ్రేతు యః కుర్యాన్నర్తనం నరః।
పాపాని వినిహంత్యాశు స విష్ణోరాలయే వసేత్॥ 2
దీపమాలార్పణం విష్ణోః ద్వాదశ్యాం కార్తికస్యచ।
యః కుర్యాత్సోఽపి వైకుంఠం ప్రాప్య తత్ర ప్రమోదతే॥
కార్తిక్యాం చ సితేపక్షే సాయాహ్నే కేశవార్చనం।
యః కరిష్యతిరాజేంద్ర సహస్రాగ్రాధిపో భవేత్॥ 4
యః కుర్యాన్నిత్యయాత్రాం చ కార్తికే విష్ణుమందిరే।
పదేపదేఽశ్వమేధస్య ఫలం ప్రాప్నోత్యసంశయః॥ 5
విష్ణోరాయతనం ప్రాప్య విష్ణుం యశ్చావలోకయేత్।
స వైకుంఠపురం గత్వా విష్ణుసాలోక్య మేష్యతి॥ 6
కార్తిక్యాం విష్ణుభవనం యో న గచ్ఛేన్నరాధమః
స గచ్ఛేద్రౌరవం ఘోరం కాలసూత్రం భయంకరమ్॥ 7

కార్తిక్యాం చ సితే పక్షే ద్వాదశీ హరిబోధినీ।
తస్యాం యద్యత్కృతం కర్మ అక్షయం జాయతే నృణామ్
భక్త్యా యః కార్తికే మాసి అర్చయేదచ్యుతం నరః।
గంధపుష్పాక్షతైస్సమ్యగ్ధూపదీపైర్మనోహరైః॥ 9
భక్ష్యాద్యైశ్చ నైవేద్యైః ద్వాదశ్యాం కార్తికస్య చ
యః కరోతి మహీపాల ద్విజైస్సార్ధమతంద్రితః॥ 10
తస్య పుణ్యస్య విస్తారం న జానామి కథంచన।
ద్వాదశ్యాం కార్తికే మాసి విష్ణోర్వా శంకరస్య వా॥
యః కుర్యాద్దీపలక్షం తు యథా విత్తానుసారతః।
సర్వపాపవినిర్ముక్తో విమానమధిరుహ్య చ॥ 12
సంసూయమాన స్త్రిదశైః విష్ణులోకం స గచ్ఛతి।
దీపార్పణే హ్యశక్తశ్చేత్ మాసమేకం నిరంతరమ్॥
దినత్రయేషు వా కార్యం కార్తికే రాజసత్తమ।
ద్వాదశ్యాం పౌర్ణమాస్యాం చ చతుర్దశ్యాం మహామతే॥
యో దీనమర్పయేద్భక్త్యా రాజన్గోదోహనావధి।
తతస్తేనైవ పుణ్యేన పూతో భవతి నిశ్చితమ్॥ 15
కార్తిక్యామథవా రాజనే పరదీపప్రబోధనం।
భక్త్యాయః కురుతే విష్ణోః సోఽపి పాపాద్విముచ్యతే॥ 16
నశ్యమానం తు యో దీపం కార్తికే యత్ప్రబోధనం।
దారుణాన్యాని పాపాని తస్య నశ్యంతి తత్క్షణాత్॥
అత్రేతిహాసం వక్ష్యామి పుణ్యదం కల్మషాపహం।

ఓ జనకమహారాజా! ఈ కార్తీక మాహాత్మ్య మెంత వచించినను సాంతముకాదు. ఇంకను కొన్ని విషయంబులను దెల్పెద నాలింపుము. ఈ మాసమున దేవాలయమందు హరికీర్తన లాలాపించుచు నాట్య మొనర్చినవాడును, శివకేశవు సన్నిధానమున దీపమాలికల నుంచినవాడును, నెలదినములు శివకేశవులను దర్శించి స్తుతించినవాడును, విష్ణులోకమునకు బోవుదురు. ఈ మాసములో సాయంకాలమున దేవదర్శనము చేయనివాడు కాలసూత్రం బనెడి నరకమున బడి క్రుస్సును. కార్తీక శుద్ధ ద్వాదశి హరిప్రబోధిని యగుట నా నాడెంత పుణ్యము చేసినను నది అక్షయ మగును. ఈదినమున శ్రీహరిని గంధపుష్పాక్షత దీపధూపనైవేద్యాదులతో సేవించి యొక విప్రున కన్నమిడిన వానిఫల మింతయని చెప్ప నే నశక్తుడను. ఈ నెలదినములు విడువక హరిహరుల సన్నిధిని దీపము నుంచినవాడు దేవదుందుభులు మ్రోయ విమానమెక్కి వైకుంఠమునకు బోవును. నెల దినములు నుంచ శక్తిలేనిచో శుద్ధ త్రయోదశి చతుర్దశి, పూర్ణిమదివసంబులు మూడింటియందును నుంచవలెను. ఈ మాసములో హరిహరుల సన్నిధిని, ఆవును పాలు పితుకునంతకాలము దీపముంచినను పవిత్రు డగును. దీపము నుంచ శక్తిలేనిచో పరులుంచిన దీపమును ప్రజ్వరిల్ల చేసినను, ఆరిపోవుదాని నుద్ధరించినను వానిపాపము లన్నియు నశించును. దీనినిగూర్చి యొక పురాతనేతిహాసము గలదు. దానిని చెప్పెదను. సావధానచిత్తుడవై యాలింపుమని యిట్లు చెప్పనారంభించెను.

పురా సరస్వతీ తీరే రమ్యే ద్రుమలతాయుతే॥ 18
విష్ణోర్జీర్ణాలయం తత్ర ఆసీ దాకల్పకావధి।
ఆజగామ యతిః కశ్చిత్ స్నానార్థం కార్తికే శుభే॥ 19
తత్ర స్నాత్వా చ తత్తీరే విష్ణో రాయతనం యయౌ।
స నామ్నా కర్మనిష్ఠేతి సర్వభూతదయాపరః॥ 20
తత్రైకాంతస్థలే యోగే తపః కర్తుం మనో దధే।
సమ్యక్సమ్మార్జ్య యోగీశః విష్ణో రాయతనం తదా॥21
తతో విదూరం గ్రామం తు గత్వా తైలం సమానయత్
దీపపాత్రం తథా వర్తిం స కుర్యా ద్ధరిమందిరే॥ 22

దీపద్వాదశకం రాజన్ అర్పయేద్భక్తితోఽనఘం।
సమాదిష్టో బభూవాసౌ మునిస్తత్ర మహామతి॥ 23
తేనేత్థం క్రియమాణే తు కార్తికే మాసి భూమిప।
కార్తిక్యాం చ సితేపక్షే సాయాహ్నే ద్వాదశీదినే॥ 24
ఆగత్య విచచారాశు ఆత్మపోషణలంపటః।
విష్ణుం ప్రదక్షిణీకృత్య శనైర్దీపాన్ సమాగమత్॥ 25
రక్తపాత్రం సమాలోక్య కేవలం వర్తిసంయుతం।
తతస్తత్రైక పాత్రస్థం వర్తిం సజ్వలితం నృప॥ 26
దృష్ట్వా చ తత్తథాచాన్యపాత్రస్థం పృథివీపతే।
వర్తిముజ్జ్వలితాం దృష్ట్వా చఖాదాఖుర్హరేర్గృహే॥27
సజ్వాలా ప్రథమా వర్తి ర్ద్వితీయేన నియోజితా।
జ్వాలాఘాతే కృతే శీఘ్రముజ్జ్వాలా చ నరాధిప॥ 28
తజ్జ్వాలయోష్ణనైవేద్యం నిశశాక వ్యసర్జయత్॥ 29
వర్తిః ప్రజ్వలితస్తత్ర విష్ణోరగ్రేతు కార్తికే।
తత్ర కాలే సమాయాతే మూషకస్తు హరేర్గృహే॥ 30
తస్మిన్నేవదినే రాత్రౌ పూర్వపుణ్యప్రభావతః।
మమారమూషకస్తత్ర దివ్యరూపో బభూవ హ॥ 31

సరస్వతీనదీతీరమున చాలకాలమునుండి యుండినదగుటచే శిథిలమై గన్పట్టు నొక దేవాలయ ముండెను. ఒకప్పుడు ఆ నదిలో స్నానముచేయుటకుగాను కర్మిష్ఠుడు, దయార్ద్రహృదయుడు నగు నొక యోగి వచ్చెను. ప్రతిదినము సరస్వతీనదిలో స్నాన మాచరించి దానితీరమున నున్న శిథిల దేవాలయమున కరిగి యచట కార్తీకమాసమున తపంబు చేయు నుద్దేశములో దేవాలయ మంతయు నూడ్చి, జలము చల్లి, శుభ్రపఱచువాడు,

పిమ్మట తత్సమీపగ్రామంబునకేగి, చమురు, ప్రమిద, వత్తులు తెచ్చి స్వామిసన్నిధిని సంధ్యాదీపములుంచి పూజించి తాను తపోనిష్ఠలో మునిగి యుండువాడు. ఆ శిథిలదేవాలయమునకు పొట్టపోసికొన నొక మూషిక మెచ్చటనుండియో వచ్చి చేరెను. యోగి సమాధిలోనుండ శాంతముగానున్న యాశ్రమమునకు నాహారమేమైన దొరకునేమోయని మూషికము వచ్చి వెదకికొనుచుండెను. అచట నాహారపదార్థమేమియూ దానికి లభింపలేదు. వెలిగించిన దీపములలో నొకటి యారిపోయినది. అందులో నొక ప్రమిదలో నారిపోయియున్న వత్తినిజూచి తినుబండారమని భ్రమించి దానిని నోటకఱచుకొని వేరొకదీపము వెలుగు ప్రమిదలోని వత్తికి చేర్పగా నది వెలిగి దీపమయ్యెను. ఆ దీపప్రకాశముచే నందున్న నైవేద్య పదార్థమును దినలేక విడిచెను. అది కార్తీకమాసమగుట వలనను, ఆమూషికమునకు గొప్పపుణ్యము సంప్రాప్తమయ్యెను. దాని పూర్వజన్మసుకృతమున నాటిరాత్రియే మూషికదేహమును విడచి దివ్యదేహమును ధరించి తదాలయమునందే తిరుగుచుండెను.

యతిః పశ్చాత్సమాధిస్థ ఉత్థితస్సోభవత్,
ఉద్యానే పురుషం యోగీ విచరంతమపశ్యత॥ 32
కో భవానితి పప్రచ్ఛ కిమర్థమాగతం త్వయా।
ఇత్థం మునేర్వచశ్శ్రుత్వా వ్యాజహార పునర్వచః॥ 33
మూషకోహం మునిశ్రేష్ఠ నిత్యం తృణకణాశనః।
వివరాంతే చిరంకాల మస్మిన్ దేవాలయేఽవసం॥ 34
మూషకస్య మమేదానీం ముక్తిరాసీత్సుదుర్లభా।
న జానే కేన పుణ్యేన సర్వం తం వేత్సి తత్త్వతః॥ 35
కోహం పురా కిం చరితం దుష్కృతం పూర్వజన్మని।
దుర్యోనిః కేన దోషేణ మయా ప్రాప్త మిహాధునా॥ 36
వక్తుమర్హసి తత్సర్వం సర్వజ్ఞస్త్వం మహామునే।
దాసోస్మి తవ శిష్యోస్మి కృపాపాత్రోస్మి మానద॥ 37

జ్ఞానచక్షు ర్విచార్యాథ విస్మితే నాంతరాత్మనా।
ఏవం వదంత ముద్భూతపురుషం పునరబ్రవీత్॥ 38

ఇంతలో నాయోగి సమాధినుండిలేచి, దివ్యదేహధారియగు నాపురుషునిజూచి, ఓయీ! నీవెవ్వడవు? ఇచట నేలతిరుగుచున్నావని యడిగెను. అంత నాతడు, 'ఓమహాముని! నేను గతరాత్రివఱకు నొక యెలుకగా నుంటిని. చిరకాలమునుండి యీ ఆలయమందే యుంటిని. నే డేలనో నా కారూపముపోయి యీ మానవరూపము ప్రాప్తించినది. నీవు సర్వజ్ఞుడవని, మహాత్ముడవని నాకు దోచుచున్నది. నేను తొల్లింటి జన్మలో నెవండనో, ఏపాపమున మూషికమునైతినో, ఇపు డేపుణ్యముచే నాకీమానవరూపము కల్గించెనో సెలవిమ్ము. నీకు దాసుడనై, శిష్యుడనై, విధేయుడనై యుందు' నని ప్రార్థించెను.

ఋషిః—

బ్రాహ్మణస్త్వం పురా కశ్చిత్ జైమినే గ్గోత్ర సంభవః।
బాహ్లీక స్త్వంహి విఖ్యాతః కుటుంబ భరణాతురః॥ 39
స్నానసంధ్యాపరిత్యక్తో నిత్యం బ్రాహ్మణనిందకః।
నిత్యం కృషిపరః క్రూరో ధనార్థీ జ్ఞానవర్జితః॥ 40
దేవపూజా పరిత్యక్తో నిత్యం శ్రాద్ధాన్నజీవనః।
అహోరాత్రం తథా భుక్తం నిషిద్ధ దివసేఽనిశమ్। 41
పిశాచేభ్యశ్చ కాకేభ్యో భుక్తమన్నం త్వయా పురా।
వేదశాస్త్రాదితో మార్గః తత్పురా నిందితస్త్వయా ॥42
స్నానసంధ్యాపరాణాం చ తపస్సన్మార్గవర్తినాం।
వినిందితం విశేషేణ త్వయా హాస్యపురస్సరమ్॥ 43
రూపవత్యాశ్చ కాంతాయాస్సహాయార్థ మహర్నిశం।
శూద్రీంత్వం గృహకృత్యేషు నియోజ్య చ నిరాత్మనా॥

సదా సంభాషణం స్వైరిణ్యాస్వైరభావేన సంయుతః।
శూద్రదాస్యః ప్రదాయాన్న మపత్యేభ్య స్త్వధమహో॥45
విక్రీత్వా కన్యకాం కస్మై పాపదేభ్యః ప్రయత్నతః।
దధిక్షీరం తథా తక్రం త్వయా క్రీతం తథా ఘృతమ్॥ 46
ఇత్థం త్వయా ధనం భూరిసంచితం పూర్వజన్మని।
తద్ద్రవ్యం భువి నిక్షిప్య మృతోఽసి నరకాగమే॥ 47
కర్మణా తేన నరకమనుభూయ పునస్త్విహ
జాతస్త్వాకారణాదాప్య వ్యసనత్వం పిష్టమందిరే॥ 48
దేవద్రవ్యం ముదా త్వం హి అపహృ సర్వార్థనిందకః।
దినే దినే తు దీపస్థ తైలహారీ తు పాపధీః॥ 49
తథాపి రాత్రౌ కార్తిక్యాం పరదీప ప్రబోధనం।
కృతం తేనైవ పుణ్యేన దివ్యరూపో బభూవహ॥ 50
ఇతఃపరం భక్తియుక్తో వైకుంఠే వససే ధ్రువమ్॥

ఈ పలుకులాలించిన యోగి మిగుల నాశ్చర్యపడి దివ్యజ్ఞానమున జూచి, ఓయీ! నీవు వెనుకటి పుట్టువునందొక విప్రుడవు. నిన్ను బ్రాహ్మణు డని పిలుచువారు. జైమిని కుటుంబము లోనివాడవు. కుటుంబపోషణము నకై వ్యవసాయము చేయువాడవు. నీవు ధనార్జనాసక్తి మిక్కుటమై పేరాసచే స్నానసంధ్యాదులను, దేవపూజను పరిత్యజించి, నిరంతరము బ్రాహ్మణదూషణ జేయుచు, ప్రతిదినము శ్రాద్ధాన్నము నుదినుచు, నిషిద్ధ దిన ములందుగూడ రెండువేళల భుజించుచు కాకశునకపిశాచాదులు తినునట్టి నీచాన్నభక్షణము సేయుచు, సన్మార్గవర్తనులను, తపశ్శాలురను, వేదా ధ్యయనపరులను నిందించుచు దురాచారుడవై మఱియు సౌందర్యవతియగు నీభార్య యలసిపోవునని యొకదాసినుంచి దానిచేతనే యింటిపనులు, వంటపనులు చేయించుచు, నిరంతర మామెతో సరససల్లాపములాడుచు,

పగటివేళనే కలియుచు, బిడ్డలకును, ఆమెకును నీవే సేవచేయువాడవు. కన్యకలనుకొని యమ్మువాడవు. దధిక్షీరఘృతాదులు చౌకగాగొని హెచ్చువెలకమ్మి పెక్కు ధనమార్జించి, దానిని భూమిలో పాతిపెట్టి యిట్లు జీవించితివి. తరువాత మరణించితివి. ఆపాపకర్మ వశమున మూషిక జన్మ నెత్తితివి. ఈజన్మమున దేవాలయమున నేయుండి దేవునకిడిన దీపములోని చమురు త్రావుచు దేవద్రవ్యహారివైతివి. పూజాద్రవ్యములను పాడుచేసి దుష్కర్ముడవైతివి. ఇట్టి పాపాత్ముండవైనను గడచినరాత్రి నేనుంచినదీపములో నారిపోయిన దీపపువత్తి నికలిపి ప్రజ్వరిల్ల జేసితివి. ఇంతటి నుండి భక్తితో భగవంతుని ధ్యానించుచుంటివేని నీకు వైకుంఠవాసము సిద్ధించును.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
పదునైదవ అధ్యాయము.

---

# షోడశోఽధ్యాయః

వశిష్ఠః—

అవ్రతేన నయేద్యస్తు మాసం దామోదరప్రియం।
సగచ్ఛేన్నరకం ఘోరం పునరావృత్తివర్జితమ్॥ 1
తాంబూలదానం కార్తిక్యాం మాసమేకం నిరంతరం।
యః కుర్యాద్రాజశార్దూల స చ సామ్రాజ్య మశ్నుతే॥
ప్రతిపద్దిన మారభ్య కార్తికస్య నరేశ్వర।
ఏకైకేన తు యద్దీపం యః కుర్యాద్విష్ణవే ర్పణం॥ 3
తస్య పాపాని నశ్యంతి స గచ్ఛేద్విష్ణుమందిరం।
కార్తిక్యాం భాను ముద్దిశ్య పౌర్ణమ్యాం స్నానతత్పరః॥
సంతానకాంక్షీ రాజేంద్రస్నానం దానం సమాచరేత్।
నారికేళఫలం దానం విష్ణోరగ్రేతు కార్తికే॥ 5

గవాక్షైర్గాం సతాంబూలం యః కుర్యాద్ద్విజసత్తమ।
న తస్య సంగతే హ్యాని రోగో న చైవ దుర్మతిః॥ 6
విష్ణోర్దేవాలయాగ్రేతు కార్తిక్యాం పౌర్ణమీదినే।
యస్తు స్తంభదీపం కురుతే సవైకుంఠపతిర్భవేత్॥ 7
విష్ణోరగ్రేతు కార్తిక్యాం స్తంభదీపార్పణం నరః।
తస్య పుణ్యస్య విస్తారం మయా వక్తుం న శక్యతే॥ 8
కార్తికే మాసి పౌర్ణమ్యాం స్తంభదీపావలోకనం।
తస్య పాపాని నశ్యంతి తమోదినకరోదయే॥ 9
శాలివ్రీహితిలోపేతం స్తంభదీపం ప్రచక్షతే।
స్తంభదీపవిహీనో యః కార్తికేమాసి భూమిప॥ 10
నరకాన్న నివర్తంతే నాత్ర కార్యా విచారణా।
శిలామయం దారుం వా స్తంభం కృత్వా హరేః పురః॥
సంస్థాప్య స్తంభదీపం తు యః కుర్యాత్స హరిప్రియః।

వసిష్ఠమహర్షి జనకమహారాజుతో, ఓరాజా! కార్తికమాసము దామోదరున కత్యంతప్రియమైనది. ఆమాసమునందు స్నానవ్రత సాలగ్రామ దానాదులలో నేదియైన నొకటి చేయని వాడంతములేని నరక ప్రాప్తినందును. ఈ నెలదినములును విడువక తాంబూలదానము చేసినవానికి చక్రవర్తిత్వము ప్రాప్తించును. విడువక దినమునకొక దీపమైన స్వామి సన్నిధినుంచినవా డఖిలపాపహరుడై, వైకుంఠవాసుడగును. ఈమాసమున శుద్ధపూర్ణిమనాడు సూర్యునుద్దేశించి నదీస్నాన మాచరించి హరిమందిరమున స్వామిసన్నిధని దక్షిణతాంబూలములతో నారికేళఫలదానముచేసిన చేసినవానికి చిరకాలమునుండి సంతతిలేకపోయినను కలుగదు. సంతానవంతునకు సంతాననష్టమైనప్పుడు నుండదు. ఆరోగ్యమధికమగును. దుర్బుద్ధి కలుగును. ఈమాసమున ధ్వజస్తంభమున నాకాశదీపము పెట్టినవాడు వైకుంఠవాసుడగును. ఆ యాకాశదీపముంచువారు శాలివ్రీహిధాన్యముల

శోలోగాని, తిలలలోగాని కలిపియుంచవలెను. ఇట్లు చేసినవాడు భగవంతున కిష్టుడగును. పెట్టగల శక్తియుండియు నాదీపమును పెట్టనివాడును, దానిని జూచి వెక్కిరించువాడును పునరావృత్తిలేని నరకమున నుండును. ఇందును గూర్చి యొక యితిహాసమున్నది. ఆలకింపుము.

వక్ష్యామ్యత్ర పురావృత్తం తత్సమాసేన తేశృణు॥ 12
మతంగస్యాశ్రమే పుణ్యే నానాద్రుమలతాయుతే।
విష్ణో రాయతనం తస్మిన్ ఆసీత్తత్పరితో వనమ్॥ 13
మునయస్తు సమాజగ్ముః కార్తికవ్రతకోవిదాః।
సపర్యాం కర్తుకామాస్తే తత్ర విష్ణోర్గృహే హరిమ్॥
షోడశై రుపచారైశ్చ దినేషు త్రిదశేషు చ।
పూజాం చక్రుర్విష్ణుగేహే కార్తికే కమలాపతేః॥ 15
నిర్మముర్దీపమాలాం చ ద్వారిద్వారి హరేః పురః।
అత్యంతభక్తిసంపన్నాః విష్ణుభక్త్యా శుచివ్రతాః॥ 16
తేషు కశ్చిన్మునిస్తత్ర ప్రాహేదం పృథివీపతే।
శృణుధ్వమ్మునయస్సర్వే కార్తికే తు శివాగ్రతః॥ 17
స్తంభదీపం తు యః కుర్యాత్సగచ్ఛే ద్వైష్ణవం పదం।
స్తంభదీపం కరిష్యామి వయం విష్ణుపదే శివమ్॥ 18
దినేస్మిన్కార్తికే మాసి పౌర్ణమాస్యాం విశేషతః।
సాయహ్నే వాసుదేవస్య స్తంభదీపో హరేః ప్రియః॥ 19
ప్రకృష్టఫలదం ప్రోక్తం స్తంభదీపం తు కార్తికే।
విష్ణోర్దేవాలయేగ్రే చ స్తంభం యః కారయిష్యతి॥ 20
పౌర్ణమాస్యాం కార్తికే మాసి తస్మిన్ దీపో హరేః ప్రియః
తస్య పాపాని నశ్యంతి పశ్చాద్విష్ణుపదం వ్రజేత్. 21

ఇత్యాకర్ణ్య మునేస్సర్వే తథేత్యుక్త్వా ముదాన్వితాః।
స్తంభదీపార్పణం కర్తు ముద్యోగం చక్రిరేఽఘ. 22

మునులలో నగ్రగణ్యుడనిపించుకొన్న మతంగ మహాముని యొక చోట నాశ్రమమును నిర్మించికొని యుండెను. దానియందొక విష్ణుప్రాసాదముకలదు. దానికి నాలుగు పార్శ్వంబులందును నొకవనమున్నది. కొందరు ఋషులు కార్తీకమాహాత్మ్యము నెఱింగినవారు హరిని పూజింపదలంచి యాదేవాలయమునకువచ్చి భక్తితో పూజలొనర్ప నారంభించిరి. వారు నిరంతరము ఆలయద్వారములపై దీపములు వెలిగించి భక్తితో స్వామిని సేవింపుచుండిరి. ఒకనాడందలి యొకముని తక్కిన వారినిగాంచి, ఓమహానుభావులారా! నావిన్నపమొండుగలదు. మనము కార్తీకమాసమున హరిహరుల మందిరములందాకాశ దీపముంచిన వైకుంఠవాసము లభించునని వినియుంటిమి. కావున మనమందరము పూర్ణిమనాడు హరిహరుల కత్యంతప్రీతికరంబగు నాకాశదీపమునకు గాను నొక స్తంభమును దేవాలయమున స్వామి కెదురుగ పాతుదము. అందు కార్తీకపూర్ణిమ దీపము నుంచుదము. మనకు కైవల్యప్రాప్తి సిద్ధించునని పలికెను.

విష్ణోర్నికేతనస్యాగ్రే నాతి తస్మిన్నరేశ్వర।
ఆకార్వన్నవిదూరే తు విష్ణో రాయతనాగ్రతః॥ 23
సాధు శాఖావిహీనం తే స్థాణుం తత్ర మహీపతే।
తస్మిన్ హర్షాన్వితాస్సర్వే కార్తికవ్రతకోవిదాః॥ 24
విష్ణుధ్యానం ప్రకుర్వంతః స్తంభదీపం సమర్చయన్।
శాలిప్రీహిగణోపేతం ఘృతపాత్రసమన్వితమ్॥ 25
ప్రసన్నహృదయాస్సర్వే స్తంభదీపం సమర్పయన్।
పునర్దేవాలయం ప్రాప్తాః రాజన్విష్ణుకథేచ్ఛవః॥ 26
కథాయాం కథ్యమానాయాం తదా దేవాలయాద్బహిః।
అభూచ్చటచటాశబ్దస్సర్వభూతభయంకరః॥ 27

సశాంతదీపశ్చతథా బిభిదే శుష్కపాదపః।

స ఇత్థం స్థూలదారూర్ధ్వం హ్యమూలాగ్రం మహీపతే॥

తక్కినవారదివిని సంతసించి వనమున కరిగి శాఖాశూన్యంబగు నొక స్తంభమును వడికి తెచ్చి భగవన్నామస్మరణ చేయుచు దానిని స్వామి కెదురుగ దేవాలయమున పాతిరి. దానిపై శాలిధాన్యముంచి యావునేతితో నిండిన పాత్రను దానిమీద పెట్టి వత్తివేసి దీపమును వెలిగించిరి. పిమ్మట వారందరు గర్భాలయములో గూరుచుండి హరికథలను జెప్పుకొనుచుండిరి. ఇంతలో దేవాలయ ప్రాంగణమున ఫెళఫెళమను ధ్వని వినబడెను. వారందరును బయటికివచ్చిచూడ వారు పాతిన స్తంభము శతధాభిన్నమై పడియుండెను. దీపమారిపోయెను. వారది చూచి విచారించుచు నింతలో నిట్లగుటకు హేతువేమని వింతపడుచుండిరి.

పశ్యతామేవ భూతానాం పతిత ధరణీతలే।
వినిర్యయౌ తతస్తస్మాత్పురుషః పూర్వదేహధృత్॥ 29
అథ జగ్ముర్మునిగణాః కథాం హిత్వా హరేర్గృహాత్।
బభూవుర్విస్మితాస్సర్వే హాహాకారరవాన్వితాః॥ 30
తస్మాదుద్భూతపురుషం దృష్ట్వా వాక్యమథాబ్రువన్।
కో భవాన్ కేన దోషేణ స్థాణుర్భూత్వాచిరం వనే॥

తద్వదస్వ యథాన్యాయం నాత్ర కార్యం విలంబితం।
ఇతి తేషాం వచశ్శ్రుత్వా జాతహర్షాన్వితో నృప॥ 32
ననామ దండవద్భూమౌ కృతాంజలిపుటోఽబ్రవీత్।
విప్రోఽహం విప్రశార్దూలా విత్తపో రాజ్యపాలకః॥ 33
కోశరాజ్యాశ్వమాతంగరథపాదాదిసంయుతః।
సమస్తభూతి సంపన్నో నిర్దహందుష్టమానసః॥ 34
వాధీతం వేదశాస్త్రం చ న శ్రుతా హరిసత్కథా।
న చ తీర్థానుగమనం న దానం మాత్రకమ్॥ 35

న సత్కర్మకృతం విప్రా మయా దుర్బుద్ధినా పురా।
ఉపవిష్టోఽస్మ్యహం నిత్యం ఉన్నతాసనవిష్టరే॥ 36
వేదాఢ్యాః పుణ్యపురుషా స్సదాచారా దయాళవః।
సదాశ్రయరతాశ్శుద్ధాః మత్సమీపే నిరంతరమ్। 37
నీచాసనే చోపవిష్టాస్సత్ప్రసాదార్థకాంక్షిణః।
తేషా మభిముఖో పాదా ప్రసార్యైవ సముత్సుకః॥ 38
ప్రత్యుత్థానాభివాదౌ చ న తేభ్యశ్చ కృతౌ మయా।
న దత్తం పుణ్యకాలేషు తేషాం దానమనుత్తమమ్॥ 39
ఆచరేద్యది మే దానం దానం ద్రవ్యవివర్జితం।
శ్రుతిశీలసమాపన్నా న్నిహానన్నిందితాఽస్మి తాన్॥ 40
దాస్యామీత్యనృతం వచ్మి న తేభ్యో దీయతే క్వచిత్।
నిత్యం విప్రవరేభ్యశ్చ ద్రవ్యం తత్కార్యసిద్ధయే॥ 41
గృహీత్వైవ తతః కార్యం విధేయానతథా మయా।
ఏవం దినాత్యతీతాని మయా దుర్బుద్ధినా పురా॥ 42
తేన కర్మవిపాకేన సర్వకర్మవిభేదినా।
తతః కాలే మృతస్సోఽహం నరకే భుక్తయాతనః॥ 43
ద్విపంచాశత్సహస్రాణి జన్మాని శ్వానయోనిషు।
జన్మాసీ దథ కాకానా మయుతం జన్మవై పునః॥ 44
నరకే త్వయుతం జన్మ విష్ఠాక్రిమిజని స్తథా।
కోటివారంభూరుహత్వం స్థాణుత్వం చ తథాఽనఘ॥
ఇత్థం పాపశతన్యాపిముక్తిరాసీ త్సుదుర్లభా।
ముక్తేస్తు కారణం నాహం వేద్మి భూతదయాపరాః॥ 46
జన్మనాద్యభవతా మద్య జాతిస్మరణకారణం।

యుష్మాకమిత్థం కథితం పాపం మే పూర్వజన్మని॥ 47
ఇత్యుక్త్వాఽసీ త్తత స్తూష్ణీ ముద్భూతపురుషో నృప।

ఆలోపున నా స్తంభమునుండి యొక పురుషుడు దివ్య తేజముతో వెలువడెను. వా రాపురుషునిజూచి, ఓయీ! నీ వెవడవు? నీవీ స్తంభరూపమున నుంటివేల? యని యడుగ నా పురుషుడు వారలకు సాష్టాంగపడి, మహానుభావులారా! పూర్వజన్మమున నేనొక ద్విజుడను. నన్ను విత్తపు డందురు. నేను చతురంగ సేనాయుతంబైన రాజ్యమున కధికారినై నిష్కారణుండనై, బ్రాహ్మణుడనై పుట్టియు దుర్బుద్ధిచే వేద వేదాంగములలో దేనిని చదువక, హరికథల నాలింపక, తీర్థయాత్రలను జేయక, దాన ధర్మములసలే యొనరింపక, దుష్కృత్యములనే చేయుచు, స్వల్పమైన మంచిపనిని చేయక రాజ్యమదమత్తుడనైతిని. మఱియు నేను సభాంగణమున నొక యున్నతాసనముపై గూర్చుండి వేద వేదాంగ విద్యావిశారదులును, సదాచారులును, పుణ్యాత్ములును, కరుణార్ద్రహృదయులును, శ్రోత్రియులునైన బ్రాహ్మణులను చాపలపై గూర్చుండజేసి నాపాదములను వారివైపు సాచువాడను. నావలని భయంబువలన నన్ను వారు మందలింపరైరి. సభకువచ్చెడి విప్రోత్తముల కెప్పుడును నమస్కరించి స్వాగత మీయనైతిని. పుణ్యకాలములందు గూడ నొక దానమైన జేయనైతిని. జ్ఞానులు, పండితులునైనవారిని వెక్కిరించితిని. ఇదిగో రేపిచ్చెద నేడిచ్చెదనని యాసపెట్టితిని. వారిపనులు నెరవేర్ప వారి కడనే ధనమును గ్రహించి చేయించితిని గాని నాడబ్బు వ్యయపరుపనైతిని. జీవితకాలమంతయు నిట్టి దుర్బుద్ధితో వెళ్ళించితిని. కాలవశమున మరణించి యమలోకమున ననంత నరకబాధల నందితిని. పిమ్మట అత్యుజన్మలందు కుక్కనై పుట్టితిని. తరువాత పదివేల కాకిపుట్టువుల నందితిని. పదివేల జన్మలందు తొండనై జనించితిని. అశుద్ధమునందు కీటకజన్మము పదివేలసారు లెత్తితిని. కోటిజన్మలు వృక్షరూపమున నుంటిని. తుదకీ స్తంభరూపమున నుంటిని. ఇన్ని క్షుద్రజన్మలెత్తినను నా పాపము నశింపదయ్యె. నాకెట్లు ముక్తి కలుగునో? మీ యనుగ్రహమువలన స్తంభరూపము నశించి మానవరూప మేర్పడినది. జన్మాంతరజ్ఞాని నైతిని. నా పాపకర్మ లన్నియు మీ యెదుట నివేదించితినని పలికి యూరకుండెను.

శ్రుత్వైవం మునయస్తత్ర ప్రోచుస్సర్వే పృథక్పృథక్
నిత్యం కార్తికమాసస్య ఫలం ప్రత్యక్షముక్తిదం।
కాష్ఠపాషాణదార్వాదే ర్ముక్తిరాసీ త్సుదుర్లభా॥ 49
తత్రాఽపి పౌర్ణమీ పుణ్యా సర్వపాపప్రణాశనీ।
సాధుసాధు తథా తస్యాం స్తంభదీపం సుఖప్రదమ్॥ 50
పౌర్ణమ్యాం కార్తికే మాసి విష్ణో ర్దేవాలయాగ్రతః।
పరైర్ని యోజితాద్దీపా దాయం శుష్కతరూపరి॥ 51
స్థాణుర్వా కార్తికే మాసి విష్ణో ర్దీపమువాహయేత్।
తేన తత్పాపహానిస్స్యాత్ విష్ణునా చ కృపాళునా॥ 52
ఏవం వివదమానానాం వచశ్శ్రుత్వా పున ర్నృప।
స తూవాచ పునశ్ఛాయ ముద్భూతపురుషోఽనఘ॥ 53
ముక్తిస్తు దుర్లభతరా కేనమే జాయఽతేధికా।
కేన వా కర్మబద్ధ స్స్యాత్కేన వాపి విముచ్యతే॥ 54
కేన దేహేంద్రియాణి తాని తాని చ దేహినాం।
జ్ఞానం కథం భవే త్ప్రుంసాం దివ్యనిర్వాణసాధనమ్॥ 55
వదధ్వ మేత త్సకలం మునయో జ్ఞానకోవిదాః।
ఇత్యేవ ముదితా స్తేన తేఽపి చాంగీరసం మునిమ్॥ 56
ఆజ్ఞాపయామాసు రతః సర్వజ్ఞస్స ముని స్తదా।
మునిస్తా నవలోక్యాథ తమాహాంగీరసో మునిః॥ 57

అమ్మునులందరు నా పురుషునిమాట లాలించి, అహా! కార్తికమాస మహిమ యెంతగొప్పది. కట్టెలు, రాళ్ళు, స్తంభములును ముక్తినందుట యెట్ల యెదుట గాన్పించుచున్నది కదా! ఈమాస మంతయు గొప్ప ఫల మిచ్చునదియే. అందు పూర్ణిమ విశేష ఫలమిచ్చునది. నా డాకాశదీప

ముంచిన ఫలమంతకన్న నెక్కువైనది. ఇతరులుంచిన దీపభారమును వహిం చిన స్తంభమునను హరికటాక్షమున ముక్తి కలిగి యుత్తమజన్మము లభించి నది. అని చెప్పెడి మునుల వాక్యములను స్తంభమునుండి వెలువడిన పురు షుడాలించి, ఓ మునిపుంగవులారా! నాకు ముక్తికలుగు మార్గమేదైన కలదా! జగంబునం దెల్లరకు నెట్లు కర్మబంధము కలుగును? అది నశించు టెట్లు? శరీరేంద్రియాదుల సంబంధ మాత్మ కెట్లు సంభవించును? మోక్షసాధనంబగు జ్ఞానము దేహేంద్రియాదులం దభిమానియైన జీవాత్మ కెట్లు సిద్ధించును? మహాజ్ఞానులగు మీరు నాకీ ప్రశ్నల కుత్తరువులం జెప్పి ధన్యునిగ జేయుడని ప్రార్థించెను. అచటి మునులందరును, అంగిరసుండను సర్వజ్ఞుడైన నొకమునితో, నీవే యాతని ప్రశ్నల కుత్తరువులు చెప్పగల వాడవు కాన చెప్పుమనిరి. అంత నాంగిరసుం డిట్లు చెప్ప నారంభించెను.

స్కాందపురాణమందలి కార్తీక మాహాత్మ్యములోని

పదునారవ అధ్యాయము

---

# సప్తదశోఽధ్యాయః

అంగీరసః—

కర్మబంధశ్చ ముక్తిశ్చ కార్యం కారణమేవచ।
స్థూలం సూక్ష్మం తథా హ్యస్యసంబంధో దేహ ఉచ్యతే॥
వాక్యాత్ ప్రవృత్త మేతత్తే ప్రవక్ష్యామి మహామతే।
పార్వత్యై కథితం విప్ర శ్వేతాద్రౌ శంకరేణ వై॥ 2
తదహం తే ప్రబ్రవీమి సమాధానమనాశ్శృణు।
అత్ర బ్రూమః సమాధానం కోఽన్యో జీవస్త్వమేవహి॥ 3
స్వయంపృచ్ఛసిమాం కోఽహం బ్రహ్మైవాస్మినసంశయః

సర్వజ్ఞుండైన ఆంగిరసుడు, ఓ విప్రుడా! నీ వడిగినప్రశ్నలు కడుంగడు నుత్తమంబులు. వానికి సమాధానములను చెప్పుచున్నాను. శ్రద్ధతో వినుము.

ఉద్ఘాతపురుషః —

వాదార్థ మేవంజానామి నాద్యాపి భగవన్ స్ఫుటమ్॥ 4
అహంక బ్రహ్మేచ వాక్యార్థమ్ ప్రతిపద్యే కథం వద।
హేతుః పదార్థబోధో హి వాక్యార్థావగతే రపి॥ 5
అంతఃకరణ తద్వృత్తిసాక్షి చైతన్యవిగ్రహః।
ఆనందరూప స్సత్య స్సన్ కిం నాత్మానం ప్రపద్యసే॥ 6
సత్యానందస్వరూపం ధీసాక్షిణం జ్ఞానవిగ్రహం।
చింతయాత్మతయా నిత్యం త్యక్త్వా దేహాది కాంధియమ్ 7
రూపాదిమాన్యతః పిండ స్తతో నాత్మా ఘటాదివత్।
వియదాదిమహాభూతవికారిత్వాచ్చ కుంభవత్॥ 8
ఏవ మింద్రియదృజ్నాహం ఇంద్రియాణీతి నిశ్చిను।
మనోబుద్ధి స్తథా ప్రాణో నాహ మిత్యవధారయ॥ 9
దేహేంద్రియాదయో భావాః హానిదాః క్షయభాగినః।
యస్య సన్నిధి మాత్రేణ సోఽహ మిత్యవధారయ 10
అనాపన్న వికారస్స న్నయస్కాంతవ దేవ యః।
బుధ్యా దిశా లయే త్ప్రత్యక్ సోఽహ మిత్యవధారయ॥
అజన్మాత్మవ దాభాతి యత్సాన్నిధ్యా జ్జడా ద్యపి।
దేహేంద్రియమనఃప్రాణా స్సోఽహ మిత్యవధారయ॥ 12
స్వప్నజాగరితే సుప్తభావేభావో లయం తథా।
యో వేత్త్యవిక్రియః సాక్షీ సోఽహ మి త్యవధారయ॥

కర్మవలన నాత్మకు దేహధారణము సంభవించుచున్నది. కావున శరీరోత్పత్తికి కర్మ హేతువగును. శరీరధారణవలన నాత్మ కర్మను

జేయును. అందుచే కర్మనాశనించుటకు శరీరధారణము హేతువగును. స్థూలసూక్ష్మశరీర సంబంధమువలన నాత్మకు కర్మబంధము కలుగునని తొల్లి పరమేశ్వరుడు పార్వతీదేవికి చెప్పెను. దానినే నీకు చెప్పుచున్నాను. ఆత్మయను నీశరీరమున నహంకారత్వంకారముల నారోపించి వ్యవహరించుటయే యని యాంగిరసుండనెను. అంత విత్తపుడో మునీంద్రా! నేను నింతవఱకిదియే ఆత్మయని భావించుచుంటినిగాని నాకది విశదముగ తెలియంగ రాకున్నది. వాక్యార్థజ్ఞానమునకు పదార్థజ్ఞానము కారణమగుచుండును. కనుక అహం బ్రహ్మాయను వాక్యార్థమును నాకు విశదీకరింపుడని యడుగ నాంగిరసు డిట్లనెను. ఈ దేహమునం దంతఃకరణవృత్తికి సాక్షియై నేను—నాది అని వ్యవహరింపబడు జీవాత్మయే 'అహం' అను శబ్దార్థము. సర్వాంతర్యామియై సచ్చిదానందరూపమైన పరమాత్మ 'సః' అను శబ్దార్థము. ఆత్మకు ఘటాదులవలె శరీరములేదు ఆయాత్మ సచ్చిదానందస్వరూపము; బుద్ధికిసాక్షి, జ్ఞానరూపి శరీరేంద్రియములు మొదలగు వానిని వ్యాపారములందు బ్రవర్తింపజేసి వానికంటె వ్యతిరిక్తముగా నున్నదియై యెల్లప్పుడు నొకేరీతి ప్రకాశించుచుండునదే ఆత్మయనబడును. 'నేను' అనునది శరీరేంద్రియాదులలో నొకటి కాదని ధ్రువపఱచుకొని యాదేహేంద్రియాదుల నన్నింటి నేది ప్రకాశింపజేయునో యదియే 'నేను' యను నిశ్చయమును గలిగియుండును. నామవికారరూపములు గలిగిన ఘటాదులన్నియు నశించును. అందుచే నవి యస్థిరములు. శరీరేంద్రియాదులుకూడ నామరూపములతో నుండి నశించునవియే. అందువలన నవి యేవియు ఆత్మకావు. ఇట్టి దేహమున జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు, స్థూలసూక్ష్మకారణశరీరములు నను మూడింటియందును నేను—నాది యని వ్యవహరించునదియే యాత్మయని నిశ్చయించుకొనుము.

ఘటావభాసకో దీపో ఘటాదన్యో యథేష్యతే।
దేహావభాసకో దేహీ తథాఽహం బోధవిగ్రహః॥
పుత్రమిత్రాదయో భావా యస్య తే చ ప్రియాప్రియే।
దృష్టా సర్వప్రియతమః సోఽహ మిత్యవధారయ॥ 15

పర ప్రేమాస్పదతయా అనుభూత మహం సదా।
భూయోదృష్టోసి నిత్యం తు సోఽహ మి త్యవధారయ
యస్సాక్షిలక్షణో బోధ స్త్వంపదార్థ స్స ఉచ్యతే।
సాక్షిత్వమపి బోధత్వ మవికారితయాఽఽత్మనః 17
దేహేంద్రియ మనఃప్రాణాహంకృతిభ్యో విలక్షణః।
ప్రోషితశ్చాపి షడ్భావవికార స్త్వంపదాదిభిః॥ 18
త్వమర్థమేవం నిశ్చిత్య తదర్థం చింతయేత్పునః।
అతద్వ్యావృత్తిరూపేణ సాక్షాద్విధిముఖేన చ॥ 19
నిరస్తాశేషసంసారదోషస్థూలాది లక్షణః।
అదృశ్యత్వాదిగుణకః పరాకృతతమోఽమలః॥ 20
నిరస్తాతిశయానంద స్సత్యప్రజ్ఞానలక్షణః।
సత్తాస్వలక్షణః పూర్ణః పరమాత్మేతిగీయతే॥ 21
సర్వజ్ఞత్వం పరేశత్వం తథా సంపూర్ణ శక్తితా।
వేదైస్సమర్థ్యతే యస్య సోఽహ మిత్యవధారయ॥ 22
మృదాద్యనేకదృష్టాంతైః తద్బ్రహ్మే త్యవధారయ॥ 23

మఱియు సూదంటురాతి నినుమంటి తిరుగునటుల దేనిసన్నిధానమున శరీరేంద్రియాదులు తిరుగుచుండునో, జడంబులగు శరీరేంద్రియాదులు తిరుగుచుండునో, జడంబులగు శరీరేంద్రియాదులు దేనిసన్నిధి నాత్మవలె తోచుచుండునో, సుషుప్తియందు శరీరేంద్రియచిత్తంబులు లేకున్నను గాఢనిద్రనుండి మేల్కొనినపిమ్మట నేను సుఖముగ నిద్రించితి ననుకొనుటయో ఆత్మయనబడును. దీపము ఘటాదులను ప్రకాశింపజేయుచు ఘటాదులకంటె వేరుగానుండి ప్రకాశించుపగిది నాత్మయు దేహేంద్రియాదులను ప్రకాశింపజేయుచు నాదేహేంద్రియాదులకంటె వేరుగనుండి వానిని ప్రకాశింపజేయునని యెఱుంగుము. ఆత్మ పరమానందస్వరూపమగుటవలన వానికి దారాపుత్రమిత్రాదులు ప్రియులగుచున్నారు. అట్టి విశేషప్రేమాస్పదమగు వస్తువేద్దియో అదియే ఆత్మయని గ్రహింపుము. ఏని దారాపు

త్రాదులకంటెను, సర్వప్రియవస్తువులకంటెను మిగుల నిష్టమైనదేయదియే యాత్మయని నిర్ధారించుకొనుము. 'తత్త్వమసి' మొదలగువాక్యమునందలి 'త్వం' అను పదమునకు కించిదజ్ఞత్వాది విశిష్టమగు జీవాత్మయని యర్థము 'తత్' యను పదమునకు సర్వజ్ఞత్వాదిగుణ విశిష్టమైన సచ్చిదానంద స్వరూపమని యర్థము. 'అసి' అనునది జీవాత్మ పరమాత్మల కైక్యత్వమును బోధించును. ఈరీతిగా వచించునపుడు జీవాత్మ నిష్టమైన కించిదజ్ఞత్వాది ధర్మములకును; ఆత్మ నిష్టమైన సర్వజ్ఞత్వాది ధర్మములకును పరిహరింపగా శేషించిన సచ్చిదానందరూప మొక్కటియే నిలుచును. అదియే ఆత్మ. షడ్భావవికారములు, దేహలక్షణము లుండుట, జనించుట, పెరుగుట, పండుట, క్షీణించుట, చచ్చుట యనునవి. ఇవి శరీరమునకేగాని యాత్మకుండవు. ఆత్మకు కామక్రోధములు మొదలగు షడ్వర్గములు, స్థూలసూక్ష్మములు మొదలగునవిలేవు. ఆత్మ సత్యజ్ఞానానంద స్వరూపమై పరిపూర్ణత్వము కలది. వేదంబులచే దేనికి సర్వజ్ఞత్వము, ఉపదేశత్వము, సంపూర్ణసామర్థ్యము స్థిరీకరింపబడుచున్నదో అదియే ఆత్మ.

జీవాత్మనా ప్రవేశశ్చ నియంతృత్వం చ తాన్ ప్రతి।
శ్రూయతే యస్య దేవేషు తద్బ్రహ్మేత్యవధారయ॥ 24
కర్మణాం ఫలదాతృత్వం యస్యైవ శ్రూయతే శ్రుతౌ।
జీవానాం హేతుకర్తృత్వం తద్బ్రహ్మేత్యవధారయ॥ 25
తత్త్వంపదార్థౌ నిర్ణీతౌ వాక్యార్థశ్చింత్యతేఽధునా।
తాదాత్మ్య మత్ర వాక్యార్థ స్తయో రేవ యథార్థయోః
ప్రత్యగ్బోధో య ఆభాతి సోఽద్వయానందలక్షణః।
అద్వయానందరూపశ్చ ప్రత్యగ్బోధైకలక్షణః॥ 27
ఇత్థ మన్యోన్యతాదాత్మ్య ప్రతిపత్తి ర్యదాభవేత్।
అబ్రహ్మత్వం త్వమర్థస్య వ్యావర్త్త చ యదైవహి॥ 28
తత్త్వమస్యాదివాక్యం చ తాదాత్మ్యప్రతిపాదనే।

లక్ష్యౌ తత్వం పదార్థౌ వా ఉపాదాన ప్రవర్తనే॥ 29
హిత్వా తే శబలే వాక్యే వాక్యార్థ ప్రతిబోధనే।

ఒక కుండనుజూచి మృణ్మయమనుకొని తక్కిన కుండలన్నియు నీవిధంబుగనే మృణ్మయంబులని నిశ్చయించుకొనినమాడ్కి ఒక్క దేహాంతర్యామి యగు జీవాత్మ పరమాత్మయేయని తెలిసికొని శేషించిన సర్వదేహాంతర్యామి యగు జీవాత్మ పరమాత్మయే యని నిర్ధారణగా తెలియగును. జీవులచే కర్మఫల మనుభవింపజేయువాడు పరమేశ్వరుడనియు, జీవులు కర్మఫలభోక్తలనియు నీశ్వరుడు కర్మఫలప్రదాతయనియు వేదవేదాంగములు నుడువుచున్నవి.

సుఖాద్యేతే వినాభూతే ప్రతీతి ర్లక్షణోచ్యతే॥ 30
తత్వమస్యాదివాక్యేషు లక్షణాభాగలక్షణా।
సోఽయ మిత్యాది వాక్యస్య పదయో రివ నో పురా,
అహం బ్రహ్మేతి వాక్యార్థబోధో యావద్దృఢీ భవేత్।
శమాదిసహిత స్తావ దభ్యసే చ్ఛ్రవణాదికమ్॥ 32
శ్రుత్యాచార్యప్రసాదేన దృఢో బోధో యదా భవేత్।
నిరస్తాశేషసంసారనిదానః పురుషస్తదా॥ 33
కించిత్కాల మనారబ్ధ కర్మవిత్తస్య సంక్షయే।
నిరస్తాతిశయానంద వైష్ణవం పరమం పదమ్॥ 34
పునరావృత్తి రహితం కైవల్యం ప్రతిపద్యతే।
తస్మాదాత్మవివేకార్థ మాదౌ కర్మ సమాచరేత్॥ 35
వినాయ చ్ఛ్రవణేనైవ కర్మకర్తుం న రోచతే।
పుమాన్ గురుం ప్రసాద్యైవ శ్రుత్వా తస్మాత్ప్రయత్నతః॥
తతో విచ్ఛిన్నవృత్తాంతః కృతే కర్మణ్యథానిధి।

తత్కర్మఫల మత్యంత తత్తుష్ట్యై విష్ణవేఽనఘ॥ 37

కర్మణా సుకృతే నైవప్రాప్య జన్మాన్యనేతకః।
తతో మోక్ష మవాప్నోతి యోగయుక్తో విశేషతః॥ 38
విముక్త కర్మబంధోఽభూ ర్మాత్ర కార్యా విచారణా।
ఇత్థం యత్నేన సంపృష్టమబ్రవీ దంగిరోమునిః॥ 39
భూయోఽపి సముపాచేత్థం మహాసంతోషధీర్నృప. 39

అందువలన మానవుడు శమదమంబులు మొదలగు గుణసంపత్తిగల వాడై, సాధన చతుష్టయ సంపన్నుడై గురుశుశ్రూష యొనర్చి, తత్వమసీత్యాది వాక్యంబులచే జీవాత్మపరమాత్మల కైక్యజ్ఞానముకలవాడైనచో సాంసారిక సంబంధమైన భ్రాంతులన్నియూ నశించి ముక్తుడగును. అజ్ఞానముత్పన్న మగుటకుముందు కొంతకాలము మంచిపనులను జేయవలయును. ఆపనులవలన చిత్తశుద్ధియు, దానివలన భక్తిజ్ఞాన వైరాగ్యంబులును, దానివలన ముక్తియు చేకూరును. అందుచే కొంతకాలము సత్కర్మానుష్ఠానుడు కావలెను. అనేకజన్మలందు మంచిపనుల నాచరించినగాని ముక్తికాంత లభింపనేరదని యాంగిరసుడు వచించి మరల వానికిట్లనియెను.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
పదునేడవ అధ్యాయము.

---

# అష్టాదశోఽధ్యాయః

ఉద్భూత పురుషః—

మునే స్వనుగృహీతోఽస్మి త్వత్తోహం తు మహామతే।
లబ్ధజ్ఞానోఽస్మి విప్రేంద్ర ప్రసాదాత్తవ దర్శనాత్॥ 1

పితా భ్రాతా గురు స్త్వం హి శిష్యోఽహం తవసువ్రత।
తథాపి దుర్భగస్యాథ స్థాణుభూతస్య సాంప్రతమ్॥ 2
క్వ చ దుష్కృత పాపోఽహం క్వ చేయం సద్గతి ర్మమ।
క్వ చాహం కార్తికః పుణ్యాం క్వచాహం దుష్కృతాలయః॥
క్వచ తేషాం దర్శనం చ క్వచాయం విష్ణుసన్నిధిః।
సుకృతస్యఫలం విప్ర సత్యం ప్రారబ్ధకర్మణః॥ 4
పునర్భోధయమాం ప్రీత్యా కృపా చే దస్తితే మయి,
కథం కర్మాణి మనుజైః క్రియంతే విధినా ముసే॥ 5
కథం తేషాం ఫలం తద్వత్కథం తదుపదేశనం।
కః కాలః కా కర్మాణి కిముద్దిశ్య సమభ్యసేత్॥ 6
పునస్సమ్యక్సమాచక్ష్వ శ్రోతు మిచ్ఛామ్యహం శుభం।
తద్వాగ్వ్రజాయధోత్సాతా త్పాపశైలః పపాపహా॥ 7
పునః కర్మాణి మాం బోద్ధు మర్హసి త్వం ఇహీపతే।

ఆంగిరసు డేదియో వచింపనుండ విత్తపు డాతనికి నమస్కరించి, ఓ మునిచంద్రమా! నీ దర్శనమువలన నేను ధన్యుండనైతిని. నాకు జ్ఞానోపదేశ మొనరించితివి కావున నీకు నేను శిష్యుడను, నీవు నాకు జనకుడవు. గురుడవు. అన్నవు. నేచేసిన పూర్వపుణ్యమువలనగదా యిట్టి కలయిక తటస్థించినది. లేనిచో మహాపాపినై శుష్కతరురూపమున నున్న నేనేడ! నీదర్శనమేడ! సద్గతియేడ! పుణ్యఫలప్రదాయియగు కార్తికమాసమేడ! పాపాత్ముడనగు నేనేడ! ఈవిష్ణుమందిరమునకు రాతటస్థించుటేడ! ఇచట మహాత్ములగు మీసమావేశమేడ! ఇంకను నాయందు శిష్యవాత్సల్యముతో దయయుంచి కర్మనుగూర్చి విస్తరించి వచింపుడు. సత్కర్మలను మానవు లెట్లాచరింపవలెను. వాట్ల కుపదేశమెట్లు? ఫలమెయ్యది? ఏకాలమందు తత్కర్మల నాచరింపవలెను? కర్మలన నెట్టివి? ఏభావముతో వానిని జేయు ఫలయేను? శుభఫలదంబగు నీకర్మఫల ప్రభావమును వినగోరుచున్నాను.

నీ వాక్కనెడి వజ్రాయుధముచే నా పాపపర్వతము కూలబడినది. నా ప్రశ్నల కుచితరీతి సమాధాన మీయ వేడుచున్నానని పలికెను.

అంగీరసః—

సాధుసాధు త్వయా పృష్టం యన్నామాద్భుతమానవ॥ 8
సర్వలోకహితార్థం తు యత్త్వయోక్త మిదం శుభం।
శృణుష్వ సావధానేన యత్పృష్టం తద్బ్రవీమ్యహం॥ 9
అనిత్యం దేహ మాసాద్య విస్మృత్యాత్మాన మశుధీః।
న ద్వంద్వమాత్మనః క్వాపి సర్వదేహస్య జాయతే॥ 10
తస్మాత్సందేహ భాజీయః క్రమాత్కర్మప్రవర్తకః।
తత్కర్మణా జానసిద్ధి ర్జ్ఞానాదాత్మప్రకాశనమ్॥ 11
స్నానాది సర్వకర్మాణి త్వయి వ్యయి విద్యోతితాని చ।
భక్త్యా సమాచరే తత్కర్మ దేహీ సమ్యగ్విధానతః॥ 12
వర్ణాశ్రమవిభాగాదీన్నాతిక్రామ న్యథావిధి।
తేషాం యత్కర్మ విహితం జ్ఞాత్వా పశ్చాత్సమాచరేత్॥
స్నానేన రహితం కర్మ హస్తి భుక్తకపిత్థవత్।
ప్రాతస్స్నానం ద్విజాతీనాం శస్తంచ శ్రుతిచోదితమ్॥ 14
ప్రాతస్స్నపేహ్యాశక్త శ్చేత్పుణ్యాం మాసత్రయోత్తమం
తులాసంస్థే దినకరే కార్తిక్యాం తు మహామతే॥ 15
మకరస్థే రవౌ మాఘే వైశాఖే మేషగే రవౌ।
మాసత్రయేషు పుణ్యేషు ప్రాతఃస్నానం దినేదినే॥ 16
యః కుర్యాత్స హరే ర్లోకం ప్రయాతి పరమాం గతిం।
కాలస్తు పాత్ర రేవాస్య తథా మాసత్రయం శుభమ్॥ 17
చాతుర్మాస్యాది పుణ్యేషు కాలేషు విహితం చరేత్।

సోమసూర్యోపరాగేషు తథైవాన్యాదినేషు చ॥ 18
కాలాంతరే విజానీయాత్ కాల్యే కర్మఫలప్రదమ్।
స్నానం సంధ్యాజపో హోమ స్తథా సూర్యాభివాదనమ్॥
అవశ్య స్తత్ ద్విజాతీనాం యస్స్నానం న సమాచరేత్।
స యాతిరౌరవం ఘోరం కర్మభ్రష్టోఽభిజాయతే॥ 20
తస్మాత్కార్తికమాసస్య యః కాలః పురుషార్థదః।
న కార్తికసమో మాసః న కాలః కార్తికాత్సమః॥ 21
న వేదసదృశం శాస్త్రం నతీర్థం గంగయా సమం।
న కులేన సమం బ్రాహ్మ్యాత్ న సుఖం భార్యయాసమం
న ధర్మేణ సమం మిత్రం న జ్యోతిశ్చక్షుషా సమం।
న కార్తికసమో మాసో న దేవః కేశవాత్పరః॥ 23
యః కుర్యాత్కార్తికే మాసి ధర్మాన్కర్మవిదుత్తమః।
క్రతుకోటిఫలం ప్రాహు స్సవిష్ణో రాలయే వసేత్॥ 24

ఆంగిరసుడు, ఓవిత్తపుడా! నీవడిగిన ప్రశ్నలన్నియూ సమంజసములు. పరుల కుపకరించునవి. సదుత్తరముల నిచ్చుచుంటి నాలింపుము. మానవుడు అస్థిరంబగు నీశరీరమును స్థిరమనినమ్మి ఆత్మజ్ఞాన శూన్యుడగుచున్నాడు. భేదము శరీరములకేగాని ఆత్మకులేదు. అట్టి యాత్మజ్ఞానోద్భవంబునకే ప్రపంచమందు సత్కర్మల నాచరింపవలయునని శాస్త్రములు చెప్పుచున్నవి. సత్కర్మలు ఫలదాయకములాయని సంశయమందక భక్తి శ్రద్ధాన్వితులై సత్కర్మల నాచరించి వానిఫలము పరమేశ్వరార్పిత మొనరించిన జ్ఞానముకలుగును. మానవు డేజాతి కెట్టికర్మలను వేదములు విధించినవో తెలిసికొని విధివిధానమున దత్కర్మల నాచరింపవలయును. బ్రాహ్మణున కరుణోదయస్నాన మాచరింపక యేసత్కర్మలాచరించినను వ్యర్థమగును. ప్రతిదిన మరుణోదయ కాలమునకు స్నానముచేయ శక్తిలేని బ్రాహ్మణుడు కార్తీకమాసమున సూర్యుడు తులారాసియందుండగాను, మాఘమాస

మున సూర్యుడు మకరరాశియందుండగాను, వైశాఖమాసమున సూర్యుడు మేషరాశియందుండగాను, నీమూడుమాసములందైనను తప్పక ప్రాతఃస్నానముచేయవలెను. అట్లు చేసిన వైకుంఠవాసము సిద్ధించును. పైమూడు మాసములందును, చాతుర్మాస్యములందును, అరుణోదయస్నానము ముఖ్యము. సూర్యచంద్రగ్రహణములయందును, ఇతర పుణ్యసమయములందును, వేరొక కాలమున స్నానముచేయవచ్చును. ప్రాతఃకాలమున స్నానముచేసిన మానవుడు సంధ్యావందన జపహోమసూర్యనమస్కారములు చేయవలయును. ఇట్లు చేయనివానిని కర్మభ్రష్టుడందురు. కార్తీకమున నరుణోదయస్నానమాచరించినవారికి చతుర్విధపురుషార్థములును సిద్ధించును. కార్తీకమాసముతో సమానమైనమాసము, వేదముతో తుల్యమైనశాస్త్రము, గంగకు సాటివచ్చు తీర్థము, బ్రాహ్మణులకు సమానమైన జాతి, భార్యతో సమానముగ సుఖమిచ్చునది, ధర్మముతో సమానమగు స్నేహితుడు, శ్రీహరికెనవచ్చు దేవుడును లేడు. కార్తీకమాసమున విధ్యుక్తముగ స్నానాదులనాచరించిన మానవుడు కోటియాగముల ఫలమునొంది వైకుంఠమున కేగునని చెప్పుటయు నావిత్తపుడుమరల నాంగిరసున కిట్లనియెను.

ఉద్ధ్యాతపురుషః—

చాతుర్మాస్య మితి ప్రోక్తం యత్త్వయా పూర్వకాశ్చయే।
కేన ప్రకాశితం కి ముద్దిశ్య సమాచరేత్॥ 25
కిం ఫలం కా గతి ర్హ్యేఽద్య తత్సర్వం వక్తుమర్హసి।

ఓ యాంగిరసమహర్షీ! చాతుర్మాస్యవ్రతమున నేమి? దాని నేయుద్దేశముతో నాచరింతురు? ఇదివర కెవ్వరైన నీవ్రతమాచరించినవారుకలరా? దానిఫలిత మేమి? విధానమెట్టిది? నాకు విస్తరించి చెప్పుడని ప్రార్థించెను.

అంగీరసః—

బంధు ర్భవా న్మనుష్యాణాం యత్పృష్టం తత్సుఖప్రదమ్।
తత్సర్వం తేఽభిధాస్యామి సావధాన మనా శ్శృణు।
ఆషాఢే పూర్వపక్షస్య దశమ్యాం చ జనార్దనః॥ 27
శేతే స సుప్తి హ్యాజేన శ్రియా సాకం పయోనిధౌ।

కార్తికే శుక్లపక్షే స్యాద్ద్వాదశీ హరిబోధినీ॥ 28
చాతుర్మాస్య మితి ప్రోక్తం విష్ణుసుప్తిసుఖప్రదం।
సత్యం ధ్యాయతి తన్మధ్యే స వై యాతి పదం విభోః॥ 29
విష్ణుసుప్తిప్రదే యస్మిన్ పుణ్యే మాసచతుష్టయే।
యద్యదాచరతే యస్తు తత్సర్వం సఫలం భవేత్॥ 30
కారణం చాత్ర వక్ష్యామి పురా మే హరిణోదితం।

అంత యాంగిరసుండు ఓ విప్రోత్తమా! నీవు సకలజనోపకారంబగు నుత్తమప్రశ్న నడిగితివి కావున చెప్పుచున్నాను. చాతుర్మాస్య వ్రతము నగా నాలుగుమాసములు దీక్షతోనుండి చేయువ్రతము. అదెప్పుడందువా! శ్రీమహావిష్ణువు లక్ష్మితోగూడి యాషాఢశుద్ధ ఏకాదశీ దివసమున పాలసముద్రమునందాదిశేషుని శరీరముమీగ శయనించి కార్తీకశుద్ధ ఏకాదశినాడు నిద్రనుండి లేచును. ఆనాల్గుమాసములకే చాతుర్మాస్యమని పేరు. ఆ నాలుగుమాసములలో శ్రీహరిప్రీతికై స్నానధ్యానమంత్రజపములు మొదలగు నే సత్కార్యము లొనర్చినను పూర్ణఫలమిచ్చునవగును. నే నిందులకు శ్రీమన్నారాయణుని వలన వినిన కారణము చెప్పెదను.

పురా కృతయుగే పుణ్యే వైకుంఠే విష్ణుమందిరే॥ 31
సేవ్యమానస్సురగణైః కిన్నరోరగఖేచరైః।
వామాంకస్థితయా లక్ష్మ్యాసార్థం పంచముఖాసనే॥ 32
ఉపవిష్టస్సేవ్యమానస్స్వభృత్యైస్స్వగణైర్హరిః।
ఇతి స్థితే హరౌ తత్ర నారదో భగవాన్ ప్రియః॥ 33
ఆజగామ హరేర్లోకం కోటిసూర్యప్రభాన్వితం।
తత్ర సింహాసనాసీనం చతుర్బాహుం మనోరమమ్॥ 34
సాధు పద్మపలాశాక్షం నారద స్సవ్యలోకయత్।
ననామ పాదయోస్తస్య జాతిహర్షాన్వితో మునిః॥ 35

హరి ర్దేవఋషిం దృష్ట్వా నారదం సార్ధవాసినం।
విహసన్ వాక్య మాహేదన్న జానన్నివ కేశవః. 36

తొల్లి కృతయుగంబున విష్ణులోకమున గరుడగంధర్వాది దేవతల చేత, దేవమునులచేత సేవింపబడుచు శ్రీహరి లక్ష్మీసహితుడై సింహాసనమున గూర్చుండియుండగా నటకు నారదుం డరుదెంచి పద్మనేత్రుండును, చతుర్బాహుండును. కోటిసూర్యప్రభాసమానుండునగు శ్రీహరికి సాష్టాంగనమస్కారమొనరించి చేతులుజోడించి నిండుసంతోషమున నుండెను. అంత శ్రీమహావిష్ణువు నారదునిజూచి చిరునవ్వునవ్వుచు నేమియు నెరుంగనివానిభంగి నిట్లనెను.

భగవాన్—

కుశలం తవ విప్రేంద్ర యత్ర యత్ర గమిష్యసి।
ఋషీణాం సర్వధర్మాణి కిం ను సాధూని నారద॥ 37
సర్వోపద్రవహీనాని విహితాని మనీషిణాం।
మానవాః సర్వధర్మేషు నియుక్తాస్తే పృథక్పృథక్॥ 38
తత్సర్వం వద దేవర్షే సదస్యస్మి న్మునీశ్వర।
ఇత్థం హరేర్ముకుందస్య వచశ్శ్రుత్వా స నారదః॥ 39
హరిమాహ ప్రసన్నాత్మా విహసన్ విశ్వమంగళమ్।

ఓ నారదా! నీకు సేమమా! నీవు చూచిన మహామునుల సత్కర్మానుష్ఠానములు విఘ్నములేకుండ సాగుచున్నవా? మానవులందరు వారివారికి విధింపబడిన ధర్మములను తప్పక నిర్వహించుచుండిరా? ఏవిధమైన యుపద్రవంబులు నేరికిని లేవుగదా? ఇదంతయు నిండుసభలో విశదముగా వక్కాణింపుమనెను.

నారదః—

హరే దృష్టం మయాభూమౌ ధైర్యోముక్తః త్రయీపథః॥
భగవన్ మునయో హ్యపి కేచి స్నానవసంగతాః।

సునిస్వస్తోకోస్వదితేంకర్మముక్తాః స్యుః కేచతే ప్రభో॥ 41
అభక్ష్యభక్షణరతాః కేచిత్త్యక్తవ్రతాః పరే।
కేచిదాచారసంపన్నాః సాధ్వాహంకారవర్జితాః 42
కేచిత్సన్మార్గనిరతాః కేచిన్నిందాపరాయణాః।
తస్మాత్తాన్ పాలయస్వ త్వం భగవన్మునిమండలమ్॥ 43
కురు శిక్షా మహాయేన దేవదేవ సుకర్మణా।

నారదుఁ డిట్లడిగిన శ్రీమహావిష్ణువునకు నమస్కరించి చిరునవ్వు మొగంబున వెలయ ఓదేవదేవా! నీవెరుంగని దీజగంబున నేదిగలదు? ఐనను నన్ను వచింపుమనుటచే చెప్పుచుంటిని. ప్రపంచమున కొందరు మునులు, మనుష్యులునుగూడ స్వహితకర్మలను మఱచి వేయూటలేరు. వా రెట్లు ముక్తులగుదురో యెఱుంగలేకున్నాను. కొందరు భుజింపరాని పదార్థములను భుజించుచున్నారు. కొందరు వ్రతారంభముచేసి పూర్తిచేయక విడుచుచున్నారు. కొందరు సదాచారులుగ, మఱికొందరహంకారరహితులుగను, వేరు కొందరు పరనిందాపరాయణులుగ నున్నారు. వారలను సత్కర్మలవలన సుకృతాత్ములుగ నొనర్చి రక్షింపుమనెను.

శ్రుత్వా దేవ బాహ్వే ర్వాక్యం భగవా న్భక్తవత్సలః॥ 44
పాలకస్సర్వలోకానా మేక ఏవ జనార్దనః
హరిః ఖగేంద్ర మారుహ్య సలక్ష్మ్యా భువ మాగమత్।
యత్ర నానాసహస్రసంఖ్యాక మ్మునీనాం మండలం విభుః
వృద్ధబ్రాహ్మణరూపేణ సంచరన్ సర్వమేదినీమ్॥ 46

అంత జగన్నాటక సూత్రధారుడును, నిఖిలజగదాధారుడు నైన దామోదరుండు తక్షణము లక్ష్మీదేవితోఁగూడ గరుడునెక్కి వేలకొలది మహర్షులున్నతావుగల భూలోకమునకు విచ్చేసి ముసలిబ్రాహ్మణరూపముతో దిరుగాడుచుండెను.

సర్వజంతుహృదిస్థోఽపి మాయానాటకవిగ్రహః।
యత్రయత్ర సుపుణ్యేషు క్షేత్రతీర్థగిరిష్వపి॥ 47

విపినేష్వపుణ్యేషు ఆశ్రమేషు విశేషతః।
దృష్ట్వా కేచిద్ద్విజవరా మానవాభక్తితత్పరాః। 48
ఆతిథ్యం చక్రిరే కేచిత్కేచిత్తం జహసుః ప్రజాః।
ననమంతి తథా కేచిత్కేచిన్మానవశంగతాః। 49
కేచిద్గర్వవశం ప్రాప్తా కామాంధా స్తత్ర కేచన।
కేచిత్తత్ర క్రియాలోకాః కేచిదేకవ్రతాః పరే॥ 50
కేచిత్తత్ర నిషిద్ధేషు దినే ష్వన్నపరాయణా।
హరివాసరవిభ్రష్టాః తథాఽన్యేప్యపిచప్రియాః 51
కేచిదాచారసంపన్నాః కేచి దాత్మని పాలసాః
తాన్ దృష్ట్వా భగవాన్ విష్ణుర్ద్విజరూపీ జనార్దనః॥ 52
ఉపాయం చింతయన్నాగాత్స పున ర్మునిమండలం।
నైమిశం సుమహారణ్యం పుణ్యాం మునివరప్రియమ్॥ 53

ఆమాయామేయరూపుండగు శ్రీమన్నారాయణుండు, అఖిలజన హృత్పద్మంబుల నున్నవాడైనను వారివారికిగల భక్తిని పరీక్షింపదలంచి వృద్ధద్విజరూపంబున భూలోకమందలి పుణ్యక్షేత్ర పుణ్యనగ పుణ్యాశ్రమ పుణ్యవనంబులందు తిరుగుచుండెను. ఆరీతిగ తిరుగాడు నాభగవానునికి కొందర రతిభక్తితో నతిథిపూజ లొనర్చిరి. వేఱుకొందరు వృద్ధుడని భావించి ఎగతాళిచేసిరి. మరికొందర రీముసలి ప్రక్కకు పెుక్కనేలయని యూరకుండిరి. ఇక కొంచ రీముసలి బక్క బాపనయ్యతో మన మేల ప్రసంగించవలెనని గర్వపడిరి. వేరు కొందరు కామాంధకారమున నతనిని తేరి మాడరైరి. మఱికొందరు తమవ్యాపారములను జూచుకొనుచు నితని పదభక్తి నెఱఁగరైరి. కొంత వ్రతదీక్షను, కొందరు నిషిద్ధదినములందుగూడ భుజించుటలోను నుండిరి. ఇక కొందరు హరివాసరమును త్యజించిరి. వేరుకొందరు సదాచార సంపన్నులుగను, మరికొందరు సదాచారవర్జితులు గను నుండిరి. శ్రీహరి యిట్టివారి నందరనుగాంచి వీరినెట్లు తరింపజేతునా యని యాలోచింపుచు నావృద్ధబ్రాహ్మణరూపము ను విసర్జించి శంఖచక్ర గదా పద్మకౌస్తుభ వనమాలాద్యలంకృతుడై, నిజరూపమునుధరించి లక్ష్మీ

దేవితోడను, తన భక్తులతోడను, మునిజనప్రీతికరంబగు స్వామికారణ్యాంబున కరిగెను.

హిత్వాద్విజవరం రూపం పూర్వవ త్తగవాహనః।
కౌస్తుభాభరణ శ్శ్రీమచ్ఛంఖచక్రవిరాజితః॥ 54
సాకంస్వభ క్తనిః శైస్స్వభార్యో జగదీశ్వరః।
ఏవం జగన్మయం దృష్ట్వా జ్ఞానసిద్ధాదయోఽమలాః 55
నశిష్యాస్ససుతాః పుణ్యాస్సర్వేవిస్మితామానసాః
విష్ణుం వైకుంఠనిలయం స్వాశ్రమేష్వాగతం హరిమ్ 56
అతసీపుష్పసంకాశం విద్యుద్వర్ణ పటావృతం।
కోటిసూర్యప్రభాభాసం స్ఫురన్మకరకుండలమ్॥ 57
అనేకరత్నసంయుక్తకిరీటేన విరాజితం।
అనేకాదిత్య సంకాశమమేయమమరేశ్వరమ్॥ 58
స్వయంప్రసన్న మత్యంత మాద్యం దృష్ట్వా మునీశ్వరాః
జ్ఞానసిద్ధాదయ స్సర్వే మునయ శ్శంసితవ్రతాః॥ 59
హరేస్సమీపమాజగ్ము స్సర్వే జాతసుబుద్ధయః।
ప్రణామం చక్రు రనఘాః పాదయోః పరమాత్మనః। 60
ఆగతా శ్చ సముద్భాతా స్తిష్ఠంత శ్చ పురో భువి।
జ్ఞానసిద్ధాదయ స్సర్వే మునయః ప్రాంజలిస్థితాః 61
తుష్టువు స్తత్ర సంతుష్టా స్సర్వజ్ఞం జగదీశ్వరమ్।

ఆవనమందున్న జ్ఞానసిద్ధాది మునిపుంగవులు స్వయముగ తమ యాశ్రమంబున కనుగ్రహమున వచ్చిన అవిసెపూకాంతివంటి కాంతిగలిగి పీతాంబరధారుడై, కోటిసూర్యప్రభాభాసమానుడై, రత్నకిరీటకుండల కేయూరహారాదుల నలంకరించుకొన్నవాడును, దేవదేవుండును, సుప్ర

గన్న హృదయుండును, సచ్చిదానందరూపుడునైన శ్రీమన్నారాయణుని దర్శించి పుత్రులతో మిత్రులతో శిష్యులతోగూడ భక్తియుక్తముగ సాష్టాంగనమస్కారమాచరించి దోసిలి యొగ్గి నిలబడి సర్వజ్ఞుండైన యాభగవాను నిట్లు స్తోత్రముగావించిరి.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
పదునెనిమిదవ అధ్యాయము

---

# ఏకోనవింశోఽధ్యాయః

జ్ఞానసిద్ధిః—

విధు రధికవిధిజ్ఞా వేదవేద్యం సుగుహ్యం।
నిగమహృదయవాసం నిశ్చలం న ద్వితీయం।
హిమకరరవిశర్వబ్రహ్మముఖ్యై ర్నరేంద్రైః
స్తుతచరణయుగం త్వాం నౌమి భూయ స్సురమ్యమ్॥ 1
భవాన్నవాచాం విషయోపి నిత్యం భవార్చితాంఘ్రి
ర్భవభీతి హంతా, భవార్ణవస్థై స్సతతం భవాద్యైః
స్తుత్యోభవ దూర్భధ భూతరూపైః। 2
భూతాని భూతాని తథైవ సంతి భవ్యాని సర్వాణి చరా
చరాణి, భవద్విభూతిః పరమా పరస్మా త్పరో భవానీ
పతి పూజితాంఘ్రిఃత్వ మీశ్వరో యన్నిఖిలం విభాతి
మాయామయం ప్రకల్పితకల్పమీశ, చరాచరం విశ్వ
మనేకబీజం భూతైర్మహద్భిస్సహ మాయయాచ॥ 4

ఆదౌ తథాంతేచ భవాన్ సమగ్రం విశ్వాన్తతస్థః భవ
సీహామధ్యే, అన్నస్య యజ్ఞస్య చ తన్మురారే చతుర్విధ
స్యాపి విచిత్రరూప॥ 5
సృష్ట్వా త్వదీయం జగదంసుఖలేతు సంజీవ్య సత్సౌఖ్య
రూప మేతత్, ప్రతీయసే యద్వాగపం జగచ్చ సుచంద్రి
కాయాం తుహినే పయోధేః॥ 6
ఆనందవారాన్నిధిరీశ్వర త్వం త్వమేవ తద్వ్యాప్తిశి సర్వ
తోఽపి, సర్వాంతరం సర్వపురాణపారం త్వత్తస్సమస్తం
త్వయి లీయతే చ, ఆర్తప్రజానాం హృదయాంశుజన్య
స్యాతః త్వమీశోఽఖిల లోకవంద్యః। ద్రష్టుం న శక్యో
మనసాఽపి యస్మిన్ సృష్టేస్తథా సద్భశాం త్వమత్ర,
నమో నమస్తే శివ తే నమోఽస్తు నారాయణ స్త్వం
కురుమాం కృతార్థం [illegible] మాం విఫలం మమాస్తు
న మో మురారే పురుషాయ తుభ్యమ్॥ 9
త్వం మాం సదా పాహి సురేశ్వర త్వం నమః పరేశాఖిల
లోక వంద్య, ఏవం కృపేహాం చకృతః కృతార్థోన తేపి
కించిత్పరిహాతి నాశమ్॥ 10
కృపానిదానం తు భవాన్ నద్యాపి శ్రో చ్యస్తథాహంచ
భవార్ణ వస్థః, సంశుద్ధ పాహీశ్వర లోకవంద్య సంసార
సింధౌ పతితం మురారే॥ 11
నమస్త్రైలోక్య నాథాయ నమ స్త్రైలోక్యవాసినే।
అనంతాయాదిబీజాయ విష్ణవే వేధసే నమః॥ 12
హంసాయ హంసపతయే నమః పూర్ణసదాత్మనే।
గుణాతిగాయ గురవే నమ స్తే కరుణానిధే॥ 13

నిత్యానందసుధాబ్ధివారనిధయే స్వర్గాపవర్గాప్తయే నానా
భేశ విపర్జితాయ సుతరాం తేజస్స్వరూపాయ చ, సాధు
మ్వర్ధిగహృత్సరోరుహదళే మ్వంతస్థితా యాత్మనే
గోవిందాయ సురేశ్వరాయ హరయే కృష్ణాయ తుభ్యం
న్నమః॥

విశ్వోత్పత్తి విపత్తిగుప్తివతయే వైకుంఠవాసాయ తే
వ్యాసాద్యైరత్నపాదపద్మ విబుధై రానమ్రవాక్యం
ధరైః, స్తుత్వా తే పద భక్తినావమధికం త్వారుహ్య
జన్మార్ణవం తీర్త్వాత్వాం సమమాపు రా ర్తిహారిణం
తేజోమయం శ్రీహరే, నానాబోధసుతర్క వాక్యనిచయై
ర్నానాపురాణాగమైర్నానాశాస్త్రవిచారనీతిసహితైర్న
త్వాంవిదుర్మానవాః, త్వద్భక్త్యా చ నిరంజనద్యుతిబలా
త్త్వత్పాదపద్మం హరే వశ్యంతాత్మని శేషమేవ సతతం
త్వద్భక్తిత శ్చోత్తమమ్॥

అనైమిశారణ్యమందున్న మునులలోనెల్ల నన్నివిధంబులచేతను పెద్దవాడైన జ్ఞానసిద్ధుడు, ఓపుండరీకాక్షా! వేదవేత్తలు నిన్ను వేదవేద్యుడని, వేదవ్యాసుడని, అద్వితీయుడని, సూర్యచంద్రనేత్రుడని వచింతురు. బ్రహ్మరుద్రేంద్రాదులు స్తుతింపదగిన నీ పాదపద్మంబులకిదే వందనంబు వాచ్యుడవైన నీవు, అవాఙ్మానసగోచరుడవు. సంసారభయ పరిహారకుడవు. బ్రహ్మాదిస్థావరాంతమువఱకుగల ప్రాణికోటి నీవిభూతియేగాని యన్యముగాదు. అందుచే నిన్ను పరాత్పరుడని స్తుతింతురు. ఓప్రభూ! నీవీపదునాల్గు లోకముల యుత్పత్తిలయములను చేయువాడవు. ఓచిదానందరూపా! నీవు సర్వాంతర్యామివై యుండి జఠరాగ్నిరూపమున జనులచే తినబడిన చతుర్విధాన్నమును పచనముగావించి దేహములకు బలమొసంగువాడవు. ఓపరతత్వరూపా! నీకివే వేయివందనములు. ఓపురాణపురుషా! ఓమురారీ! ఓమాధవా! నీదర్శనము నిష్ఫలము కారాదు. నను

కృతార్థుం జేయుము. నీవు దయార్ద్రహృదయుడవు. నేనీసంసారపంకిలమునబడి లేవలేకుంటిని నన్నుద్ధరింపుము. చతుర్దశభువనాధారా! లోకరక్షకా! నీకివే వేలకొలది వందనంబులు. సకలజగన్నివాసుడవు. సకలజగదుత్పత్తిలయకారణుడవు వ్యాసాది మునిపుంగవార్చితుడవు, అచ్యుతుడవు, వైకుంఠవాసుడవునగు నీకిదే నమస్కారము. నిను భజించినవారు నీపాదంబులను నావనెక్కి సంసారసాగరము నుత్తరించుచున్నారు మానవులెన్ని పురాణములను జదివినను, ఎన్నిశాస్త్రచర్చలను గావించినను నినుజూడ జాలరు. నీభక్తులకు మాత్రమే నీవు దృగ్గోచరుడవగుదువు.

హా శ్రీంద్రద్రుమపాలకాయ విభవే ప్రహ్లాదసంరక్షిణే।
మార్కండేయ విభీషణోద్ధవ పరిత్రాత్రే యశస్సంపదే।
త్వన్నామానుగ్రహణేన పాతకచయం తూర్ణం చ నశ్యత్యహో
దిష్ట్యా యస్సకృదేవ త్వత్పదయుగం ప్రాప్నోతి తుభ్యం నమః॥

కేశవాయ నమస్తేఽస్తు నమో నారాయణాయ చ।
గోవిందాయ నమస్తేఽస్తు విష్ణవే నమః॥ 18
మధుసూదనాయ దేవాయ మహేశాయ మహామతే।
త్రివిక్రమాయ నిత్యాయ వామనాయ నమోఽస్తు తే॥ 19
శ్రీధరాయ నమస్తేఽస్తు హృషీకేశాయ తే నమః।
నమస్తే పద్మనాభాయ నమో దామోదరాయ చ॥ 20
సంకర్షణ నమస్తుభ్యం పాహ్యస్మాన్ కరుణానిధే।
స్తువంతమిత్థం భగవాన్ జ్ఞానసిద్ధిమువాచ హ॥ 21
ఈషత్స్మితాబ్జవదనో విష్ణుర్వైకుంఠవల్లభః।

ఓగజేంద్రరక్షకా! ప్రహ్లాదవరదా! ధ్రువసంరక్షకా! మార్కండేయ విభీషణాది భక్తరక్షకా! ఏమానవుడొక్కపరి నీపాదపద్మంబులను సేవించునో వాడు సర్వపాతకనాశకుడగును. కేశవా! నమస్కారము; నారాయణా! నమస్కారము; మాధవా! నమస్కారము; గోవిందా! నమ

యస్తు వ్రతాదిదానైశ్చ యశ్శక్త్యా మాముపాసతే। 28
తేషాం పాపాని నశ్యంతి సన్నిధిర్మే భవేచ్చిరమ్।
న కుర్యాద్యది యో లోకే వ్రతం మాసచతుష్టయమ్॥
మత్ప్రీతికారణే పుణ్యే స యాతి నిరయాలయం।
కుర్వంతు మునయ స్సర్వే లోకే మద్భక్తిమాశ్రితాః 30
మదాజ్ఞయా మునిశ్రేష్ఠాః వ్రతమిష్టార్థదాయకం।
న కరోతి యదా మూఢశ్చాతుర్మాస్యవ్రతం శుభమ్॥ 31
బ్రహ్మఘ్న గతిమాప్నోతి కి మన్యై ర్బహుభాషణైః।
నిద్రాలస్యజడాద్యైశ్చ దుఃఖజన్మ జరాదిభిః॥ 32
లాభాలాభై స్తథాన్యైశ్చ నచాస్తి మమ తై ర్భయం।
యే మద్భక్తిపరా లోకే యే నై సద్ధర్మవర్జితాః॥ 33
తేషాం భక్తిపరీక్షార్థం సుప్తిర్వ్యాజ ముపాశ్రయే।
విహితాం యే మమాజ్ఞాం చ యే కుర్వంతి మమ ప్రియమ్
తేషాం పాపాని నశ్యంతి మనోవాక్కాయజాని చ।
స్తోత్రం యః పఠతే పుణ్య మిదం సంధ్యాత్రయే నరః॥35
మద్భక్తి రచలా చాస్తు స వైకుంఠే చిరం వసేత్।
ఇత్యుక్త్వా భగవాన్ కృష్ణః సలక్ష్మ్యా క్షీరసాగరమ్॥
ఆషాఢస్య దశమ్యాం తు శుక్లాయాం ప్రయయౌ హరిః
శేతే సుధానిధౌ విష్ణుః ఫణితల్పే సుఖప్రదే॥

అంత నా జగద్రక్షకుడు, ఓజ్ఞానసిద్ధి! నీ కోరిన వరమిచ్చితిని. వేరొకటి కోరుకొను మిచ్చెద; లోకమునందు చాలమంది దురాచారులై, బుద్ధిహీనులై యున్నారు. వారి పాపములు పోయుట కొక వ్రతము కల్పించెదను అది సర్వజన సుఖకరము, నే నాషాఢశుద్ధదశమినాడు లక్ష్మీదేవితోగూడ శేషశయ్యపై క్షీరసాగరమున సుఖనిద్రకై పరుండును. తిరిగి కార్తీకశుద్ధద్వాదశినాడు సుఖనిద్రనుండి లేచి క్షీరసాగరమును విడుతును.

ఆనాలుగు మాసములకాలములో నాకిష్టమైన చాతుర్మాస్యవ్రతము నొన రించువారికి నిఖిలపాపంబులు నశించి మత్సాయుజ్యము లభించును. ఆకాల మందావ్రతమును చేయనివాడు నరకకూపమున బడితీరును. మీరందరావ్ర తము నాచరింపుడు. ఇతరులచే నాచరింపజేయుడు. ఆవ్రతము నాకాల ములో జేయనివాడు బ్రహ్మహత్యాపాతకము ననుభవించును. చేసిన వారికి జన్మజరా వ్యాధులవలన బాధలుండవు. నాయందు భక్తిగలవారిని లేని వారిని బరీక్షించుటకు నిద్రావ్యాజమున నేనట్లు శయనింతును. ఇపుడు నీవొనరించిన స్తోత్రమును త్రిసంధ్యలందు పఠించినవారు నాసన్నిధినుం దురు. విష్ణుభగవానుడట్లు మునులకాదేశించి శ్రీదేవితోగూడ నాషాఢ శుక్లపక్షమందలి దశమినాడు పాలసంద్రమునకేగి శేషపాన్పుపై పవ్వ ళించెను.

విష్ణువాక్యమిదం పుణ్యం కథితం తే మహామతే।
సర్వవ్రతోత్తమం పుణ్యం చాతుర్మాస్యం ఫలప్రదమ్॥38
పాపీయాంసో దురాత్మాన స్సాధవో వా హరిప్రియాః
వ్రతం సమాచరేత్సమ్యక్సాప్తే మాసచతుష్టయే।39
బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రాశ్చాపి తథాపరే
పత్న్యః స్త్రీజనా స్సర్వే వ్రతస్థా విష్ణుతుష్టయే॥ 40
అభర్త్రా వా సభర్త్రా వా తథా కాషాయధారకాః।
అవశ్యక మిదం భద్రం వ్రతం సమ్యక్సమాచరేత్॥ 41
నాచరేద్యది యో మోహాత్తదా దేవవ్రతం శుభం।
బ్రహ్మఘ్నగతి మాప్నోతి శుచిత్వం నైవ విద్యతే॥ 42
మనోవాక్కాయశుద్ధేన సపర్యాం విష్ణవేస్వయం।
యః కరోతి స ధన్యోభూత్సుప్తే దేవే జనార్దనే। 43
యో న కుర్యాద్వ్రతం పుణ్యం విష్ణో స్సుప్తి సుఖప్రదం
సురాపగతి మాప్నోతి కోటిజన్మ స్వసంశయః॥ 44
చాతుర్మాస్యవ్రతం పుణ్యం తుష్టయే పరమాత్మనః।

న కుర్యాద్యది వా మోహా త్స గోఘ్నస్య గతిం లభేత్
వ్రతం సమాచరే న్నిత్యం యేన కేనాపి మానవః॥
సోపి క్రతుశతం పుణ్యం ప్రాప్య పశ్చా ద్ధరిం వ్రజేత్॥ 46
ఇత్యాకర్ణ్య హరే ర్వాక్యం చాతుర్మాస్యవ్రతం శుభం।
జ్ఞానసిద్ధాదయ స్సర్వే కృత్వా విష్ణుపదం యయుః॥ 47

ఓ జనక రాజేంద్రా! శ్రీహరి యానతిచ్చిన చాతుర్మాస్యవ్రతమును నీ కెరిగించితి. అంగిరసుడు విత్తపునకు జెప్పెను. ఈ వ్రతము నాచరించుటకు స్త్రీపురుష భేదముగాని, శిష్టదుష్ట భేదముగాని లేదు. నాల్గువర్ణముల వారిలో నెవరైనను జేయవచ్చును. సువాసిని వితంతువు, యోగిని యెవరాచరించినను భగవత్ప్రీతికరమే యగును. ఈ వ్రత మాచరించినవాడు విష్ణు సాయుజ్యమందును. చేయనివాడు గోహత్య, స్త్రీహత్య, శిశుహత్య, బ్రాహ్మణహత్యలను జేసిన పాపునికంటె నెక్కుడు పాపియగును. జ్ఞాన సిద్ధాదు లీ వ్రతమాచరించి ధన్యులై వైకుంఠమున నున్నవారు.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
పందొమ్మిదవ అధ్యాయము

---

# వింశోఽధ్యాయః

రాజోవాచ—

పునః కార్తికమాహాత్మ్యం వదస్వ మునిపుంగవ।
సర్వపాపప్రశమనం సర్వసౌభాగ్యకారణమ్॥ 1

జనకమహారాజు చాతుర్మాస్యవ్రతప్రభావమును వినినపిమ్మట వశిష్ఠునితో, గురూత్తమా! కార్తీకమాహాత్మ్యమునందింకను విశేషములున్నటుల తత్ప్రభావమే చెప్పుచున్నది. వినవలయుననను కుతూహలమును నధికమగుచున్నది. ఇంకను కొన్ని విశేషములు సెలవిండనెను.

వసిష్ఠః—

శృణు రాజన్ ప్రవక్ష్యామి మాహాత్మ్యం కార్తికస్య చ।
అగస్త్యస్యాత్రిణా ప్రోక్తం సంవాదం పరమాద్భుతమ్॥ 2

అపుడు వశిష్ఠుడు, జనకమహీపాలా! కార్తీకమాస మాహాత్మ్యమునుగూర్చి అగస్త్య మహర్షికిని, అత్రిమహర్షికిని, జరిగినకథ యొకటి కలదు. చెప్పెద నాలింపుము.

అత్రిః—

కార్తికస్య చ మాహాత్మ్యం శృణుష్వ మునిపుంగవ।
లోకత్రయోపకారాయ వక్ష్యామి హరిసత్కథామ్॥ 3

ఒకప్పు డగస్త్యమహర్షి అత్రిమహర్షింగాంచి, ఓ అత్రిమునీ! నీవు వాసుదేవుని యంశమున బుట్టితివి. కార్తీకమాహాత్మ్యమును నాకు విశదీకరింపుమనెను.

అగస్త్యః—

ధర్మం ధర్మభృతాం శ్రేష్ఠ వాసుదేవాంశసంభవ।
సద్ధర్మశ్రవణే కాలః కార్తికః కీర్తిత స్సకృత్॥ 4
బ్రూహి తం విస్తరాద్విప్ర శ్రోతుకామాయ సాంప్రతం।
సాధుసాధుమహాపుణ్య ప్రశ్నోఽయం పాపనాశనః। 5
త్వయా సముదభూత్సాధు వాసుదేవకథాశ్రయమ్।
తదహం తేఽభిధాస్యామి శృణు త్వం కుంభసంభవ॥ 6
న కార్తికసమో మాసో న శాస్త్రం నిగమాత్పరం।
నారోగ్యసమ ముత్థానం న దేవః కేశవాత్పరః॥ 7
స్నానం చ దీప దానం చ పూజనం చ మధుద్విషః।
కార్తిక వ్రతధర్మేణ నరః ప్రాప్నోతి కాంక్షితమ్ 8
విష్ణుభక్తే ర్వివేకార్థా యశఃకీర్తిఫలం కలా।

ఆపుర్ణశీర్ష్ణం చ విజ్ఞానం సర్వత్ర విజయప్రదమ్॥ 9
అత్రాప్యుదాహరంతీమ మితిహాసం పురాతనం।

అంత నత్రిమహర్షి, ఓకుంభసంభవా! నీ వడిగినప్రశ్న వాసుదేవుని కథాశ్రయమగుట నుత్తమమైనది. కార్తీకమాసముతో సమానమగు మాసమును, వేదతుల్యంబగు శాస్త్రమును, ఆరోగ్యసంపదకు సాటియగు సంపదయు లేవు. శ్రీమన్నారాయణునికంటె దేవుడు లేడు, ఏమానవుడైనను కార్తీకమాసమున నదీస్నాన మొనరించినను, శివకేశవాలయములందు దీపముంచినను, దీపదాన మొనర్చినను భగవంతుని పూజించుట వలనగలుగు ఫలితము నొందును. కలియుగమున సంపద్వివేకవినయంబుల నొసగునది హరిభక్తికంటె వేరొండు లేదు. ఇందునుగూర్చి పురాతనేతిహాస మొకటి కలదు. దానిని చెప్పెదను. సావధానచిత్తుండవై యాలింపుము.

పురా త్రేతాయుగే రాజా సూర్యవంశసముద్భవః। 10
అయోధ్యాధిపతి శ్శ్రీమాన్ పురంజయ ఇతి శ్రుతః।
స శశాస కియత్కాలం ధర్మసంచయసంశ్రయః॥ 11
ఐశ్వర్య వానయం నష్టమతి ర్దుష్టపరాక్రమః।
సర్వశస్త్రభృతాం శ్రేష్ఠ స్సత్యశౌచవివర్జితః॥ 12
దేవబ్రాహ్మణభోహర్తా ద్వేష్యో విప్రజనేషు చ।
లోభీ క్రూరమతి శ్శూర స్స్వర్ణస్తేయజనప్రియః॥ 13
ఏవ మంతరితే కాలే చాధర్మనిరతే నృపే।
తతస్సామంతరాజానః కాంభోజకురుజాదయః॥ 14
మిలిత్వాబహవో భూపా స్సర్వే తే హరివిక్రమాః।
నాగాశ్వరథపత్తిభి శ్చతురంగబలాన్వితాః॥ 15
అయోధ్యానగరీం ప్రాప్తాః పరితః పత్తనాద్బహిః।
శిబిరం పరితశ్చక్రు రైక్షవం మాక్షికా ఇవ॥ 16

పురంజయః పురా స్త్వార్ణం నిశ్చక్రామ బలాన్వితః।
తురంగతుంగమాతంగస్యందనై రభినంవృతః॥ 17
పురంజయాక్షరగుణం ధ్వజేనో త్తంభితం రథమ్।
దివ్యం దిగ్విజయం సూర్యదత్తశస్త్రాస్త్రపూరితమ్॥ 18
సురథాంగసమోపేతం స్యందనం వాజిపూజితం।
సమారుహ్య పరం శీఘ్రం ధృతబాణశరాసనః॥ 19
సమస్తబలసంయుక్తం సాఊశ్వేభరథసద్భటైః।
ప్రవివేశ పురద్వారాదమిత్రశిబిరాంగణమ్॥ 20
జగర్జ ఘనవ ద్విప్రకృతచాపగుణస్వనః।
భేరీతూర్యనినాదైశ్చ శంఖగోముఖకోటిభిః॥ 21

త్రేతాయుగమునందు పురంజయుడను నొకరాజు సూర్యవంశమున జనించెను. అత డయోధ్యానగరమును పాలింపుచుండెను. పురంజయుడు రాజ్యమునందు పట్టాభిషిక్తుడైన కొంతకాలమునకు సమస్త శాస్త్రంబుల నభ్యసించెను. దానివలన న్యాయముగను, ధర్మబద్ధముగను రాజ్యపాలన మొనరించువాడు. తరువాత గొంతకాలమునకు ధనమదాంధత చేతను, రాజ్యాధికార గర్వముచేతను జ్ఞానహీనుడై, దుష్టవిక్రముడై; దయాసత్య శౌచాది వర్జితుడై, దేవబ్రాహ్మణ క్షేత్రాదులను హరించి ధనాశాపరు డయ్యెను. అంతియేగాక మహాలోభియై దొంగతనములను, దోపిడులను జేయించుచు, చోరులకిష్టుడై, బహుక్రూరుడయ్యెను. కొంతకాల మీరీతి గడువగా నతనిదౌష్ట్యము నలుదిశలను బ్రాకెను. కాంభోజదేశాధిపతి మొదలగు కొందరురాజు లతని క్రూరత్వాది దుర్గుణముల నాలించి వీని కంటె బలపరాక్రమ సంపన్నులగుట చతురంగ సైన్యములతో వచ్చి యయోధ్యాపురమును ముట్టడింపదలచి నగరమునకు నాలుగుప్రక్కలను దండు లను విడియించి శిబిరంబుల నేర్పాటుచేసికొని యుండిరి. పురంజయుడు తనకంటె నా రాజులు బలవంతులని యెరిగియూ నించుకేని భీతినందక శస్త్రాస్త్రములతో నిండిన రథంబధిష్టించి చతురంగ సైన్యములతో యుద్ధ

సన్నద్ధుడై వారి నెదుర్కొని మేఘగర్జనములవంటి సింహనాదములు గావించుచు వారిపై బడెను.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
ఇరువదియవ అధ్యాయము

---

# ఏకవింశోఽధ్యాయః

అత్రిః —

యోద్ధుం ప్రత్యాగతం వీక్ష్య రాజానో రక్తలోచనాః।
శస్త్రైరస్త్రైశ్శరైశ్శార్ఙ్గ చ్యుతైస్తీక్ష్ణైశ్చ ముద్గరైః॥ 1
ముసుండిభిర్భిండివాలైః ఖడ్గైర్భల్లాతకైరపి।
పట్టసైర్ముసలైశ్శూలైశ్చక్రైస్తోమరయష్టిభిః॥ 2
కుంభైః కుఠారైర్లగుడైః క్షేపణైరాయుధాదిభిః।
యుయుధుస్తేమునేఽన్యోన్యం రణజ్ఞా బహవో నృపాః॥
తురంగాస్తురగైస్తద్వత్పాదినస్పాదిభిస్తథా।
కరిణః కరిభిస్తద్వత్ రథస్థాశ్చ రథాధిపైః।
శూరాః శూరైస్సాయుధైశ్చ ద్వంద్వయుద్ధం వితేనిరే।
భటాస్సంభర్త్సయన్తస్తే(?)ర మన్యోన్యం చ పరాక్రమైః
మునే కాంభోజరాజశ్చ స్యందనస్థోరువిక్రమః।
బధ్వా పరికరం గాఢం ధృత్వా స్వకవచం దృఢమ్॥ 6
కోలాహలధ్వనిం కుర్వన్ ధృతబాణశరాసనః।
బాణాన్విముంచన్నసదన్ రథేనైవాశుగామినా॥ 7
రాజ్ఞః పురంజయస్యాసౌ వక్షస్సమ్ముఖమాగతః।
ముమోచ బాణాంస్త్రిశతం కాంభోజస్స పురంజయమ్॥ 8

గత్వా తే ఛత్రదండం చ సముభిందన్ ధ్వజం రథం।
తతశ్చుకోప కాంభోజః శరైర్వివ్యాధ తం పునః॥ 9
పంచభి స్తీక్ష్ణధారాభి రంగప్రత్యంగ వేధిభిః।
తత్ర చాపవినిర్ముక్తాత్ బాహుసేనభుజోజితః 10
పురంజయస్యందనస్య వాజినోంగలయం యయుః।
పురంజయశ్చుకోపాశు మహేంద్ర ఇవ భూపతిః॥ 11
ఆస్ఫాలితభుజః కోపాత్ కృత్వా జ్యానినదం రుషా।
బ్రాహ్మ్యాం చ దశకం తీక్ష్ణం చాపే సంయోజ్యనజ్య చ।
ముమోచ వీరసేనస్య కాంభోజాధిప తేర్హృది।
తత్ర బాహుబలాధ్మాతా బాణాః పన్నగసన్నిభాః॥ 12
కాంభోజరాజప్రత్యంగం భిత్వాతద్ధృది శోభితం।
వపుః పశ్చాత్ప్రయోఘేషు నైవ నిర్గమనోత్సుకాః॥ 14
వక్షస్సు కీలితాన్ లబ్ధ్యా స్ఫలా దుత్పాట్యపాణినా।
తానేవ చాపే సంయోజ్య జన స్తం ప్రత్యువాచ హ॥15
త్వయోత్సృష్టం బాణపూగం తవ దాస్యే నృపాత్మజ।
సంగృహాణాశుగా నాశు న పారక్యప్రియా వయం॥ 16
ఇత్యుక్త్వా విససర్జాథ కాంభోజోథ పురంజయం।
ప్రత్యాగతశ్శరా స్తస్య సూతం చక్రధనుర్గుణమ్॥ 17
చిచ్ఛిదు ర్ధనుషో మధ్యం రథస్థ మధిసంగరే।
గృహీత్వాన్యధను ర్భూపో గాఢం దృఢగుణం మునే॥18
శరాసనే శరా న్యోజ్య కంకపత్రై రలంకృతాన్।
ఆకర్ణం తం సమాకృష్య కాంభోజం తు మహారుషా॥19
రాజన్ శూరోసి సంగ్రామే ధీరో భవ రణం కురు।
బాణానాం దశకం యస్మా దస్మదీయం త్వయా ర్పితమ్॥

న వేత్తి కుజనో లోకే అర్పణ స్యార్పణే విధిం।
అర్పయిష్యామి తే బాణవింశతిం చార్పణా త్త్వరా॥ 21
ఇత్యుక్త్వా విససర్జాసౌ కాంభోజం స పురంజయః।
చాపచ్యుతా శ్శరా స్తస్య న లక్ష్యోల్లంఘినో మునే॥ 22
కాంభోజకవచం కాయంభిత్త్వా దూరం వినిర్యయుః।
ఆసీ దాయోధనం ఘోరం తుములం రోమహర్షణం॥ 23
బాణై శ్చాపగుణోన్ముక్తై ర్భటై రుద్వేగకారిభిః।
నికృత్తభుజబాహ్వంఘ్రికంధరాః పేతు రద్భుతాః॥ 24
హాస్తినో గతహస్తా శ్చ వాజినో గతపుచ్ఛకాః।
పేతు ర్గతా స్తత్ర భిన్నగాత్రా శ్చైవ రణాంగణే॥ 25
తథాశ్చ బహవో భగ్నాః సచక్రాః సహవాజిభిః।
శరై రశని సంకాశై రన్యోన్యధనుషశ్చ్యుతైః॥ 26
కేచి న్నిబద్ధా బహవః శూరాః కృత్తోరుకంధరాః।
ధృతచాపో ధృతగుణో భటః పటుతరో రణే॥ 27
శరనిర్భిణ్ణసర్వాంగో ప్రాహోష్యం సుభటం యుధి।
నివర్తస్వ నివర్తస్వ తిష్ఠ తిష్ఠ మమాగ్రతః॥ 28
మామా పృష్ఠపదం త్వం హి కురు శూరోసి భోద్రుతం
ఆకర్ణ్య యోధగదితం నిష్ఠురం ప్రభటః పటుః 29
ధృతచాపోధ్ధృతగుణః కృతనారీఘునస్వనః।
ముంచన్ సింహధ్వనిం రోషా చ్ఛరసంధాన కౌతుకః॥
ముమోచ భట మాలక్ష్య తథా ప్రతిభటో మునే।
ఆదానే శరసంధానే చావర్తన నివర్తనే॥ 31
క్షస్థానాం సంశయో జాతః పాణిలాఘువచాపలం।
నిరంతరంచ బాణానాం వృష్టి రాసీ ద్రణాంగణే॥ 32

ఏవమన్యోన్యయోధానాం శూరాణాం చైవ సర్వశః।
స్వర్ణపుంఖాన్ శరాన్ తీక్ష్ణాన్ శాణోల్లీఢాన్ భటో భటమ్
నామాక్షరాంకితాన్ ముంచన్ అలక్ష్యాన్యోన్యమంజసా।
అర్ధచంద్రనిభై ర్బాణై ర్నారాచై రప్యయోముఖైః॥
ఖడ్గైశ్చ పట్టసైః కుంతైః వివ్యధుస్తే పరస్పరం।
నిహతా స్సాదిభిః కేచిత్సాదినో గజరక్షకైః॥ 35
పాశకై రథికై రుగ్రైః రథికైః పాదచారిభిః।
నికృత్తోరుభుజాదండచ్ఛిన్నా భిన్నాంగమస్తకాః॥ 36
అరుణాంబుజలస్రావా తత్రాఽభూ ద్రుధిరానదీ।
మేఘచ్ఛన్నాంతరిక్షస్థా దేవనార్యో బృహత్కుచాః॥ 37
మామకోఽయం మామకోఽయమితి జల్పంతి హై ముదే।
శూరా శ్శూరేణ నిహతా దివ్యాంబరవపుర్ధరాః॥ 38
దేవానీత విమానేన ప్రపద్యంతే సురాలయమ్।
సూర్యమండల భేత్తారో రణే చాపిముఖే హతాః॥ 39
స్తూయమానాప్సరోభి శ్చ సిద్ధగంధర్వసేవితాః।
సురనారీసమేతాశ్చ ప్రయాస్యంతి సురాలయమ్॥ 40
భూభుజై ర్బహుభిశ్శూరై స్సన్నద్ధై రణకోవిదైః।
కాంభోజప్రముఖై స్సర్వై ర్వరణరంగాభిమానిభిః॥ 41
బభూవ తుములం యుద్ధం దుష్కరం రోమహర్షణం।

ఈరీతిగా యుద్ధమునకు సిద్ధమైవచ్చిన పురంజయునకును, కాంభోజ భూపతి మొదలగు శత్రురాజులకును భయంకరయుద్ధము జరిగెను. ఆ రణరంగమున రథికుడు రథికునితోను, అశ్వసైనికుడశ్వసైనికునితోను, గజసైనికుడు గజసైనికునితోను, పదాతిసైనికుడు పదాతిసైనికునితోను, దల పడి శక్తితో మరపరకు పట్టసప్రాస గదాదులతో నొండొరులు ఢీకొని

సును, హీరహుంకారము గావించుచు, భేరీమృదంగధ్వనుల మ్రోయించుచు, శంఖధ్వనులచే సింహనాదముల గావించుచు ఘోరముగ నన్యోన్యవిజయా కాంక్షులై పోరిరి. ఆ రణభూమియందు విరిగిన రథంబుల ప్రోవులును, తొండంబులును, కాళ్ళుతెగి పర్వతరాశులవలె పడియున్న వేదండతుండంబులును, తలలు పాదములు, నూపురములు తెగి గుట్టలు గుట్టలుగ పడియున్న హయచయంబులును, మొలలు, తలలు, కాళ్ళు, కుస్తుకలు తుత్తునియలై మొత్తంబులుగ పడియున్న కాల్బలసైనిక నివహంబులును చూచు వారికి భయంకరములై హృదయములు ద్రయ్యోవట్లుండెను. అమ్మహాయుద్ధమున శూరత్వము జూపి, వీరత్వమును నెఱపి జంకు గొంకు లేక శోడివీరులతో దలపడి పోరాడి మరణించిన వీరు లెడతెరపిలేక సూర్యమండలమార్గంబున నూర్ధ్వలోకంబునకుబోవ నట నంతకుముందే వీరికై కాచియున్న యప్సరలు 'వీడు నావాడు; వీడు నావా' డని వరియింప వారిని దేవతలు విమానములపై స్వర్లోకమునకు గొంపోవుచుండిరి. నాటి సూర్యాస్తమయమువరకు పురంజయునకును కాంభోజాధిపతి మొదలగు రాజులకును భీకరసమరము వర్తిల్లెను.

పరాజితః పరం తత్ర సానుగస్సపురంజయః॥ 42
ప్రవివేశ పురం తూర్ణం దినాంతేఽస్తం గతే రవౌ।
రథభూమిం పరిత్యజ్య ప్రాపుః ప్రాంతే నృపాలకాః॥ 43
శిబిరప్రవరం చక్రుః పటమంటపరంజితం।
భూతప్రేతపిశాచైశ్చ భేతాళైర్జంబుకాదిభిః॥ 44
కంకైః కఠోరవదనైః రణభూమిర్వ్యరాజత।
త్రయోదశాక్షోహిణీభిర్యుక్తః కాంభోజవల్లభః॥ 45
క్రూరం యద్రణరంగాగ్రే హతమక్షౌహిణీత్రయం।
అచింతయదసౌ రాజా రణభంగం పురంజయః॥ 46
స్వస్యరాష్ట్రం సమాక్రాంత మమిత్రనరపాలకైః।
ఏవం చింతయతస్తస్య ప్రమ్లానాస్యస్య భూపతేః॥ 47

పురోహిత స్సుశీలాఖ్యః సర్వవిద్యావిశారదః।
పురంజయ మువాచేదం చింతాధిక్యాతలోచనమ్॥ 48

కాంభోజదేశాధిపతి మొదలగు వారిసైన్యము పురంజయుని సైన్యములో నాలవభాగమైనలేకుండెను. కాని వారు మిగుల పట్టుదలతో పోరాడి పదమూడక్షౌహిణులసంఖ్యగల సేనకధినాథుడగు పురంజయుని నోడించిరి. పురంజయుడపజయమునొంది తనగృహమునకు జేరెను. శత్రురాజులు తమ తమ గుడారములకుం జనిరి. మఱునాడు కాంభోజరాజు పురంజయుని రాజ్యమాక్రమించుకొనెను. పురంజయుడపజయమునకు దుఃఖాక్రాంతుడై, కళావిహీనుడై భవిష్యత్కార్యమేమాయనుచింతలో మునిగియుండెను. అప్పుడటకు పురంజయుని పురోహితుడగు సుశీలు డరుదెంచి పురంజయునితో నిట్లనెను.

జేతుం యదీచ్ఛసే రాజన్ అమిత్రనివహోన్నతాం।
వీరసేనస్య సేనాం చ సేవాయాం లాలసోభవ॥ 49

ఇదానీం కార్తికే మాసి పౌర్ణమీ పుణ్యసాధనీ।
ఊర్జే పూర్ణకలానాథదినే చాగ్న్యృక్ష్య సంయుతే॥ 50
హితం బ్రవీమి నృపతే తస్మాదప్యధికం తవ।
తత్కాలసంభవైః పుష్పైః కేశవం కార్తికేఽర్చయ॥ 51
దీపప్రజ్వాలనం విష్ణోర్దీపదానం నరేశ్వర।
నర్తనం కురు కృష్ణేతి గోవిందేత్యాలయే హరేః॥ 52
తవోపజాయతే సూనుస్సత్యం శంకరభాషణం।
రాదన్నేవం కృతేపుణ్యే కార్తికే కేశవప్రియే॥ 53
స్వభక్తరక్షణార్థాయ సర్వాపద్భ్యో జనార్దనః।
సుదర్శనం సహస్రాంశుం సంప్రేషయ దరం హరిః॥ 54
ఊర్జేఊర్జితపుణ్యానా మూర్జితం కో ను వర్ణయేత్।
భూపాపజయ ఆసీత్తే అధర్మాచరణాత్తవ॥ 55

అనువర్తస్వ సద్ధర్మం బ్రహ్మణో భవ సర్వదా।
విష్ణుభక్తోభవ నృప కార్తికోక్తం వ్రతం చర॥ 56
కార్తికవ్రతశీలానామాయురారోగ్యసంపదః।
పుత్రలాభః కోశవృద్ధిః సర్వత్ర విజయోఽనిశమ్॥ 57
సత్యం భవతి రాజేంద్ర తత్కురుష్వావిలంబనమ్।

మహారాజా! జయాపజయంబులు దైవాధీనంబులని యెఱింగియు మీరు చింతాక్రాంతులు కానేల? మీకు శత్రురాజులను మరల యుద్ధమున జయించు తలంపుకలదేని నామాట నొకదాని నాలింపుము. నీవు కార్తీకమాసమున కృత్తికానక్షత్రముతోగూడిన పూర్ణిమనాడు శ్రీమన్నారాయణు నతిభక్తితో పూజింపుము. విష్ణ్వాలయమున దీపములను వెలిగించి యొకదీపదానము జేయుము. భగవన్నామస్మరణచేయుచు నాట్యమొనర్పుము. ఇట్లొనరించిన నీకు పుత్రప్రాప్తియగును. అంతియేగాక నాదినమున శ్రీహరిని పూజింపుము. దాని కాదేవుడు సంతసించి శత్రుసంహారణార్థము చక్రాయుధమంపును. నీవు ధర్మవర్తనను త్యజించినందువలన నపజయ మందితివి. ఇకనైన న్యాయపదతిని ధర్మము నాచరింపుము. కార్తీకవ్రత మొనరింపుము. ఆవ్రతముచేసిన ఆయురారోగ్యభాగ్యములు కలుగును. వంశమభివృద్ధినందును. శత్రువులు సమూలముగ నశింతురు.

స్కాందపురాణమందలి కార్తీక మాహాత్మ్యములోని యిరువదియొకటవ అధ్యాయము.

---

# ద్వావింశోఽధ్యాయః

అత్రిః—

సుశీలస్య వచశ్శ్రుత్వా రాజా హృష్టమనా మునే।
హరేర్దేవాలయం గత్వా కార్తికేభ్యర్చ్య కేశవమ్॥ 1

ఉపచారైః షోడశభిః ప్రసూనఫలపల్లవైః।
ప్రదక్షిణనమస్కారై ర్నటచర్యాదిభిః క్రమాత్॥ 2
అభ్యర్చ్య ప్రతిమాం రాహీంస్వామి రూపానుయాయినీం
ప్రదక్షిణ నమస్కారై స్సహితః కృతదర్శనః॥ 3
ఏవం సంపూజ్య గోవింద మూర్జే పూర్ణే కళాధరే।
నిర్గతో నిశి రాజర్షి ర్హస్తే నక్షత్రమండలే॥ 4
గోవిందభృత్యైః ప్రత్యాగాత్ ప్రస్ఫురత్సూర్యమండలే।
గోవిందకృతధీ స్సమ్యక్ యోద్ధుం విప్రపురంజయః॥ 5
ఆరూఢస్స్యందనో ధన్వీ ఖడ్గతూణీ ధనుర్జయీ।
కంఠలంబితసంలగ్నతులసీస్రగ్విశోభితః॥ 6
ప్రస్ఫురద్బాహుయుగ్మే తు కంచుకాంకిత మస్తకః।
ప్రయాణమకరోదాశు పురంజయ జయప్రదమ్॥ 7
బహిః పురంజయపురాన్నారీ కేంకారమద్భుతం।
ఆకర్ణ్యాస్యబలం యాత మాలోక్యాభ్యాయయుర్నృపాః
ముంచన్తో బాణవర్షం చ గర్జంత స్సింహగర్జనం।
పేతుః పురంజయబలే మత్తభావేన భూమిపం॥ 9
చక్రుర్యుద్ధం మహాఘోరం నిఘ్నంత స్తే పరస్పరం।
బాణై రశనిసంకాశైః ఖడ్గైర్వజ్రాయుధోపమైః॥ 10
గజై రైరావతై ర్వాజిభిర్వైగగనగామిభిః।
స్యందనై రాశుగమనై రన్యోన్యజయకాంక్షిభిః। 11
బభూవతుములం యుద్ధ మత్యంతం రోమహర్షణం॥
కాంభోజప్రముఖాస్సర్వే రాజానో యుద్ధదుర్మదాః॥ 12
గతవాహా గతగజాః గతబాణశరాసనాః।

ప్రవిశీర్ణతనుత్రాణా విద్ధదేహాంఘ్రిమస్తకాః॥ 13
వినష్టరథపాదాది గజాశ్వాయుధయూథపాః।

మరల నత్రిమహర్షి యగస్త్యున కిట్లనెను. పురంజయుడు సుశీలుని యుపదేశ ప్రకారము కార్తీకమాసమున దేవాలయంబున కరిగి శ్రీమన్నారాయణునకు షోడశోపచారములుచేసి; యర్చించి, హరికీర్తనలబాడి, నాట్యమొనర్చి, సాష్టాంగనమస్కారములొనర్చి యారాత్రి యంతయు నందేయుండి భగవంతుని ధ్యానింపుచు జాగరణ మొనర్చెను భగవంతుం డాతని భక్తికెంతయు మెచ్చెను. పురంజయుడు మరునా డుదయమున స్వగృహంబున కరిగెను. ఆసమయమున విష్ణుభక్తుండగు నొక బ్రాహ్మణుడు మెడనిండ తులసిదండలను ధరించి పురంజయుడున్న తావునకు వచ్చెను. ఓపురంజయా! నీవు వెంటనే సైన్యముతోబోయి శత్రువుల నడ్డగింపుమని చెప్పెను అతడెవ్వడో మహానుభావుడని యెంచిన పురంజయుడు తనకున్న స్వల్పసైన్యమును దీసికొని ధనుర్బాణ తూణీరాదిసాధనములను గైకొని రథంబుపైనెక్కి, యుద్ధసన్నద్ధుడయ్యెను. శత్రురాజులతనింగన మరల యుద్ధమునకు డీకొనిరి. ఉభయసైన్యములును వివిధాయుధంబులతో దలపడి ఘోరముగ పోరుచుండిరి. ఆయుభయపక్షములవారికిని ఇంద్రగజతుల్యంబులగు నేనుగులును, వాయువేగమును మించిన వేగముగల యుత్తమాశ్వములును, పడిగానడచు రథంబులును, మహావీరులయిన పదాతిసైనికు లుండుటచే నన్యోన్యజయకాంక్షతో బోరాడిరి.

పురంజయభటైస్సార్థం త్రాహి త్రాహీతి వాదిసః॥ 14
కాంభోజశ్చ బలం భగ్నమాలోక్యాత్మపరాజయం।
పురంజయజయప్రాప్తిం మత్వా రాజా నరాధిప॥ 15
స్వసహాయబలై స్సైన్యైః పలాయనపరాయణాః।
రాజా స్వాత్మపురం ప్రాప కాంభోజో భగ్నసంగరః॥
పురంజయోఽజయత్సర్వాన్ జయలక్ష్మీకటాక్షితః।
అరిర్మిత్రం భవేచ్చైవ అధర్మోధర్మతాం వ్రజేత్॥ 17
అనుకూలే జగన్నాథే విపరీతే విపర్యయః।

కార్తికోక్తవ్రతం కుర్వన్ కేశవం క్లేశనాశనం।
శరణ్యం శరణం గత్వా సర్వాపద్భ్యః సుఖం వ్రజేత్।
విష్ణుభక్తో మహాన్ జేతా సత్య మత్యంతదుర్లభం॥ 19
తత్రాపి దుర్లభం మన్యే కార్తికోక్తవ్రతే న నః।
కించ గోవిందభక్తా యే కార్తికవ్రతనిష్ఠితాః॥ 20
జ్ఞేయా స్తేవైష్ణవా శ్శుద్ధాఃకలౌ ధర్మవిచక్షణైః।
కార్తికవ్రతవేత్తారో నారాయణపరాయణాః॥ 21
అపి శూద్రాదయో వాపి జ్ఞేయా స్తే వైష్ణవో త్తమాః।
అపి ద్విజాతయో హ్యన్యే న చ భక్తా అధోక్షజే। 22
త ఏవ శూద్రతుల్యా శ్చ వేదాఢ్యా అపి కుంభజ।
వేదాభ్యాసీ విష్ణుభక్తః కార్తికవ్రతతత్పరః॥ 23
సఏవవైష్ణవశ్రేష్ఠః తస్మి న్నివసతే హరిః।
సంసారం దుస్తరం ఘోరం తర్తు మిచ్ఛతి యో నరః॥
యో వా కో వాఽపి జాతీయః స విష్ణౌ భక్తిమాన్ భవేత్
సంసారాబ్ధేర్మనే నూనం తారయిష్యతి తత్ క్షణాత్॥
కిం వర్ణయామి విప్రేంద్రహరిభక్తిపరాక్రమం।
పరాశరప్రభృతయో వసిష్ఠాద్యామహర్షయః॥ 26
అంబరీషాదయో భూపా స్తథైవ సచరాదయః।
భక్తి మేవ హరేర్నిత్య మాశ్రిత్యాయుః పరాంగతిమ్॥
తద్విష్ణో ర్భక్తిమా న్విప్రః సుభక్త్యాన్వితసువ్రతః
స్వతంత్రోఽప్యస్వతంత్ర శ్చ విష్ణుపూజాపరో భవేత్।
భక్తప్రియో హరిర్నిత్యంయేభక్తాశ్చ హరిప్రియాః।
స్వభక్తరక్షణం కుర్వ న్నిహాముత్ర సుఖప్రదః॥ 29

కాంభోజనృపాలుడు మొదలగువా రందరు నపజయమంది, పురంజయా! రక్షింపుము; రక్షింపుమని దీనవదనులై పలుకుచు భయపడి పారిపోయిరి. పురంజయుడు జయలక్ష్మినందెను. శ్రీహరి కృపాకటాక్ష వీక్షణమునకు పాత్రుడైనవానికి శత్రువు మిత్రుడగును. విషభక్షణ మొనర్చినను నమృతప్రాయమే యగును. అధర్మ మొనర్చినను ధర్మమే ప్రబలును. దైవానుగ్రహము లేనివానికి మిత్రులే శత్రులగును, ధర్మమే యధర్మముగను మారును. కార్తీకమాసమున శ్రీమన్నారాయణ ప్రీతికై కార్తీకవ్రత మొనరించి యతనిని శరణు నొందెనేని సర్వవిపత్తులు నాశనమగును. సౌఖ్యములన్ని సమకూడును. విష్ణుభక్తి జనించుటయే దుర్లభము. అందు విష్ణుభక్తి గలిగి కార్తీకవ్రతము చేయుట దానికంటె దుస్సాధ్యము. విష్ణుభక్తిగలిగి శ్రద్ధతో నావ్రతమాచరించినవారేజాతివారైనను ధర్మస్వరూపుడగు పవిత్ర వైష్ణవుడనబడును. బ్రాహ్మణజన్మమెత్తి వేదములను పఠించి హరిభక్తి శూన్యుడైనవాడు శూద్రతుల్యుడే. వేదాధ్యయన మొనరించి విష్ణుభక్తికలవాడై కార్తీకవ్రతానుష్ఠానతత్పరుడైనవాడు వైష్ణవోత్తముడు. వాని హృదయపద్మమున భగవానుడుండును. సంసారసాగర ముత్తరించుటకు విష్ణుభక్తియే ముఖ్యసాధనము. జాతిమతభేదములతో నిమిత్తము లేదు. విష్ణుభక్తి ప్రభావము వర్ణనాతీతము. వ్యాసాంబరీషశుకశౌనకాది మహర్షులును, అంబరీష సగరాది రాజులును విష్ణుభక్తివలననే స్థిరముక్తి నందిరి. శ్రీహరి భక్తితత్పరుడు, శక్తిలేనివాడైన తనద్రవ్యమును వ్యయించి యితరులచే శ్రీహరిసంసేవనము జేయింపవచ్చును. శ్రీహరిభక్తులకును భక్తులు శ్రీహరికి నన్యోన్యప్రియతములు. భక్తరక్షకుడగు నాదినారాయణుండు తనభక్తులకు సర్వదా సుఖసంపదలనొసంగి కాపాడుచుండును.

ఆస్తే సర్వత్ర భగవాన్ విష్ణుర్విశ్వామరేశ్వరః।
యద్భక్తియోగయుక్తస్య వైష్ణవస్య పరాత్మనః॥ 30
కార్తికస్య వ్రతం మన్యే సులభం మునిసత్తమ।
న కార్తికసమం లోకే న విష్ణుసదృశో విభుః॥ 31
న సూర్యసదృశ స్తేజో నాశ్వత్థసదృశో ద్రుమః।
తస్మాత్కార్తికమాసస్య వ్రత మిష్టార్థదాయకమ్॥ 32

సర్వోత్తమోత్తమం విప్ర మయా తే త్వనుకీర్తితం।
సర్వగుహ్యతమం శాస్త్రం సర్వవేదేషు సమ్మతమ్॥ 33
య ఇదం శృణుయాన్నిత్య మధ్యాయం కార్తికస్య చ।
స ముక్తపాపక స్సద్యో దేహాంతే యాతి మాధవమ్॥ 34
యః శ్రాద్ధకాలే పఠతి కార్తికవ్రతవైభవం।
పితర స్తృప్తి మాయాంతి హ్యేకకల్పం మునిసత్తమ॥ 35

ఆ శ్రీమన్నారాయణుడు సర్వాంతర్యామి. సూర్యదేవునితో సాటి వచ్చు తేజస్సంపన్నుడును, విష్ణువకు సముడైన దేవుడును, రావిచెట్టుతో తుల్యమైన చెట్టునులేవు. ఓకుంభసంభవా! వేదవేదాంత ప్రతిపాదకము, వేదసమ్మతము. వేదచోదితము, సర్వోత్తమము, సర్వగుహ్యమునైన కార్తీక వ్రతప్రభావమును నీకు జెప్పితిని. ఎవ్వడు దీనిని ప్రతిదినము శ్రద్ధాభక్తులతో పఠించునో, ఎవడు వినునో వాడు తరించును. పితృతిథు లందు, బ్రాహ్మణభోజనసమయమున కార్తీకమాహాత్మ్యమును పఠించినను, వానిపితృదేవతలు సంతృప్తి నందుదురు,

స్కాందపురాణమందలి కార్తీకమాహాత్మ్యములోని
యిరువది రెండవ యధ్యాయము

---

# త్రయోవింశో ఽధ్యాయః

అగస్త్యః—

అత్రేః పురంజయః పశ్చాజ్జయశీలో మహామనాః।
కి మాచరతి ధర్మజ్ఞ తన్మే కథయ సాంప్రతమ్॥ 1

అగస్త్యమహర్షి మరల నత్రిమునీంద్రుని గాంచి, ఓమునితిలకా! పురంజయుడట్లు జయశీలుడైన పిదప నేమిచేసెనో నా కెరిగింపుమనెను.

అత్రిః—

అయోధ్యానగరే రమ్యే తదా విగతకంటకే।
తస్మిన్ పురంజయో రాజా సహస్రాక్షపరాక్రమః॥ 2
సర్వశస్త్రభృతాం శ్రేష్ఠస్సత్యవాదీ సదా శుచిః।
దాతా భోక్తా ప్రియం వక్తా రూపవా నమితద్యుతిః॥ 3
సర్వేషామేవయజ్ఞానాం యష్టాఽసౌ బ్రాహ్మణప్రియః
ధనుర్వేదే చ వేదేచ శాస్త్రే చ నిపుణః కృతీ॥ 4
నారీరత్నప్రియో నిత్యం పౌర్ణమాసీందువజ్జనైః।
మార్తాండ ఇవ దుష్ప్రేక్ష్య శ్శత్రుమండలశిక్షకః॥ 5
వైష్ణవస్సత్వసంపన్నో జితషడ్వర్గకో నృపః।
కార్తికవ్రతధర్మేణ నిర్దగ్ధాకృతకల్మషః॥ 6

అంత నత్రిమహాముని, ఓఅగస్త్యమహర్షీ! పురంజయుడు కార్తీక వ్రతాచరణ ప్రభావమున నసమాన విక్రమోపేతుడై, అగ్నిశేషము, ఋణశేషము, శత్రుశేషము నుంచకూడదని యెఱింగిన వాడగుట నిశ్శేషముగ శత్రువులను జయించి నిష్కంటకముగా నయోధ్య నేలుచుండెను. అతడు విష్ణుభక్తివలన ధర్మాత్ములలో నగ్రగణ్యుడు, పవిత్రుడు, సత్యదీక్షాతత్పరుడు, నిరతాన్న ప్రదాత, భోక్త, ప్రియవాది, మహాతేజోవంతుడు, రూపవంతుడు, బ్రాహ్మణప్రియుడు, భూతదయాతత్పరుడు, వేదవేదాంగవేత్తయునై యుండెను. మఱియు ననేకక్రతువుల నాచరించెను. ప్రజలందరకును రాకాశశాంకునిభాతి నాహ్లాదకరుడయ్యెను. మధ్యందిన మార్తాండుని పగిది నత్యంత తేజస్వియై శత్రుభీకరుడయ్యెను. ఏకపత్నీవ్రతనిష్ఠుడని కీర్తినొందెను. కార్తీకవ్రతప్రభావమువలన నిఖిలపాపములు పోయినవాడగుటయే గాక నరిషడ్వర్గమునుగూడ జయించినవాడయ్యెను. వేయేల? అతడిప్పుడు విష్ణుభక్తాగ్రేసరుడు, సదాచారతత్పరులలో నుత్తముడు నయ్యెను.

తస్య బుద్ధిః సముత్పన్నా విష్ణోరారాధనే మునే।
కథమారాధయిష్యామి దేవదేవం జనార్దనమ్॥ 7

కస్మిన్ దేశే తథా మాసి కస్మిన్ క్షేత్రే సుఖప్రదే।
చింతాసంయుక్తమనసం నృపం ప్రాహాశరీరవాక్।
కావేరీం గచ్ఛ భో భద్ర కార్తిక్యాం కమలాపతిం।
శ్రీరంగాఖ్యం పరం ధామ వైకుంఠం రంగమందిరం॥ 9
తమారాధయ గోవిందం భక్తకాంతం భవచ్ఛిదం।
ఇత్యుక్త్వా విరరామాథ శ్రుత్వా తద్గిరమాదరాత్॥ 10
హిత్వాఽయోధ్యాం యయౌరాజా కావేరీమధ్యవర్తినం
నాగాశ్వరథపత్తిభిఃసహితస్స్వాత్మనోఽనుగైః॥ 11
క్షేత్రణ్యాలోకయన్యాతి తీర్థాన్యాయతనాని చ।
కావేరీమధ్యనిలయం భుజగాభోగశాయినమ్॥ 12
ఊర్జే మాసి సపర్యాం చ విధివద్వ్యోమమంగళం।
మాస మేకం వ్రతం చక్రే చక్రాబ్జాంక భుజద్వయమ్॥

ఒకప్పుడా పురంజయునకు హరిపూజాతత్పరత యధికమై నే నేదేశమున, ఏకాలమున, ఏక్షేత్రమున, ఏమాసమున, ఏవిధానమున శ్రీహరినర్చించి కృతార్థుడగుదు నాయని బహుచింతాక్రాంతుడైయుండ నశరీరవాణి యిట్లు పలికెను. ఓపురంజయా! కావేరీనదీతీరముననున్న శ్రీరంగక్షేత్రము రంగమందిరము. రెండవ వైకుంఠము. నీవచటికేగి శ్రీరంగనాథస్వామి నర్చింపుము. నీవు సంసారసాగరోత్తరణము నా మహానుభావుడు సిద్ధింపజేయునని వాక్రుచ్చెను. నిరంతర హరిపాదసరోజచింతనాసక్తుడైన పురంజయుడు రాజ్యభారమును సచివులపైనిడి, సపరివారముగ నాతే పయనమై మార్గమధ్యముననున్న క్షేత్రములను దర్శించుచు పుణ్యతీర్థములందు గ్రుంకులిడుచు, దేవాగారములకరిగి నమస్కరింపుచు కతిపయప్రయాణంబులలో శ్రీరంగక్షేత్రమునకు జేరెను అట నుభయకావేరీ మధ్యప్రదేశమున శేషశయ్యపై పవ్వళించియుండి భక్తుల కఖిలశుభముల చేకూర్చుచు, రక్షకుడై యుండిన శ్రీరంగనాథస్వామిని దర్శించి, సాష్టాంగ నమస్కారమొనర్చి, కార్తీకమాసమంతయు నందేయుండి కార్తీకవ్రతమును శాస్త్రోక్తముగ నాచరించెను,

గాయ న్కృష్ణేతి కృష్ణేతి గోవిందేతి నిరంతరం।
వాసుదేవే త్యనంతేతి ప్రభుర్వన్ వైష్ణవాగ్రణీః॥ 14
స్నానం దానం జపో హోమః దేవతా ప్రోక్షణం, తథా।
భక్త్యా చారాధ్య విధివత్ ప్రసన్నం నాగశాయినమ్ 15
మాసాంతే మునిశార్దూల వ్రతపూర్తిం విధాయ చ।
తతో వ్యావర్త ద్రాజా స్వాం పురీం వైష్ణవసత్తమః।

భక్తాగ్రగణ్యుడగు నాపురంజయుడు సదా, 'దామోదర-దామోదర, గోవింద-గోవింద, కృష్ణ-కృష్ణ, వాసుదేవ. అనంత, అచ్యుత, ముకుంద, మురారే, మాధవ, రమాధవ, నారాయణ, భక్తవత్సల, పుండరీకాక్ష, పురాణపురుష, హృషీకేశ, విష్టరశ్రవా, కేశవా, ద్రౌపదీమానసంరక్షక, భక్తరక్షక, పార్థసారథే, ప్రహ్లాదవరద, గరుడధ్వజ, కరివరద' అని భగవన్నామోచ్చారణ జేయుచు శ్రీరంగని నారాధించుచు మాసాంతమున వ్రతసమాప్తి యొనరించి యయోధ్యానగరమున కత్యంత ముదావహుడై యరుదెంచెను.

ఆలోకయన్నయో సమ్యక్ స్వరాష్ట్రంచ సమృద్ధిమత్।
అయోధ్యా నామ నగరీ సర్వరాష్ట్రైరలంకృతా॥ 17
హృష్టపుష్టజనాకీర్ణా దృఢప్రాకారతోరణా।
దృఢయంత్రార్గళ ద్వాపరిఖాభిరలంకృతా। 18
హస్త్యశ్వరథసంపూర్ణా రథిబృందసమాకులా।
గృహగోపురసంస్థాభిర్వీథీభిస్సమ లంకృతా॥ 19
నానావర్ణపతాకైశ్చ చలద్భిర్మందవాయునా।
నానాయోధజనాకీర్ణా నానాజనపదైర్వృతా। 20
జ్ఞాతారః సర్వశాస్త్రాణాం భేత్తారః శత్రువాహినీం।
దాతారః సర్వరత్నానాం భోక్తారః సర్వసంపదామ్॥ 21
స్త్రియ స్తత్ర మునిశ్రేష్ఠదృశ్యంతే సుమనోహరాః।

హంసవారణగామిన్యః కర్ణాంతాయతలోచనాః॥ 22
పృథుశ్రోణ్యః కృశోదర్యః పీనోన్నతపయోధరాః।
సువస్త్రాభరణోపేతా స్సర్వాలంకారభూషితాః॥ 23
వారముఖ్యాశ్చ దృశ్యంతే గీతనృత్తవిశారదాః।
రూపలావణ్యసంయుక్తాః సర్వాః ప్రముదితా స్సదా॥ 24
క్రీడంత్యశ్చ మదోన్మత్తాః చత్వరేషు సభాసు చ।
ప్రేక్షణాలాపకౌశలాః సర్వయోషిద్గుణాన్వితాః 25
అన్యాశ్చ తత్ర దృశ్యంతే గుణాఢ్యాశ్చ కులస్త్రియః
సర్వాభరణసంపన్నాః పాతివ్రత్యపరాయణాః। 26
స్వస్వధర్మరతా స్సర్వే తత్తద్వర్ణాశ్రితాజనాః।
పురం ప్రతీక్ష్య తద్రాజా ముమోద మునిపుంగవ॥ 27

అతఁడొనర్చిన కార్తికవ్రతప్రభావమున నతని రాజ్యములోని ప్రజలందరును ధనధాన్యసంపదలతో, పాడిపంటలతో, నిత్యసంతోషముతో, ఆయురారోగ్యములతో, భోగములతో తులతూగుచుండిరి. నాటిరాజ్యములలోకెల్ల నయోధ్యారాజ్య మన్నివిధంబులచేతను నగ్రగణ్యతనందెను. అయోధ్యానగరము దృఢతరప్రాకారములతో, తోరణయంత్రద్వారములతో, రమణీయగృహగోపురారామములతో, చతురంగసైన్యబలముతో, తీర్చి దిద్దికట్టిన వీథులతో నున్నతసౌధములతో నత్యంతరమణీయమై యొప్పుచుండెను. అయోధ్యానగరమందలి జోదులు వివిధయుద్ధవిశారదులై, రాజనీతి చతురులై, వైరగర్వనిర్భేదకులై నిరంతరవిజయశీలురై తేజరిల్లుచుండిరి. అన్నగరమందలి యంగనామణులు, హంసగజగామినీత్వము, పద్మపత్రాయత విశాలాక్షీత్వము, విపులశ్రోణిత్వము, విశాలకటీత్వము, సూక్ష్మమధ్యత్వము, పీనకుచత్వముగలిగి రూపవతులని, శీలవతులని, గుణవతులని, విద్యావతులని ఖ్యాతినందియుండిరి. అన్నగరమందలి వెలయాండ్రు నృత్యగీతాగానవిశారదలై, ప్రౌఢలై, వయోగుణరూపలావణ్యసంపన్నలై, సదాచిద్విలాసాలంకృతముఖసరోరుహలైయుండిరి. మరియు నృత్తనమందలి కులాంగనలు పతిశుశ్రూషాపరాయణలై, సద్గుణాలంకార

భూషితలై, సాధ్వీలలామలైయుండిరి. అట్టి తనరాజధానింగాంచి పురంజయుడు పరమహర్షోల్లసిత పులకితగాత్రుడయ్యెను.

ప్రత్యాగతం నృపం పౌరాః ప్రత్యుద్యయురనేకశః।
లాజై రవాకిరన్ సర్వై ర్నృపతిం కుసుమాదిభిః॥ 28
ప్రవిశ్య పట్టణం రాజా స్వాంతఃపుర ముపాగమత్।
ప్రశశాస ముదా రాజః సుధర్మేణ వసుంధరామ్॥ 29
పుత్రపౌత్రసమాయుక్తః సర్వభాగ్యసమృద్ధిమాన్।
పురంజయాఖ్యః పుత్రేచ రాజ్యభారం నివేశ్య చ॥ 30
కాంతారవాస మకరోత్ కాంతాభి స్స పురంజయః।
వైష్ణవం యోగమాసాద్య కార్తిక వ్రతనైష్ఠికః।
తత్రైవ మునిశార్దూల విష్ణులోక మవాప్తవాన్।
అగస్త్య కార్తికః పుణ్య స్సర్వేష్టార్థప్రదాయకః॥ 32
కార్తికధర్మా స్సులభాః కేశవస్య ప్రియావహాః।
అవశేనాపి యః కృత్వా స యాతి పరమాం గతిమ్॥ 33
సర్వసౌఖ్యప్రదం పుణ్య మవశ్యం కలినాశనం।
కార్తికస్య వ్రతమిద మకృత్వా యాత్యశోభనమ్॥ 34
యః శృణోతీద మధ్యాయం విష్ణుభక్త శ్శుచివ్రతః।
నిర్ధూయపాతకం సర్వం స యాతి పరమాం గతిమ్॥ 35

ఈరీతిగా శ్రీరంగక్షేత్రమున కార్తీకవ్రతమాచరించి సుఖియై వచ్చిన తమ ప్రభువును పౌరజను లెదుర్కొని మంగళవాద్యతూర్యధ్వనులతో నూరేగించి నిజాంతఃపురమున ప్రవేశపెట్టిరి. అతడు నిరంతర ధర్మాభిలాషియై రాజ్యపాలన మొనరుచుచు కొంతకాలముగడపి వృద్ధుడగుటవలనను; ఐహిక వాంఛను త్యజించినవాడగుటను కుమారుని రాజ్యమునకు పట్టముగట్టి వానప్రస్థాశ్రమవ్రతాసక్తుడై వనములకరిగెను. అత డా వానప్రస్థాశ్రమమందుగూడ నేటేట విధివిధానమున కార్తీకవ్రతమాచరించుచు కాలక్రమమున మరణించి వైకుంఠ నివాసుడయ్యెను. ఓయగస్త్యా!

కార్తీకవ్రత మత్యంతఫలప్రదము. విష్ణుప్రీతికరము. ప్రతివారును సుల
భముగా జేయ నవకాశమున్నది. ఈవ్రతమును జేసినవారును, దీనిని చది
వినవారును, చదువునపుడు వినువారును వైకుంఠవాసులగుదురు.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
ఇరువదిమూడవ అధ్యాయము

---

# చతుర్వింశోఽధ్యాయః

అత్రిః—

కార్తికస్య వ్రతమిదం శ్రోతుకామాయ తేఽనఘ।
కథయామి కథాం పుణ్యాం వైష్ణవీం చ సుఖప్రదామ్॥ 1
శృణు త్వం సావధానేన శ్రవణా దఘనాశనం।
యస్యాస్త్వాస్తిక్యధీ ర్విప్ర కార్తికస్య హరే ర్వ్రతే॥ 2
ఊర్జేఽగస్త్యాతిఫలదా ద్వాదశీ హరిబోధిదీ।
యత్ఫలం సర్వతీర్థేభ్యో యత్ఫలం ద్వాదశీ తథా।
యత్ఫలం సర్వయజ్ఞేభ్య స్తదసౌ హరిబోధినీ।
భక్తిర్భవతి గోవిందే ఏకాదశ్యాం తథైవ చ॥ 5
తస్మాదాధిక్యఫలదా ద్వాదశీ విష్ణువల్లభా।
సూర్యేందు గ్రహణాధిక్యా ఏకాదశ్యాశ్శతాధికా॥ 5
సమస్తపుణ్యఫలదా ద్వాదశీ విష్ణువల్లభా।
ద్వాదశ్యాం యత్కృతం పుణ్యం తత్కోటిగుణితం భవేత్
యది స్వల్పా భవేత్పుణ్యా ద్వాదశీపారణోచితా।
త్యాగానర్హా విద్యమానా సర్వేషామపి దేహినామ్॥ 7
వ్రతాన్యన్యాని సంత్యజ్య ద్వాదశీ లేశమస్తిచేత్।

ద్వాదశ్యాం పారణం కార్యం న త్యజేత్పుణ్యకాంక్షిణః॥
ఏకాదశ్యా ముపోష్యాథ ద్వాదశ్యాం పారణం భవేత్।
ద్వాదశ్యాం విద్యమానాయాం పారణాహాని సర్వదా॥ 9

అత్రిమహాముని మరల యగస్త్యునితో ఓకుంభసంభవా! కార్తిక వ్రతప్రభావ మెంత చెప్పినను, ఎంతవినినను తనివితీరదు. గాన నింకను జెప్పుచున్నాను. గంగానది మొదలగు మహానదులలో స్నానము చేసినందు వలనను, సూర్యచంద్ర గ్రహణసమయములందు స్నానదానము లొనర్చినందు వలనను గలుగు ఫలము శ్రీమన్నారాయణుని నిజతత్త్వమును దెలిపెడి కార్తికవ్రతమును శుద్ధద్వాదశినాడు భక్తిశ్రద్ధలతో, స్వల్పదానధర్మములతో వ్రతము నొనరించినను సిద్ధించును. ఆద్వాదశినాడుచేసిన సత్కార్యమితరకాలమునం దొనర్చినకార్యములకంటె కోటిరెట్లు ఫలమిచ్చును. ఆద్వాదశీవ్రతము చేయువిధాన మెట్టిదో చెప్పుచుంటిని వినుము. కార్తిక శుద్ధ దశమిదినమున నొకమారు మాత్రమే భోజనముచేసి ఏకాదశినాడు శుష్కోపవాసముండి ద్వాదశినా డితరవ్రతములుగాని, కార్యములుగాని చేయకుండ ద్వాదశిఘడియలలో భుజింపవలయును.

ఇదం జానన్ పురా విప్ర అంబరీషాభిధో నృపః।
మహాభాగవతో నైవ ద్వాదశీం పారణే జహౌ। 10
ఉపోష్యైకాదశీం పుణ్యా మంబరీషోనృపోత్తమః।
విజ్ఞాయ ద్వాదశీమల్పాం పారణం కర్తు ముద్యతః॥ 11
తం యయాచే ముని ర్విప్రః దూర్వాసో మునిసత్తమః।
ఆతిథ్యవ్యపదేశేన పారణా హారిపుణ్యదా॥ 12
నృపేణోక్త స్తథాహీంతి అంగీకృత్య చ పారణం।
ద్వాదశీపారణార్థం తు కార్తికే మునిసత్తమః॥ 13
అనుష్ఠానాయ గతవాన్ అంగీకృత్య చ పారణం।
తస్మిన్ దినే భవే త్స్వల్పాద్వాదశీ పారణోచితా॥ 14
అంబరీష స్తురాజర్షి స్సంకటే సముపస్థితే।

ఇదం విచారయామాస హరిభక్తోఽతిచింతితః॥ 15
బ్రాహ్మణ స్తావసశ్రేష్ఠః పారణార్థం నిమంత్రితః।
మయా నచాగత స్సోఽపి ద్వాదశీ చాతివర్తతే॥ 16
ద్వాదశ్యతిక్రమోఽధర్మః సత్యం నిత్యంకథం భవేత్।
బ్రాహ్మణా ద్భోజనం పూర్వ మధర్మో గృహమేధినః॥17
బ్రాహ్మణోవహ్ని సదృశః కుపితః పూర్వ భోజనాత్।
శాపం దద్యాన్మమ తథా శుభం కిన్ను భవిష్యతి॥ 18
అనతిక్రమణీయ స్స్యా ద్యద్యైవ హరివాసరః।
ఉపోషణే ద్వాదశీ చ పారణే తద్వదీరితా॥ 19
హరిభక్తిపరిత్యాగో ద్వాదశీత్యాగతో భవేత్।
యతోఽనుపోషితోభూ యాత్కృత్వా సమ్యగుపోషణమ్
పూర్వం ద్వాదశసంఖ్యాకే పురుషోహరివాసరే।
పాప ముల్లంఘనే పాపాత్ కలుషం జాయతే నృణాం॥21
హరేర్దినస్య పుణ్యత్వాత్ నైవ త్యాజ్యం మనీషిణా।
న చాప్యుల్లంఘితో యస్స్యా త్పుంసస్సుకృతసంచయః
భూరిన్మాంతరకృతం దివసే మధువిద్విషః।
హరేర్దినపరిత్యాగః ప్రతీకారవివర్జితః॥ 23
పుంసః ప్రజావతే పాల మేకస్యాపి బహోర్న కిం।
హరిభుక్తిః పరిత్యక్తా త్యజ్యతాం హరివాసరమ్॥ 24
పుంసాం మమ తతో భీతి ర్మహతీ విద్యతే యది।
హరిభక్తిపరిత్యాగా ద్విహితా పారణాపది॥ 25
విప్రశాపాన్న మే భీతిః కల్పదుఃఖప్రదా అపి।
ద్వాదశ్యాస్తు పరిత్యాగే త్యక్తాస్స్యుర్హరి వాసరాః॥ 26
త్యక్తా తతోఽంతతో భక్తి ర్హరేర్న్యూనా భవిష్యతి।

హరిభక్తి పరిత్యాగాద్విప్రశాపో నరోత్తమ॥ 27
అపి తత్త్యాగరూపేణ మయా త్యక్తా భవేత్స్వనః।
తథా కృతే మయా నూనం హరి స్త్రాతా భవిష్యతి॥28
అంభరీషో విచింత్యైవంమనసైవ మహాత్మనా।
బ్రాహ్మణాన్వేదపురుషాన్ పప్రచ్ఛేదం నృపోత్తమః॥ 29

తొల్లి అంబరీషుండను నొక మహారాజు కలదు. ఆరాజు పరమ భాగవతోత్తముడు, ద్వాదశీవ్రతప్రియుడు. అతడు ప్రతిద్వాదశినాడును తప్పక వ్రతమును జేయుచుండువాడు. ఒక ద్వాదశినాడు ద్వాదశిఘడియలు స్వల్పముగానే యున్నవి. అందుచే నారాజు పెందలకడనే వ్రతమును ముగించి బ్రాహ్మణసమారాధన జేయనెంచి తొందరపడుచు వ్రతము ముగించి బ్రాహ్మణులకు సమారాధనజేయ సిద్ధము గానుండెను. ఆసమయమున నచ్చటకు విపరీతకోపప్రకృతిగలవాడగు దుర్వాసుడు వచ్చెను. అంబరీషుడామహామునిని గౌరవించి యాదరించి ద్వాదశిఘడియలలో పారణచేయవలయును గాన తొందరగా స్నానమునకేగి రమ్మనెను. వెంటనే దుర్వాసుడు తత్సమీపనదికి స్నానార్థమరిగెను. ఎంతకాలము వేచికొనియున్నను దుర్వాసుడు రాలేదు. ద్వాదశిఘడియ లతిక్రమించుచున్నవి. అందుచే నారాజు తనలో ఇంటికివచ్చిన మహామునిని భోజనమునకు రమ్మంటిని. ఆమహాత్ముడు రాలేదు. బ్రాహ్మణున కాతిథ్యమిత్తునని మాటయిచ్చి భోజనమిడకపోవుట మహాపాపహేతువు అది గృహస్థుని మర్యాదయుకాదు. ఆయనవచ్చువరకు వేచియుంటినా ద్వాదశిఘడియలు దాటిపోవుచున్నవి. వ్రతభంగమగును ఈముని మిగులకోపి, రాకుండ పారణ యొనర్చిన శపించును. నాకేమియు తోచకున్నది. బ్రాహ్మణ భోజన మతిక్రమింపరాదు. ద్వాదశిఘడియలు గడువగూడదు గడచి భుజించితినేని హరిభక్తివర్జితుడనగుదు. ఏకాదశినాడున్న యుపవాసము నిష్ఫలమగును. ద్వాదశివిడిచి భుజించిన భగవంతునకును, భోజనాతిక్రమణమున మునికిని కోపము కలుగును. ఈవ్రతమును త్యజించితినా తొల్లిటి జన్మలందును, ఈజన్మయందును జేసిన పుణ్యములును నశించును. దానికి ప్రాయశ్చిత్తమే లేదని యాలోచించి తుదకు బ్రాహ్మణుని శాపమున కెంత

మాత్రము భయమందను. నాభయము నా శ్రీహరియే పోగొట్టును. ద్వాదశీఘడియలలో పారణజేయుటయే యిపుడు యుక్తము. అయినను పెద్దలసలహా చేయుట మంచిదని సర్వజ్ఞులయిన కొందర విద్వాంసుల నాహ్వానించి యిట్లు పలికెను.

దుర్వాసా నాగతో౽ద్యాపి బ్రాహ్మణో యో నిమంత్రితః
కింకరోమి ద్విజశ్రేష్ఠాః ద్వాదశీ చాతివర్తతే॥ 30
బ్రాహ్మణాద్భోజనం పూర్వం ద్వాదశ్యా మప్యతిక్రమః
ఉభయోః కిన్ను మే శ్రేయః తద్వదంతు ద్విజోత్తమాః
ధర్మజ్ఞాశ్చింతయామాసుః గౌరవం లాఘవం తథా॥ 32

ఓ మహాత్ములారా! గతదినంబున నేకాదశియగుట నేను శుష్కోపవాసముండి నేడు స్వల్పకాలపరిమితముగానున్న ద్వాదశీఘడియలలో పారణచేయ నుద్దేశించియుంటిని. ఇంతలో నాయింటికి దుర్వాసమహాముని వచ్చెను. ఆఋషిపుంగవుని భోజనమునకు రమ్మంటిని అంగీకరించి నదీస్నానమునకు బోయి తడవైనను రాలేదు. ద్వాదశీఘడియలు దాటిపోవుచున్నవి. బ్రాహ్మణుని విడిచి ద్వాదశీఘడియలలో భుజింతునా? లేక వ్రతభంగమున కొప్పుకొని ముని వచ్చువఱకు వేచియుందునా? ఈ రెంటిలో నిప్పట్టున నేది శ్రేయస్కరమై, ఆచరణీయమో తెల్పుడని యంబరీషుడు ప్రార్థించెను.

బ్రాహ్మణాః—

ద్వాదశ్యాశ్చ తథా భోక్తు రతిథేర్బ్రాహ్మణస్య చ।
అగ్నిస్సర్వేషు భూతేషు గూఢో౽యం పరమేశ్వరః॥ 33
భుఙ్క్తే చతుర్విధం సర్వ మన్నం స్వాదుక్షుధాతురః।
ప్రాణవాయుప్రసాదేన జఠరే ప్రకటీకృతే॥ 34
వహ్నౌ సంజాయతే జంతోః క్షుధా హ్యన్నాభికాంక్షితః
ప్రాణప్రణున్నో భగవాన్ జాఠరో౽త్ర విభావసుః॥ 35
సంతాపం యత్ కరోత్యేషా క్షుత్పిపాసేతి కీర్తితా।

ప్రాణేన సహిత స్తస్మాత్ వహ్ని స్సుర్వాసురార్చితః॥ 36
సర్వభూతస్థితో యస్మా త్తస్మా త్తం సత్య మర్చయేత్।
అథ శ్వపాకం శూద్రం వా స్వగృహే నాగతం శుభమ్॥
అతిక్రమ్య న భుంజీత గృహమేధ్యతిథిం నిజం।
కింపునర్బ్రాహ్మణం సాక్షాద్వర్ణానాం జన్మతో గురుమ్॥
అవజ్ఞా బ్రాహ్మణస్యేయ మతిథేః పూర్వభోజనం।
గృహస్థ స్త్వతిథిం కృత్వా స్వయ మేవ నిమంత్రితమ్॥ 39
బ్రాహ్మణావజ్ఞయా పుంస స్సర్వమేవ వినశ్యతి।
ఆయుశ్శ్రీశ్చ యశో ధర్మః శ్రేయో౽న్యత్ మనసిస్థితమ్
బ్రహ్మణా కథితా స్సర్వాః దేవతా నాకసంస్థితాః।
దేవతానా మవజ్ఞానా త్సర్వం నామ వినశ్యతి॥ 41
బ్రాహ్మణో జాతిమాత్రేణ దేవవత్కిం తపోయుతే।
విశేష శ్చ పరం సాక్షాద్దూర్వాసస్యాతి తేజసః॥ 42
యద్యప్యేవ న చావజ్ఞాం కురుతే నృపసత్తమ।
తథాపి ప్రథమం విప్రాద్భోజనం న ప్రకీర్తితమ్॥ 43
బ్రాహ్మణస్యాపి సుమహా నన్యాయో౽యం నిమంత్రణే।
ద్వాదశ్యాం ప్రతిగృహ్యాపి తస్మిన్కాలే త్వనాగమః॥ 44
ద్వాదశీ త్యాగత స్త్వత్ర త్వల్పాఘో౽పి హరివాసరః।
హరేర్దినస్య సంత్యాగే ప్రాయశ్చిత్తం న విద్యతే॥ 45
అవజ్ఞానా చ్చ విప్రస్య సమమేతద్ద్వయం తతః।
గౌరవం లాఘవ న్నాత్ర పశ్యామ శ్శాస్త్రదృష్టిభిః॥ 46
అనర్థ స్సర్వ దైవాత్ర భూయాంశ్చ సముపస్థితః।
ద్వాదశ్యాం పారణత్యాగా త్త్వత్తో భక్తిర్హరే స్తథా॥
పారణే తు కృతే నూనం విప్ర శ్శాపం ప్రదాస్యతి। 47

ఇతి సంచింత్య సకలా బ్రాహ్మణా వేదవాదినః।
రాజానమిదమూచుస్తే యథాతథ్యం సమాశ్రితాః॥ 48

అంత నా ధర్మజ్ఞులైన విద్వాంసు లొండొరులుగ చర్చించి, విమర్శించి దీర్ఘాలోచనజేసి యంబరీషునితో, ఓ అంబరీషా! సమస్త ప్రాణికోటుల గర్భకుహరములందు జఠరాగ్నిరూపమున రహస్యముగనున్న యగ్నిదేవు డాకలిని పుట్టించి ప్రాణులు భుజించిన చతుర్విధాన్నమును పచనము గావించి దేహేంద్రియములకు శక్తి నొసంగుచున్నాడు. ప్రాణవాయు ప్రోత్సాహమున నాజఠరాగ్ని ప్రజ్వరిల్లును. అది చెలరేగినంత క్షుద్బాధయు, దప్పికయు కలుగును. అప్పు డన్నజలంబులను తినుట త్రాగుట చేయవలెనను బుద్ధి జనించును. ఆ జఠరాగ్ని తాపమే ఆకలిదప్పికలు. ఆ సంతాపము నన్నోదకంబులతో శాంతిపరుపవలయును, సర్వభూతంబుల గర్భకుహరంబులందు గుప్తముగానుండి తద్భుక్తమును హుతముగావించి శక్తినొసంగువాడగు నగ్నిదేవుడు దేవతలకంటె నధికుడై దేవపూజ్యుడైనాడు. ఆ యగ్నిదేవు నందరు సదా పూజింపవలయును. గృహమేధి తన యింటికివచ్చిన యతిథి నాలగవజాతివాడైనను, పంచముడైనను భోజనమిడుదునని పలికి వానికి బెట్టకుండ తాను తినగూడదు. అందు వేదవేదాంగ విద్యావిశారదుడును, మహాతపశ్శాలియు, సదాచార సంపన్నుడునైన మునిని భోజనమునకు బిలిచి యతనికి బెట్టకుండ తాను తినుట వాని నవమానించుటె యగును. అట్టి పనిచేయువాని యాయుర్భాగ్యములు క్షీణించును. బ్రాహ్మణుల భూదేవతలందురు. కావున బ్రాహ్మణు నవమానించుట దేవు నవమానించుటే. దేవావమానము గావించిన వాని యఖిలంబును నశించును. జాతిచేతనే ద్విజుడు పూజ్యుడు. అందు మహాతపశ్శాలి పూజనీయుడని చెప్పనక్కరలేదు. దూర్వాసునంతవాని నవమానముచేసిన పాపము సామాన్యమా? ఇపు డంబరీషా బ్రాహ్మణుని విడచుటయు నధర్మమే. ద్వాదశిని విడచినవానికింక ప్రాయశ్చిత్త మనునదే లేదు, భోజనార్థము నియమించిన ద్విజునివిడచి భుజించినవానికి నేప్రాయశ్చిత్తములేదు. రెండును సమానములే. ఈ రెంటిలో దేనిని విడువవలయునో, మా కెంతమాత్రము తోచకున్నది. శాస్త్రవిచారణచేసికూడ నిందలి హెచ్చుతగ్గులను గ్రహింపజాలకున్నాము. గొప్పచిక్కు తటసించినది.

బ్రాహ్మణునివిడిచి పారణచేసితివా యతడు శపించును. ద్వాదశి ఘడియలను మీరితివా వ్రతభంగ మగును. అని పలికి యింకను శాస్త్రవిమర్శన చేసి చర్చించి యిట్లని యంబరీషునకు జెప్ప నారంభించిరి.

స్కాందపురాణమందలి కార్తీకమాహాత్మ్యములోని
యిరువది నాలుగవ యధ్యాయము

---

# పంచవింశోఽధ్యాయః

బ్రాహ్మణాః—

రాజన్ ఉభయతః పాశా రజ్జురేషా సమాగతా।
భవతా నరశార్దూల ఘోరా త్వాపా త్పురాకృతాత్॥
వయం న నిశ్చయం క్వాపి గచ్ఛామో నరపుంగవ।
స్వబుద్ధ్యా తు సమాలోచ్య కుర్వన్వ్యంతవ నిశ్చయమ్॥ 2
ఇత్యుక్తో బ్రాహ్మణై రాజా తానాహ స్వాత్మ నిశ్చయం।
హరిభక్తిపరిత్యాగా ద్విప్రశాపోఽవరో ద్విజాః 3
అంభసా కేవలేనైవ కరిష్యే వ్రత పారణం।
ఆహు శ్చాబ్భక్షణం విప్రా హ్యశితం నాశితంచ యత్॥ 4
ఏవంకృతే నచావజ్ఞా బ్రాహ్మణస్య భవిష్యతి।
ద్వాదశ్యా శ్చ పరిత్యాగో బ్రాహ్మణానాం కథంచన॥ 5
ఏవం కృతే న చే చ్ఛాపం దూర్వాసా మేప్రదాస్యతి।
మమజన్మాంతరకృతం క్షీణం పాపం ప్రదాస్యతి॥ 6
ఇతి నిశ్చిత్య రాజర్షి శ్చక్రే నీరేణ పారణం।

ఓ అంబరీషా! నీపురాకృతపాపవశంబున నిట్టి యనర్థము కలిగినది. ఇందు విషయమై మే మెద్దియు నిర్ణయింప నేరకున్నాము. నీబుద్ధి

చేతనే నీవే చర్చించి దీర్ఘముగ నాలోచించి యెట్లొనర్చిన బాగగునో యట్లు చేయుము. మాకు సెలవొసంగుమని పలికి వారు మౌనముద్యస్థులైరి. అంత నంబరీషుడు ఓ విద్వద్వతంసములారా! ఇంత విషమమైనా నిశ్చితాభిప్రాయము నాలింపుడు. ద్వాదశిని విడుచుటకన్న విప్రశాపమధికమైనది. నే నిపుడు భోజనముచేయకుండ జలపాన మొనర్తును. జలపానము భోజనము కాదనియు, వ్రతభంగముకూడ కాదనియు మీవంటి పెద్దలు వచింతురు. జలపానము చేయుటవలన బ్రాహ్మణావమాన మొనర్చినవాడను కాను. ద్వాదశిని విడచినవాడను కాను. ఇపుడు నాకేల దూర్వాసమహాముని శాపమిచ్చును. ఈ ఉదః వ్రతభంగము కాగు. నాతొల్లింటిపుణ్యమా నశింపదు. అని చెప్పి జలపాన మొనర్చెను.

తావతా సమయే నైవ దూర్వాసా భృశకోపనః॥ 7
అంబరీషం మహారాజం లోచనాభ్యాం దహన్నివ।
పశ్యన్నువాచ వచన మిదం కర్ణవిభేదనమ్ . 8
భవతా పారణం రాజన్ అతిథిమ్మాం విహాయ కిం।
అశాస్త్రార్థధియం కృత్వా దుర్బుద్ధ్యాధర్మఘాతినా॥ 9
అహ్నాత్వాతుమలంభుక్తే హ్యదత్వాఽర్ఘ్యంతు కేవలం।
యో నిమంత్ర్యాతిథిం మోహాద్భుక్తే పూర్వం తతోఽధమః
మలాశీ స చ విజ్ఞేయః క్రిమిర్విష్ఠాగతో యథా॥ 11
భుంజతే తే త్వఘం పార్థ యే పచంత్యాత్మకారణాత్।
అతిథ్యర్థం చ పక్వం యే భుంజతే తే త్వఘాదఘమ్॥ 12
పక్వం వా హ్యథవాఽపక్వం పత్రం పుష్పం ఫలం పయః।
అద్య నూనం భవేదన్న మన్నప్రతినిధా స్థితమ్॥ 13
భవానన్న ప్రతినిధిం కృత్వా పాపోఽతిదుష్టధీః।
అద మ్మాం సంపరిత్యజ్య హ్యతిథిం చ నిమంత్రితం॥ 14
విప్రావజ్ఞాకరో మందో విష్ణుభక్తం కథం భవాన్।
అవజ్ఞాం కురుతే నైవ బ్రాహ్మణానాం కదాచన॥ 15

విష్ణుర్దేవం తవ కథం తస్య భక్తికరో భవాన్।
భవతో నాస్తికా ప్యత్ర బ్రాహ్మణే మధుసూదనే॥ 16
భక్తం యతో బ్రాహ్మణం మాంత్యక్త్వా భక్షితవాన్నృప
యథా పురోధస స్స్వస్య మదమోహా న్మహీపతే॥ 17
అవజ్ఞాస్యసి తద్వన్మాం త్వమివ జ్ఞాతవానసి।
ధర్మధ్వజో భవాన్ ధర్మమర్యాదానాం విభేదకః।
పాపాచారః కథం భూమౌ జాతో ధర్మాత్మ నామిహా।
ఏవ ముక్తశ్చ ఋషిణా భియా తం ప్రణిపత్య చ॥ 19

అంబరీషుడు జలపాన మొనర్చిన యుత్తరక్షణమునందే దూర్వాసుండు స్నాన జపతపాదులు నిర్వర్తించుకొని యటకు వచ్చెను. ముని వచ్చినదే తడవుగ మహారౌద్రాకారుడై యతికుపితుడై కన్నులవెంట నగ్నికణములు... రవలు చిమ్ముచు నతికఠినముగ నిట్లు హుంకరించుచు బలికెను. ఓరాజా! నీయింటి కతిథినై వచ్చిన నన్ను భోజనార్థము నియమించి నన్ను విడచి నీవేల భుజించితివి? నీవు దురాత్ముడవు, కుబుద్ధివి, శాస్త్రజ్ఞానహీనుండవు ధర్మపరిత్యాగివి. స్నాన మాచరింపకుండ భోజనము చేసినవాడు మలభక్షకుడగును. అతిథికి పెట్టకుండ తినినవాడును మాంసభక్షకుడు. అతిథి కన్నమిడెదనని పెట్టక తానుమున్ను భుజించినవాడును మలభక్షకుడే. అట్టి యధముడు పురుగై పుట్టును. ప్రతిదినము అతిథి పూజసేయక తినువారును పాపభక్షకులే. అంతికన్నను నతిథికై వండిన పదార్థము నతనికి పెట్టక తినువా రతిపాపాత్ములు. తులసీదళము పుష్పము, పండ్లను తినుటయు, జలపానంబును భోజన తుల్యంబులు. వీనిని భోజనప్రతినిధులని శాస్త్ర చెప్పుచున్నవి. నీవన్న భక్షణ సేయకున్నను తత్ప్రతినిధియగు దాని నారగించితివి. కాన నీవు దుష్టుడవు, బ్రాహ్మణావమాన మొనర్చినవాడవు. ఇట్టియవివేకుని హరిభక్తుడని యెట్లనవచ్చును? శ్రీహరి బ్రాహ్మణావమాన మెప్పుడును జేయలేదు. అట్టివారికి నీవెట్లు భక్తుడ వగుదువు. బ్రాహ్మణు నవమానించుట శ్రీహరి నవమానించుటే. నీవంటి హరినిందాపరు డన్యుడొక్కండు లేడు. నీకన్న బ్రాహ్మణావమానిలేడు. నీవు రాజ్యధనమదోన్మత్తత చే నీయింటికి పిలిచినను పిలవకున్నను పోవుచునుండు పురోహితబ్రా

హ్మణుని తోడివానిగనన్ను జూచితివి. నీవు ధర్మనాశకుడవు ఇట్టియధర్మ వర్తనుడవైన నీ వెట్లు పవిత్రరాజకుటుంబమున జన్మించితివి? అని క్రోధ తామ్రాక్షుడై నోటికి వచ్చినట్లు దూషించు నాముక్కోపిమునిని జూచి గడగడవణంకుచు నెట్లయిన నాతనిని శాంతుని జేయు తలంపుతో నమ స్కరించి యిట్లనెను.

మునిం ప్రసాదయామాస సోఽంబరీష ఇదం వదన్।
పాపోఽహం పాపకర్మాఽహం పాపచేతా శ్చసర్వదా॥
భవంతం శరణం ప్రాప్తం పాహి మాం మునిపుంగవ।
ధర్మమార్గే విమూఢ మ్మాం సీదంతం పాపకర్దమే॥ 21
పాహి మాం కృపయా విప్ర శరణం త్వాం సమాగతం।
అహం క్షత్రియ ధర్మోఽస్మి పాపా జ్ఞానవిమోహితః॥ 22
భవాన్ విప్ర శ్శాంతిసారః తతో మాం పాహి సర్వథా।
బ్రాహ్మణాస్తు క్షమావంతో దయాసారాభవాదృశాః॥
మాదృశా న్పాపపం కేఽస్మి న్పాంతి మగ్నా న్మహాధియః।
ఇత్యాతివాదినం కోపాద్దూర్వాసాః పాదసంస్థితమ్॥ 24
శిరస్యతాడయ ద్భూపం వామపాదేన నిర్ఘృణః।
ప్రాతాడ్య భూమిపం దూరేతస్మాత్ స్థిత్వాఽవద త్త్విదమ్
ప్రబ్రవీచ్ఛావదానాయ ప్రవృత్తోఽతీవ కోపనః।
నాహం కృపాళుహృదయో న చమాం వీక్షతే క్షమా॥
అశాంతిసారసర్వస్వాం దూర్వాసస మవైహి మాం।
అన్యే తే మునయో భూపాః కుపితా శ్శాంతిభాగినః॥ 27
కుపితస్య న మే శాంతి రాసీ దస్తి భవిష్యతి।
అదత్వా దారుణం శాపం కోపహేతుం దురాత్మని॥ 28.
ఇత్యుక్త్వా దత్తవాన్ శాప మంబరీషాయ భూభుజే।
మీనః కూర్మో వరాహ స్త్వం వామనో నికృతానసః

బ్రాహ్మణః క్రూరకర్మా చ క్షత్రియోజ్ఞానవర్జితః।
రాజ్యానర్హక్షత్రియశ్చ మరాచాంరతి స్తథా॥ 30
పాషండమార్గవేత్తాచ బ్రాహ్మణై స్సద్విగర్హితః।
బ్రాహ్మణో బ్రాహ్మణానాంచ ఘాతకో నిర్ఘృణ స్తథా॥
ఇతి తే దశ జన్మాని సంతు పండితమానినః।
పున శ్శాపం ప్రదాస్యామి మా మతిక్రమకారిణః॥ 32
ఇత్యుక్త్వా వ్యాదితే వక్త్రే పున శ్శాపాయ కోపినా।

ఓ మహానుభావా! నేను మహాపాపిని. పాపకర్ముడను. ధర్మహీనుడను. అజ్ఞానముచే పాపపంకమున బడితిని. రాజునగుట నజ్ఞానముచే పాపాత్ముండ నైతిని. నిన్ను శరణు వేడుచున్నాను. రక్షింపుము. ద్విజులకు శాంతము ప్రధానము. మీరు తపోధనులు. దయాదాక్షిణ్యతత్పరులు. నేను మహాపాపిని గాన నన్ను గాపుడని పాదములపైబడి వేడుకొనుచున్న యా రాజును దయాశూన్యుడైన యాముని పెనుగోపంబున తన వామపాదంబుతో శిరసున తన్నెను. అంతతో విడువక నిన్నిదే శపింతుననుచు నుగ్రుడై, ఓపాపీ! నా డెందమున కనికరమనునది లేదు. శాంత మంతకు ముందే పూజ్యము. నన్ను క్రోధమేఘునిగా నెఱుంగుము. నేను కోపప్రధానుడను. కోపజీవనుడను. నాకు కోపము రానేరాదు. వచ్చెనా యిది వఱకెన్నడు శాంతింపలేదు. ఇపుడును నంతియే. ఇకముందుగూడ నంతే. దుష్టునకు శాప మెవడు డీయడు? కావున నిన్నిదె శపించుచున్నాను. నీవిక మీద నొకటవ జన్మమున మత్స్యముగను, రెండవజన్మమున కూర్మముగను మూడవజన్మమున వరాహముగను, నాల్గవజన్మమున సింగముగను, ఐదవ జన్మమున కుబ్జుడుగను, ఆరవజన్మమున క్రూరచిత్తుడగు బ్రాహ్మణుడుగను, ఏడవజన్మమున మూఢుడవైన రాజుగను, ఎనిమిదవజన్మమున రాజ్యాధికారము, సింహాసనాధికారములేని రాజుగను, తొమ్మిదవ జన్మమున సర్వజన నిందితుడగు పాషండుడుగను, పదవజన్మమున బ్రాహ్మణహింసాపరుండై, నిష్కారుణుండైన బ్రాహ్మణుడుగను పుట్టుదువుగాక యని శపించి యంతతోగూడ శాంతింపక వేఱొకశాపమిచ్చు నుద్యుక్తుడగుచుండెను.

అంబరీషస్య హృదయే బ్రాహ్మణో మధుసూదనః॥ 33
స్థితో భక్తప్రియ శ్శ్రీమాన్ శరణాగతవత్సలః।
భక్తం సముపతుం తద్వాచ్ఛాపం విప్రేణ కీర్తితమ్॥ 34
సత్యం కర్తుం ప్రజగ్రాహ స్వయం శాపం ద్విజేరితం।
పున శ్చాతిక్రమం కర్తుం ప్రవృత్తం బ్రాహ్మణోత్తమమ్
దృష్ట్వైవశిక్షితుం దేవో౽ప్యసృజత్ స్వం సుదర్శనం।
అథ జ్వాలాకరానంతసూర్యకోటిసమ ప్రభమ్॥ 36
వ్యాదితాస్యో ముని శ్చక్రం దృష్ట్వా భయముపాగతః
ప్రాణత్రాణాయ సహసాపలాయనపరో౽భవత్॥ 37
తమన్వగచ్ఛద్దుష్ప్రేక్ష్యం జ్వాలావ్యాప్తదిగంతరం।
మహచ్చక్రం మునిస్సో౽పి పర్యగా ద్వసుధా మిమామ్।
సుదర్శనేనానుగతో దూర్వాసా అఖిలం జగత్।
పర్యగా న్నైవకో ప్యాసీత్రక్షక స్తద్భయా దిహ। 39
శక్రాదయో లోకపాలా వసిష్ఠాద్యాశ్చ తాపసాః।
హర బ్రహ్మాదయశ్చాపి శక్తా నాసన్ హి కే౽పి చ॥40
తాపసస్య మునీశస్య కోపసంక్రాంతదుర్ధియః
హరిభక్తావమానేన బభూవ ప్రాణసంకటమ్॥ 41

అంతలో భక్తవత్సలుండును, శరణాగతత్రాణబిరుదాంకితుడును నగు శ్రీమహావిష్ణువు బ్రాహ్మణునిపలుకు వమ్ము గాదని ధ్రువపఱచుటకును, తనభక్తుని కాపాడుటకును, అంబరీషుని హృదయమునజొచ్చి, ఓమునీంద్రా! మీరొసంగినశాప మనుభవింతుననెను. భగవద్భక్తుడును, బ్రాహ్మణారాధన తత్పరుండు నగు నంబరీషుడు శాపానుభవం బంగీకరించినను యాముకొ్ికొపి రాజున కింకను నేదియో హానిదలంచ నుంకించుచుండెను. అపుడు మహావిష్ణువున కామునిపై పట్టరానంతకోపం బుద్భవించి చక్రాయుధమును ప్రయోగించెను. ఆ చక్రాయుధము కోటిసూర్యప్రభాభాసమాన

తేజోవిరాజితంబగుచు నగ్నిజ్వాలలు వెడలగ్రక్కుచు నాతపస్విపైబడ బోగా నాచక్రాయుధము తన్ను జంపునని యమ్ముని ప్రాణములతోపిచే కాళ్ళకు బుద్ధిచెప్పెను. మహాతేజంబుతో చక్రాయుధ మతనిని వెన్నంటి తరిమెను. అట్లు పరువెత్తు నమ్ముంగోపితపస్విని భూలోకమున మహాతపో నిధులైన మునులు గాని, ఇంద్రలోకమున నింద్రాద్యష్టదిక్పాలురుగాని, సత్యలోకమున బ్రహ్మగాని, కైలాసమున శివుడుగాని, కాపాడ నేరరైరి. తపోనిధియైనను కోపోద్రిక్తుడగుట నా దుర్వాసున కిట్టి దుర్భరసంకటము వాటిల్లెను.

స్కాందపురాణమునందలి కార్తీక మాహాత్మ్యములోని
ఇరువదియైదవ అధ్యాయము

---

# షడ్వింశోఽధ్యాయః

అత్రిః —

అథాజగామ వైకుంఠం విష్ణునా పరిపాలితం।
భూరాదినిఖిలాన్ లోకా నటిత్వైవ త్వరాన్వితః॥ 1
త్రాహి త్రాహి జగన్నాథ బ్రహ్మణ్య మధుసూదన।
కరాలధారత శ్చక్రా త్త్వదీయా ద్వజ్రసంభవాత్ 2
ఇదం సుదుస్సహాం విష్ణో సూర్యకోటిసమప్రభమ్।
చక్రం త్వదీయం దుష్ప్రేక్ష్యంహంతు మ్మామేతివార్యతామ్॥ 3
మమ పాపస్య జాతేయం శిక్షా మధునిషూదన।
అంబరీషే మహాభక్తేత్వయి శాపస్య దీపినః॥ 4
బ్రాహ్మణానాం సహస్రేషు యత స్త్వమతిపాతకః।

తతో యామీతి పాపం త్వాం రక్షస్వేదం జనార్దన॥ 5
బ్రాహ్మణస్య పదం విష్ణో తవ వక్షసి తిష్ఠతి।
యత స్తతో మాయా ప్యేత త్కృతం పాపంత్వమీశ్వర॥

అత్రిమహాముని మరల నగస్త్యున కిట్లు చెప్పెను. ఇట్లాదూర్వాసుడు భూలోకంబు మొదలు సత్యలోకంబువఱకుగల లోకంబుల నన్నిటిని తిరిగి యెందును తన్ను రక్షించువారు లేనందున వైకుంఠమునకరిగి, ఓశరణాగత త్రాణపరాయణ బిరుదాంకా జగన్నివాసా! జగన్నాధా! వాసుదేవా! శ్రీనివాసా! రక్షింపుము, రక్షింపుము, నీభక్తుడైన అంబరీషునియెడ నపరాధ మొనరించిన దూర్వాసుడను శ్రీహరీ! నీచక్రాయుధము కోటిసూర్యుల వగిది భాసిల్లుచు నన్ను జంపవచ్చుచున్నది. నేను బ్రాహ్మణుడ నయ్యు ముక్కోపినై మహాపాపినైతిని. నీవు బ్రాహ్మణప్రియుడవు. బ్రాహ్మణుడైన భృగుమహర్షి నీ వెడందయురముపై తన్నినను సహించితివి. అతని కాలిగురుతు నేటికిని నీవక్షమున నున్నది. ఆతనిని రక్షించినట్లే నీ భక్తునకు శాపమిచ్చిన నన్నుగూడ దయతో రక్షింపుము. నిగ్రహానుగ్రహ సమర్థుండవైన నీవుతక్క నన్యులేరును నీచక్రాయుధ జ్వాలలబడి మ్రగ్గకుండ నన్ను గాపాడ శక్తులుగారు. నన్ను రక్షింపు మోజగద్రక్షకాయని మొఱలిడెను.

అత్రిః—

ఏవంవదన్ సోంతము పాగతస్సన్ సాష్టాంగపాతం పురతః
పపాత।
స్వరక్షణాయైవవినీత చేతాస్త్రాహీతి వాక్యంబహుశో మురా
రేః॥ 7

అగస్త్యమహామునీ! దుర్వాసుడు తనకారీతి గర్వపరిహారము కాగా శాంతహృదయుడై శ్రీహరికి దండప్రణామంబులాచరించి ఓదేవదేవా! మాంపాహి, మాధవా! మాంపాహి! యని పలువిధముల కాళ్ళవ్రేళ్ళబడి ప్రార్థించెను.

మునిం దూర్వాససం విష్ణురిద మాహ హసన్నివ।
మునేశ బ్రాహ్మణాద్దైవం మమ నాస్త్రత్య సంశయః॥ 8

భవాదృశా విశేషేణ సర్వదా తాపసోత్తమాః।
భగవన్ శంకర స్సాక్షాత్ భవా న్వై బ్రహ్మరూపధృక్
జ్వలజ్జటాకలాపశ్చ భ్రుకుటీకుటిలం ముఖం।
నిరీక్షక స్త్రిభువనే తవ కో న భయంగతః॥ 10
ప్రకృతేర్వికృతింనైవ ప్రయచ్ఛంతి భవాదృశాః।
బ్రాహ్మణానా మహంనైవ కరోమ్యప్రియమణ్వపి॥ 11
కర్మణా మనసా వాచా తద్భవా న్వేత్తి కిన్ను తత్।
దేవానా మపి విప్రాణాం సాధూనాం చ గవా మపి॥ 12
సుఖాయ సర్వదా దేహాన్ ధారయామి యుగే యుగే।
భవతా తాపసశ్రేష్ఠ కృతం కర్మాతినిందితమ్॥ 13
అంబరీషస్య యచ్ఛాపో దత్తం కారణవర్జితం।
అంబరీషో నరపతిః కర్మణా మనసా గిరా॥ 14
అనిష్టం కురుతే నైవ శత్రోరపి కదాచన।
సర్వభూతేషు మాం పశ్యన్ స్థావరేషు చరేషు చ॥ 15
స్వధర్మనిరతో విప్ర భవతాభ్యర్థితో బహు।
భవా న్నిమంత్రణం తస్య స్వీకృత్యాథ భవాన్మహాన్॥
నచైవాగమనం కాలే నైవానుజ్ఞాం చ దత్తవాన్।
అంభసా కేవలేనైవ ద్వాదశీ తేన సాధితా॥ 17
అంభసో భక్షణే తస్య కో దోషశ్చ మహాత్మనః।
అనాహారేఽపి యచ్ఛస్తం శుద్ధ్యర్థం వర్ణినాం సదా॥
అమునా హి చ తత్ప్రీతం పిపాసోపశమాయ చ।
తదా చ భవతా కోపః కృతో నచ్ఛిద్రవీక్షణాత్॥ 19
యదా శాస్త్రార్థసిద్ధ్యర్థం కృతమంభశ్చ భక్షితం।
తదా తే కేన కోపః స్యాచ్ఛాస్త్రమార్గానువర్తినః॥ 20

ప్రసాద్య బహుధా రాజా భవంత మతికోపినం।
అప్రసన్నే త్వయిగతే దూరం మాం శరణం గతః। 21
సభూతం స్వస్య హృదయే అంతస్థాంబుజవాసినం।
భీత స్త్వత్తో మహాభాగో బ్రాహ్మణా బ్రాహ్మణప్రియః॥ 22
తతో భో భవతా దత్తం శాపం కర్తు న్న చాన్యథా।
యస్మా న్మాభూ ద్వచోఽసత్యం బ్రాహ్మణ స్యాతి తేజసః
అగృహ్ణాం దశజన్మాఖ్యం తదాయాధో నృపోత్తమే।
భవేతి భవతా ప్రోక్తం వా శృణోన్నృపనందనః॥ 24
ఆర్తో మాం శరణం ప్రాప్తో విప్రదుఃఖం మయాకృతం।
ఇతి బుద్ధిం సమాదాయ నిజపాపప్రశాంతయే॥ 25
మదేకమానసో భూత్వా విసస్మార వపుర్నిజం।
తత్కర్ణవివరా త్తస్య హృదయాంభోజసంస్థితః॥ 26
భవేతి వచనం శృణ్వన్ అహం భక్తార్తినాశనః।
భక్తశాపం త్వయాదత్తం స్వస్యబుద్ధి మచీక్లపన్॥ 27
బ్రాహ్మణస్య వచస్సత్యం యది స్యాన్నై వతద్వరం।
మమ భక్తస్య చానిష్ట మితిబుధ్వా ద్విజోత్తమ॥ 28
బ్రాహ్మణాయ వచో మహ్యం స్వభక్తాశ్చ మయా సదా
విప్రశాపోఽపి మే న స్యాద్భక్తానా మితి దర్శయన్ ॥29
అహం శాప మముం విప్రతేన స్వీకృతవానహం।
వ్యసనాని దురంతాని శోకమోహప్రదాని చ॥ 30
సర్వేషాం సర్వదా విప్ర భక్తానాం నాశయామ్యహం।
భక్తశ్చ ధర్మనిరతస్సర్వభూతసమో మమ। 31

విజ్ఞస్యాపి త్వయా శాపోదత్తో వై ధర్మవర్జిత।
ధర్మా నానావిధా వేదే విస్తృతా నరజన్మనామ్॥ 32
దేశ కాలవయోవస్థావర్ణాశ్రమవిభాగశః।
పుంసః స్త్రియశ్చ కేచిత్తు నృజాతేరపి కేచన॥ 33
న త్యాజ్యోనరజాతీనాం ధర్మ స్సర్వై ర్నృజన్మభిః।
సర్వవేదే చ తేష్వేవ ధర్మః పరముదీరితః॥ 34
పక్షయో రుభయోర్న్యూనాం సర్వదా స హ్యవర్జనం।
హరేశ్చ వాసరేష్వేవ త్యాగేదోషోమహాన్ స్మృతః॥ 35
ద్వాదశ్యాతిక్రమే తత్స్యాద్దోషో మద్భక్తఘాతకః।
మద్భక్తిత్యాగతో భీతేః స్వయం చక్రే సపారణం॥ 36
శాపాత్తస్య పరిత్యాగే దోషో మే స భవేదిహ।
ఏవం విచింత్య నృపతిః ప్రవృత్తో దండిత స్త్వయా॥ 37
పునః శాపప్రదానాయ ప్రవృత్తశ్చ మయాఽపి చ।
మాభూత్తవ వచోఽసత్యం తపోరాశేర్మహాత్మనః॥ 38
వ్యాదితాస్యే త్వయితతః చక్రం సంప్రేషితం మయా।
తతో గచ్ఛ నృప బ్రహ్మన్ అతిదుఃఖసమన్వితమ్॥ 39
త్వత్కృతే సంప్రసాదేచ స్వస్తి తేఽత్ర భవిష్యతి।
విప్రవర్య విషాదం త్వం మా వ్రజాఖిలపూజిత॥ 40
అంబరీషే నరపతౌ శాప స్తదవరో మమ।
భవితవ్యం మయా యాహి శీఘ్రం తే రేవాత్ర సర్వధా॥ 41

ఈరీతిగా క్రోధావాంకారములుడిగి మొరలిడుచున్న దుర్వాసునిం గని శ్రీహరి చిరునవ్వు మొగంబున వెలయు, ఓదూర్వాసా! నీవచించిన పగిది నేను బ్రాహ్మణప్రియుండనే. అందు నీవంటి తపోధను అత్యంత ప్రియులు. నీవు ద్విజరూపమున జన్మించిన రుద్రుండవు. ప్రజ్వరిల్లు నీతిహోత్రుని భాతిమందు నీముఖముజూచిన మూడులోకంబులందు వడంకనివా

డుండునా? మీవంటి తపోధనులిట్లు ప్రకృతికి వ్యతిరేకమైన క్రోధము నొందరు. నేను త్రికరణంబులచేగూడ విప్రుల కించుకేని యప్రియమొదవింపని వాడనని నీ వెఱుంగుదువు. ప్రతియుగమునందు నేను దేవబ్రాహ్మణసాధువులకు సంభవించిన యాపదల తొలగింప నక్కాలమునకు దగిన రూపమున నవతరింతును. కారణము లేకుండ నీవంబరీషుని శపించితివి. శత్రువునకుగూడ నెన్నడు నారాజు మనోవాక్కాయకర్మలచే కీడొదవింపడు. చరాచరరూపంబగు నీప్రపంచమున ప్రాణికోటియందు నాతడు నారూపము నే జూచుచుండును. ధర్మయుక్తముగ ప్రజాపాలనజేయుచుండును. అట్టి నాభక్తుని నీ వనేకవిధంబుల నిందించితివి. తన్నితివి. శపించితివి. అతని యింటికతిథివై నీవు వేళకురావైతివి. ద్వాదశిఘడియలు గడచులోపున నేను రాకుంటినేని నీవు పారణచేయుమని యైన జెప్పవైతివి. అతడు వ్రతభంగమునకు భయపడి నీరాకకై చూచిచూచి జలపానము మాత్రమే చేసెను. అందువలన నపరాధమేమికలదు? చాతుర్వర్ణములవారికి భోజననిషిద్ధదినములందుగూడ జలపానము దాహశాంతికిని, పవిత్రతకును, చేయదగినదేకదా? జలపాన మొనరించి నంతమాత్రాన నాభక్తునిపై మండిపడి శపించితివి. అతడు వ్రతభంగమగునని జలపానము చేసెనుగాని నిన్నవమానించు నుద్దేశముతో జేయలేదు. శాస్త్రప్రకార మొనరించిన యాతనిపై నీవంతగా మండిపడనేల? నీవట్లు మండిపడుచున్న కొలది నతడు నిన్నెంతయో బ్రతిమాలి శాంతిపఱుపజూచెను. ఎంతవేడినను నీవు క్రోధముడుగనందున నన్ను శరణందెను. నేనపుడు విప్రరూపమున నారాజు హృదయమున బ్రవేశించి నేనే తానై యుంటిని. బ్రాహ్మణప్రియుడైన యారాజు నీవు శపింతువని భయమందుచుండెను. తపోనిష్ఠాగరిష్ఠుండవగు నీవాక్కు వ్యర్థము కాకుండుటకును నాభక్తుని కాపాడుటకును నేనాతని హృదయకుహరమునజొచ్చి నీవిచ్చిన పదిజన్మముల శాపమును ననుభవింతునని యన్నవాడను నేనే. నీశాప మన్యథా చేయనశక్యమైనది. ఆసమయమున నంబరీషుడు నీవలన భీతిల్లి నన్ను శరణుగోరుటలో నిమగ్నుడైయుండెను గాని తనదేహము తానెఱుంగు స్థితిలో లేడు. అందుచే నీవొసంగిన శాపంబు నతడు వినలేదు. నేనే యతని హృదంతరాళమునజొచ్చి వింటిని కాని నాభక్తునకు నీవిచ్చిన కాని నాభక్తునకు నీవిచ్చిన శాపమును నే ననుభవింప నంగీకరించితిని. విప్రవచనము, అందును నీవంటితపశ్శాలివచనమును

వ్యర్థము చేయుటు త్తమము గాదని తలంచితిని. నాభక్తులకు కష్టములు వాటి ల్లిన నే సహింపజాలను. నాభక్తులు బ్రాహ్మణశాప మనుభవింపతగనివా రగుట నేనట్లు చేసితిని. అంబరీషుడు మద్భక్తాగ్రగణ్యుడు. నిరపరాధి. దయాశాలి. ధర్మతత్పరుడు. అట్టివాని నకారణంబుగ శపించితివి. మాన వులలో బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రు లనెడి నాల్గుజాతులవారికి స్త్రీపురు షులకు, వేదములందు ప్రత్యేకముగ నానాధర్మములును చెప్పబడినవి. అవి త్యజింప దగినవికావు. ఆధర్మములు చతురాశ్రమములందున్న చాతు ర్వర్ణములవారికి దేశకాలానుగుణ్యముగను, వయోవస్థల ననుసరించియును వచింపబడినవే గాని యొకేవిధముగా జెప్పబడలేదు. హరివాసరమున నా ధర్మము లత్యాజ్యములు. అట్లు త్యజించినవారు మహాపాతకులగుదురు. భోజనార్థము నియమించిన విప్రున కిడక తానుదినుట దోషము. ఏకాదశి నా డుపవాసముండి మఱునాడు ద్వాదశిఘడియలలో పారణచేయనివాడు భక్తిహీనుడగును. నాయందలి భక్తిని విడనాడుటయు దోషమేయగును. అందుచే నిందేది చేయుటకును దోచక నాభక్తిని త్యజింప నిష్టములేక నారాజు ద్వాదశిఘడియలు దాటిపోవునని జలపాన మొనర్చెను. జలపా నము బ్రాహ్మణాతిక్రమణ మెట్లగును? వ్రతభంగము కాదు. అని చిం తించి యిట్టి సూక్ష్మధర్మము నెఱింగి న్యాయముగ ప్రవర్తించిన రాజును శపించితివి. అంతటితో నాగక నింకను వేఱుశాప మీదలంచితివి. ఈ శాప మొకటియే చాలుననియు, తపోధనుండవగు నీశాపము వ్యర్థము కా గూడదనియు మదినెంచి వే ఱుపాయములేక నాచక్రము నంపితిని. మద్భ క్తుడగు నారాజు నీవు వానియింట నాతిథ్య మందనందుల కెంతయో గుందుచున్నాడు. నీవిపుడె యాతనికడకరిగి యతని మనస్తాపంబు పోగొట్టి సంతుష్టునిగా జేసితివేని నీకు శ్రేయంబగును. వేఱువిధంబున గానేరదు. అతనిని శపించినందులకీవు కించపడకుము. ఆశాపమును నే ననుభవించువా డను. ఆపది పుట్టువులను నేను లోకోపకారార్థముగ నుపయోగించువా డను. అవెట్లని యందువేని వినుము.

కల్పేఽస్మిన్నర్తమానేహి జగతః స్థితికారణాత్।
అహం శంఖవధార్థాయ రక్షణాయ మనోరపి॥ 42

మహీమిమాం భవిష్యామి ప్రలయేఽవంతరే సతి।
సురాసురాణా ముదధిం మథ్నతాంమందరాచలం॥ 43
కూర్మస్స ధారయిష్యామి స్వకే పృష్ఠే వినాశినీం।
హిరణ్యాక్షస్య నాశాయ భూమే రుద్ధరణాయ చ॥ 44
వరాహోఽహం భవిష్యామి మహానీలాచలోపమః।
హిరణ్యకశిపుం హంతుం నృసింహో వికృతాననః 45
భవిష్యామి క్రోధవహ్నిజ్వాలావ్యాప్తదిగంతరః।
వామనోఽహం భవిష్యామి లోకత్రయజిగీషయా॥ 46
బలిబంధాయ శక్రస్యహృతరాజ్యార్పణాయ చ।
జామదగ్న్యశ్చ రామోఽహం క్రూరికర్మా ద్విజోత్తమః
భవిష్యామి క్షత్రియణా మభవాయ మహాబలః।
రావణస్య వినాశార్థం రామో రాజీవలోచనః 48
భవిష్యామి నృపస్తస్మా దాత్మజ్ఞాన వివర్జితః।
పునశ్చ యాదవే వంశే కృష్ణః కమలలోచనః॥ 49
గోపీజారో భవిష్యామి జ్ఞానినాం ధురి సంస్థితః।
బుద్ధో నామ దితేః పుత్రః పాషండాద్యుపదేశకః॥ 50
కలికాలే భవిష్యామి పాపమోహాయ కేవలం।
అశ్వారూఢః కల్కినామా తథా విష్ణుయశస్సుతః॥ 51
కలేరంతే భవిష్యామి విప్రో విప్రారిఘాతకః।
ఇతి మే దశ జన్మాని పాతితాని శ్రితాని చ॥ 52
సంస్కృతాన్యపి సర్వేషాం సద్యః పాపౌఘహాని చ।

నీశావవచనములలో మొదటిది మత్స్యజన్మము. వేనీకల్పమున మనువును రక్షించుటకుగాను శంఖుడను రాక్షసుని జంపమత్స్యమునై పుట్టుదును. పిదప కొలదికాలమునకు దేవాసురులు క్షీరసాగరమును మధించుటకు మంధరమును కవ్వముగా జేతురు. ఆ పర్వతము మునుగకుండ కూర్మరూపమున

నాభిపున నాపి ధరింతును. వరాహ జన్మమెత్తి హిరణ్యాక్షునిజంపి భూమి నుద్ధరింతును. హిరణ్యకశిపునిసంహరించి మద్భక్తుడగు ప్రహ్లాదుని రక్షించు టకు నరసింహరూపమును దాల్తును. బలిచే స్వర్గమునుండి పారదోలబడిన యింద్రునకు తిరిగి స్వర్గరాజ్యమిచ్చుటకు వామనరూపమునపుట్టి బలిచక్ర వర్తి నడంచెదను. భూభారమును దీర్చుటకు క్షత్రియులనుజంప బ్రాహ్మ ణుడనై జన్మించి క్రూరకర్ముడనై భూభారము హరింతును. లోకకంటకు డైన రావణునిజంపి లోకోపకార మొనర్చుటకు రఘువంశమున రాము డనైపుట్టి, ఆత్మజ్ఞానశూన్యతతో మయామానుష విగ్రహుడ నగుదును. పిదప యదువంశమున శ్రీకృష్ణుడను మానవరూపము ధరించి గోపికా రతీలోలుడ నయ్యును విజ్ఞానవంతులలో నగ్రగణ్యుడ నయ్యెదను. కలి కాలమున దితియను నామెకు బుత్రుడనై పుట్టి బుద్ధుడను నామమునవెలసి పాపకర్మలందు మోహముగలిగించుటకు దుష్టాత్ములకు పాపధర్మముల నుపదేశింపగలను. కలియుగాంతమున విష్ణుయశుడను విప్రునింట పుత్రుడనై జన్మించి కలికియను పేరున నశ్వారూఢుండనై పరిభ్రమిం చుచు బ్రహ్మద్వేషుల నందఱను సంహరింతును. నీవంబరీషమహారాజునకు శాపరూపముగా నిచ్చిన పదిజన్మలను నేను మత్స్యకూర్మనరాహాద్యవతార ముల నెత్తుదును. ఈమత్స్యావతారాది దశావతారములు స్మరించినవారికిని, విన్నవారికిని నిఖిలపాపంబులు హరించును.

స్కాందపురాణమునందలి కార్తికమాహాత్మ్యములోని
యిరువదియారవ అధ్యాయము

---

# సప్తవింశోఽధ్యాయః

అత్రిః —

ఇత్యుక్త్వా తం పునః ప్రాహ భగవాన్ పురుషోత్తమః
స్వభక్తపాలనాధిక్యం ప్రశంసన్నివ కుంభజ। 1

మరల నత్రిమహాముని అగస్త్యున కిట్లని వచించెను. ఓ కుంభసంభవా! శ్రీమన్నారాయణుం డామూర్వాసుని భక్తునికంటె నెక్కుడుగ లాలించి తిరిగి యిట్లనెను.

శ్రీభగవానువాచ—

ప్రాప్తా న్యేవ త్వయా విప్రశాపవ్యాజేన భూభుజే।
తత్త్వాని మే పరం తోషం కుర్వంత్యత్ర న సంశయః॥ 2
అనేన న చ మే క్లేశ అతోఽహం బ్రాహ్మణోత్తమ।
తవ సత్యం తు కుర్వాణో వచనం వేదసమ్మితమ్॥ 3
అన్యథా చేత్ బ్రాహ్మణస్య మర్యాదా నైవ వర్తతే।
ఇమమేవ పునశ్శాపం ప్రాప్స్యమ్యానందకారణమ్॥ 4
గచ్ఛ శీఘ్రం తత్రైవాస్తే రాజా ప్రాయోపవిష్టవత్।
ఆత్మానం నిందయన్నిత్యం బ్రాహ్మణైః పరివారితః॥ 5
ధిక్ భూపం దుష్టబుద్ధిం తు విప్రోపద్రవకారిణమ్।
మన్నిమిత్తం యతిశ్చక్రం మునిం త మనుధావతి॥ 6
గవార్థే బ్రాహ్మణార్థే చ సద్యః ప్రాణాన్పరిత్యజేత్।
యస్మాద్రాజా తు నృపతిః యస్య ముఖ్యం హి రక్షణమ్॥
రాజా చతుర్విధాన్ జీవాన్పాలయేత్ సాధుచేష్టితాన్॥
నిగృహ్ణీయాత్పరాం త్సద్యస్సర్వాన్బ్రాహ్మణవర్జితాన్॥
బ్రాహ్మణో బ్రాహ్మణైరేవ నిగ్రాహ్యో వేదవాదిభిః।
సత్యధర్మాదినిరతైః లోభదంభవివర్జితైః। 9
త్యాజ్య ఏవభవే ద్విప్రో విప్రాణా మపి పాపకృత్।
ప్రాయశ్చిత్త మకుర్వాణో దండ్యస్తత్ర తతః పరం॥ 10
వపనం ద్రవిణాదానం స్థాననిర్యాపనం తథా।

క్రూర కార్యస్య విప్రస్య కార్యం నాజ్ఞానినా పరమ్॥ 11
బ్రాహ్మణో బ్రాహ్మణాదశ్చేత్ కురుతేహింసనం ఖలః
తథాపి దండధారీ తం న హన్యాచ్చ కదాచన॥ 12
స్వస్యానిష్టం ప్రకుర్వాణో రాజ్ఞా ధర్మానుగామినా।
సమాగత శ్శస్త్రపాణి ర్బ్రాహ్మణస్య కదాచన॥ 13
భయలేశవిహీనశ్చ క్షాత్రకీర్తిముపాగతః।
నాన్యస్మిన్విప్రవధతో యతో దోషో మహాన్ స్మృతః॥
యదర్థం హన్యతే విప్రో యేన కాపి న హన్యతే।
స్వయం వాన్యేనవాస్యస్య బ్రహ్మహా స్మృతిదర్శనాత్॥
ఆకృష్ట స్తాడితో వాపి ధనై ర్వా విప్రయోజితః।
య ముద్దిశ్య త్యజేత్ప్రాణాన్ సోఽపి బ్రాహ్మణఘాతకః
మదర్థ మాగతం హ్యేతద్వ్యసనం ప్రాణహారకం।
దూర్వాససో బ్రాహ్మణస్య తతోహం బ్రహ్మహాధ్రువమ్
ఇత్యాదివచనా ద్రాజా భృశం తిష్ఠతి దుఃఖితః।
గచ్ఛ త్వం తత్ర తే స్వస్తిభూభుజశ్చ భవిష్యతి॥ 18

అత్రిః—

వైకుంఠస్య వచః శ్రుత్వా నమస్కృత్య క్షుణాన్మహః।
సార్థం చక్రేణ నృపతిం ప్రత్యగా ద్బ్రాహ్మణై ర్వృతమ్
త మాయాంతం సమాలోక్య మునిం భాస్కర తేజసం।
అంబరీషో నరపతి ర్నమస్కృత్యేదమబ్రవీత్॥ 20

ఓదూర్వాసమునీ! నీ వంబరీషునకిచ్చిన శాపరూపంబులగు దశజన్మలును నాకు పరమసంతోషప్రదంబులైనవి. నాకీ యవతారముల నెత్తుట కష్టముగాదు. తపశ్శాలివగు నీమాట వ్యర్థముకా నిష్టములేక నిందులకొడంబడితిని. కానిచో విప్రులకుగౌరవముండ నేరదు. భక్తపాలనము, విప్రవచన

మసత్యము కాకుండ జేయుట నాకు సమానసంతోషప్రదములు. నీ వంబరీషునింట నాతిథ్య మందక వచ్చినందుల కాతడు చింతాక్రాంతుడై తన్ను దానిందించుకొనుచు బ్రాహ్మణపరివృతుడై ప్రాయోపవేశ మొనర్చినాడు. నేను కారణముగ దూర్వాసుని విష్ణుచక్రము బాధింపదలిల్లినది. కావున నేను మహాపాపిని. గోబ్రాహ్మణుల కాపద గల్గించినవా డాత్మఘాతము చచ్చుటమేలు. ప్రజారక్షణమే రాజధర్మముగాని ప్రజాపీడనము కాదు. సద్వర్తనముగల స్థావరజంగమాత్మకమైన నాలుగు తెగల జీవులను రాజు రక్షింపుచు దుష్టులను శిక్షింపవలెను. రాజునకు బ్రాహ్మణహింసచేయుట కూడనిపని. బ్రాహ్మణుడు దుష్టుడైనచో వానిని జ్ఞానులగు బ్రాహ్మణులే శిక్షింపవలెను. ఒకబాపడు పాపుడైన వానికి వేఱొక బాపడే ప్రాయశ్చిత్త మొనర్చి శిక్షనేర్పాటు చేయవలెను. అపరాధియగు బ్రాహ్మణుని శిరసుగొరిగి వాని సర్వస్వము గ్రహించి దూరదేశమునకు పారద్రోలవలయును. ఈపనిని వివేకవంతులైన ద్విజులే యొనర్పవలెను. గాని తదన్యులన్యనజ్ఞానులు చేయరాదు. ఒకవేళ విప్రుడు వేరొక విప్రుని బాధించినను, హింసించినగాని విప్రుడే వానిని దండింపవలెను. ధర్మయుక్తముగ గానిపాలన మొనరించు క్షత్రియుం డొకవేళ విప్రుడపకృతి యొనర్చినను వాని నెన్న డాక్షత్రియుడు దండింపగూడదు. ధనుర్బాణములను ధరించి నిష్కారుణుండై యాని సేయవచ్చిన విప్రునిగాక తదన్యుని రాజు లెప్పుడును శిక్షింపరాదు. క్షత్రియునకు విప్రహింసకంటె పాతకమేలేదు. విప్రుని హింసించినవాడును, హింసచేయించినవాడును బ్రహ్మహంతకులని న్యాయశాస్త్రము లుద్ఘాటించుచున్నవి. అంతియేగాక విప్రుని సిగబట్టి యీడ్చువాడును, కాలితో తన్నినవాడును, విప్రద్రవ్యాపహారియును, విప్రుని గ్రామాంతరమునకు పారదోలినవాడును, విప్రపరిత్యాగ మొనరించినవాడునుగూడ బ్రహ్మహంతకులే యగుదురు. మహాతపశ్శాలియు, విప్రోత్తముండును నగు నీ దూర్వాసునకు నామూలమున నిపుడీప్రాణసంకటము సంఘటిల్లినది. కావున నేనును బ్రహ్మహంతకుడ నైతి నని పలువిధంబుల పరితపించుచు నంబరీషుడు తన్ను తానే నిందించుకొనుచు పరితాప మందుచున్నవాడు, కావున వెంటనే నీ నాభూమీశునికడ కరుగుము. మీ యుభయులకునుగూడ శాంతి చేకూరునని పలికెను.

అంబరీషః—

క్షమ్యతా మద్య భో చక్ర హంతు మాం త్వం న చార్హసి।
పాలయాద్య న హంతవ్యమతిక్రార్యేణ కర్హిచిత్॥ 21
త్రాహీతి వాదినం మాం చ బ్రాహ్మణం శరణాగతం॥
ఏవం వద న్మునిం రాజా బాహుభ్యాం వరిషస్వజే॥ 22
పశ్చాత్తం పృష్ఠతః కృత్వా విప్రం తస్థౌ నృపస్స్వయం
విస్ఫారితధను శ్చాసౌ సమ్ముఖో భయవర్జితః॥ 23
అంబరీష ఇదం వాక్య ముక్త్వాం శ్చ సుదర్శనమ్.

శ్రీ భగవాను డిట్లు బలుక దూర్వాసుడు రమాధవుండగు మాధవునకు పలుమారు వంగివంగి నమస్కరించి చక్రము వెంబడింప బ్రాహ్మణపరివృతుండగు నంబరీషునికడ కేగుదెంచెను. అపు డంబరీషుండు సుదర్శన చక్రమును గాంచి యిట్లనెను.

స్కాందపురాణమునందలి కార్తీక మాహాత్మ్యములోని
యిరువది యేడవ యధ్యాయము

---

# అష్టావింశో ఽధ్యాయః

అంబరీషః—

తిష్ఠ తిష్ఠ నమస్తేఽస్తు సుదర్శనహరిప్రియ!
బ్రాహ్మణోఽయం ముదా త్రాహి నైనం హంతు మిహార్హసి॥ 1
అహం జీవం తు దాస్యామి భవతే వధకారిణే।
బ్రాహ్మణస్య వధం ముంచ తూర్ణం యుధ్యస్వ వా మయా

యద్యపి త్వం హరే స్సాక్షా దవ్యాహత మహాయుధం।
యత స్తతోఽసి మే దైవం త్వయా యోత్స్యే తథాప్యహమ్
క్షత్రియస్య న మే యాచ్ఞా విహితాఽత్ర స్వయంభువా
వినా యుద్ధం తత స్త్వత్తో యాచ్యతే దైవ మాత్మనః॥ 4
జానే త్వాం నిఖిలైర్వ్యాప్తై రజేయం చాత్మనో బలం।
తథాపి పద్య తే చక్ర బలం జ్ఞానాద్వయోత్థితమ్॥ 5
మాం చ త్వాం పుర సర్వాంశ్చ విష్ణునాగహితాస్సురాః।
మయా నిపాతితం భూమావాయుంచ తే సత్క్షణా దమమ్॥ 6
యది తే జీవన స్యేచ్ఛా బుద్ధిర్యాది హరేః కరే।
తదా పాహి విముం చైనం విప్రం మాం శరణం గతం॥

అంబరీషుండు దూర్వాసుని వెన్నంటి వచ్చిన చక్రాయుధమును గాంచి ఓ సుదర్శనచక్రమా! నీకిదె ప్రణామము. ఈవిప్రుని సంతసముతో రక్షింపుము. ఈ మునిని జంపు తలంపు గలిగినేని నన్ను జంపి యీవిప్రుని గాపాడుము. లేక యుద్ధము చేయదలంచితివేని నాతో యుద్ధము చేయుము. నీవు శ్రీమన్నారాయణుని కప్రతిహతాయుధం బగుట శ్రీవిష్ణువునట్లు నాకు పూజనీయుడవు గావున నీతోని సేయుదలంచిన విప్రసంరక్షణార్థము నీతోనని సేయుగలను. పరమేష్ఠి క్షత్రియునకు యుద్ధభిక్షతప్ప నితరవిషయికమగు యాచ్ఞావృత్తి విధింప లేదు. అట్లయ్యును విప్రసంరక్షణార్థము నాకు పూజనీయుడవగు నిన్ను యుద్ధభిక్ష నర్థించుచున్నాను. దేవాసురాది భూతకోటులన్నియుం గూడి నను నిన్నెమియుం జేయజాలవని నే నెఱుంగుదును. నాభుజబలము నెఱుంగుదును నీయందును తాను హేతువై నాయందును విష్ణుశక్తి సమముగ నున్నది. విష్ణుశక్తితోడుగ యుద్ధము చేయు మనల నిద్దరను సర్వదేవతాసంఘంబును పరికించుగాక. నిన్ను నేను జయింపగలను. జీవితాశగాని, హరిహస్తపద్మమందుండవలెనను వాసనగాని నీకున్న నీవిప్రుని రక్షింపుము. నీకు శరణార్థినైన నన్ను గాపాడుమనియెను.

అత్రిః—

ఇతి స్తుత్వాతి సంతుష్ట ఆ దేవేశం తం సుదర్శనః।
అత స్తస్య పరీక్షార్థం కోపావిష్ట ఇవ స్థితః॥ 8
మయాహతం యజ్ఞనిఘ్నే దనుం కైటభసంయుతం।
అన్యేఽపి చ తథాద్రాత్యా అజేయా స్సకలైస్సురైః॥9
అస్య దూర్వాససః కోపాత్ ప్రభూతకోటిభిః మయాక్షితం।
మాం విహాయ జగత్యస్మిన్ ప్రాణినో హింసితుం క్షమః।
స ఏషోఽద్య మయా నీతో దశాం మేనాం వినిందితాం।
బ్రాహ్మణ్యం చ శాంకరం తేజోభిర్భత్సర్త్యః సుదుస్సహామ్
శంకరాత్తేజసో జాతం క్షత్రసంహారకాద్భువి।
మత్తోఽధికం న తద్బ్రాహ్మ్యమతిక్రాంతం క్వచిత్ప్రభుః
క్షత్రతేజోయుత స్త్వంగోప్త ధర్షితో బ్రహ్మతేజసా।
శక్తః కిం త్వం మయా యోద్ధుం తేజోద్వయవిరోధినా॥
రాజ స్త్వబలవతా సంధిః కార్య స్సర్వ త్తు కౌశలార్థినా।
స త్వం మార్గస్య ముపాశ్రిత్య మాం యోద్ధుం కేవ సంస్థితః
హరే భక్త స్త్వ మిత్యేత స్మృత్వా తేషాంత వానహాం।
సంభ్రమం యాహి శీఘ్రం త్వం మా ప్రాణాన్ సంత్యజ॥

సుదర్శనచక్ర మాయంబరీషుడొనర్చిన పొగడ్తల నాలించి లోలోన నానందమందియు నతనిని కోపనటన గావించుచు నిట్లనెను. ఓయంబరీషా! అత్యంతపరాక్రమశాలులైన మధుకైటభులను రక్కసులను, దేవతలందరు అనుగూడి జయింపలేని యితర రక్కసుల ననేకులను నేనే చంపుట నీవెఱుంగుదువుగదా! ముక్కోపియగు నీముని నీపై నలిగి కనులెఱ్ఱజేసి పెదవులువిఱచి తీక్ష్ణవీక్షణములు నీమీద బరపినప్పు డీలోకమున నాకన్న నన్యులెవరును జూడలేరు. కావుననే వీనికిట్టి సంకటము కలిగించితిని. ఇతడు రుద్రాంశసంభవుడు. బ్రహ్మతేజస్సంపన్నుడు. ఆరుద్రతేజము భూలోక

మందలి రాజులను జంపగలదు గాని నాకంటె నెక్కువైనది కాదు. బ్రహ్మరుద్ర తేజోధికమైన హరితేజస్సున కాశ్రయమగు నాతో బ్రహ్మతేజస్సుకంటె తక్కువైన క్షత్రియతేజసుగల నీవు నన్నెదిరింపగలవా? ఎదిరి తనకన్న బలవంతుడైనపుడు తన శ్రేయముకై యతనితో సంధి కోడంబడుట మంచిది. కాని పోరాటమునకుదిగుట మంచిది కాదు. నీవజ్ఞానివై యేతలంపుతో నాతో నని సేతునంటివో యెఱుగ లేకుంటిని. నీవు విష్ణుభక్తుడవుగాన మన్నించితిని. నీవనాలోచితముగా తొందరచెంది నాతోదలపడితివా జీవితాశవదలుకొను మనెను.

ఇతి తద్వచనం శ్రుత్వా కోపసంరక్తలోచనః।
అంబరీష ఇదం వాక్యముక్తవాంస్తం సుదర్శనమ్॥ 16
సుదర్శన తవాస్మాకం దేవస్యాస్యాయుధం వరం।
ఇతి మత్వా మయా బాణైశ్శతధా నాత్ర కారితః॥ 17
ఇతః పరం గౌరవం మే నూనం నాశం గమిష్యతి।
క్షాత్రధర్మముపాశ్రిత్య భాషసే యో మయా సహ॥ 18
బాణాన్మము చ హంస్తే తాన్ స్వాత్మగర్వవినాశకాన్।
క్షాత్రం ధర్మముపాశ్రిత్య యస్త్వం గర్వముపాగతః॥19
నాహం విప్రేషు దేవేషు స్త్రీషు జ్ఞాతిషు గోషు వా।
శూరస్త్వమిహ దేవోఽసి తేనజీవపి మే పురః॥ 20
దేవత్వం సంపరిత్యజ్య క్షత్రేణ పురతో మమ।
స్థితో గృహాణ మే బాణాన్ దుస్సహానగ్ని సన్నిభాన్॥
ఇత్యుక్త్వాఽథ ముమోచాస్య పాదయో రుభయోరపి।
చతుర్వింశతిసంఖ్యాకాన్ బాణా జ్వలనవర్చసః॥ 22
సుదర్శనస్తు తం దృష్ట్వా తస్య పౌరుష మద్భుతం।
క్షాత్రం చ పరమప్రీత ఇద మాహా హసన్నివ॥ 23

అంబరీషు డాపలుకులాలించి, ఓ చక్రాయుధమా! నీవు నాకిష్ట దైవమగు వాసుదేవునకు ప్రధానాయుధమగుట నుపేక్షించితిని. గాని లేనిచో నిన్ను నూరువ్రక్కలుచేసి యుందును. ఇక నీగౌరవము నిలువదు. నీవు క్షత్రియధర్మావలంబనంబున గర్వించి మాట్లాడుచుంటివి. నాబాణములు నీగర్వము నణంచగలవు. నేను గోదేవబ్రాహ్మణజ్ఞాతులందును తరుణులందును దుష్టుండనై ములుకు వేయను. నీవు దేవతవగుట నీపైన బాణప్రయోగము చేయజాలను. కావున నే నీవింతకాలము బ్రతికితివి. దేవరూపంబువిడచి క్షత్రియరూపము ధరించి యగ్నిసమములై సహింప నశక్యములైన నాబాణములను సహింపుమని చెప్పుచు నాచక్రాయుధపాదములపై నిరువదినాల్గు శరంబులను బ్రయోగించెను. చక్రాయుధ మాయంబరీషుని యవక్రవిక్రమంబునకును, రాజధర్మమునకును, సాహసమునకును మిగుల నాశ్చర్యమంది యతనికి నవ్వుచు నట్లు చెప్పెను.

సుదర్శనః—

రాజన్ తవైవ రక్షార్థం విష్ణునా ప్రేషితోఽస్మ్యహం।
విముక్తోఽయం మయా విప్ర స్తవ యశ్శరణాగతః॥ 24
ఇత్యుక్త్వా సంపరిత్యజ్య ధనుర్బాణసమన్వితం।
పపాత సహసా భూమౌ నమ శ్చక్రే కృతాంజలిః॥ 25
నృప స్తదానతం చక్రం వినీతః కుంభసంభవ।
క్వాహం క్రిమి స్సంసృతిమధ్యవర్తీ।
క్వ త్వం హరే ర్దేవకరాంబుజస్థః॥ 26
ఏవం విజాన న్నపి తే పురస్తాద్యుద్ధార్థమాగాం తదిదం క్షమస్వ, సావజ్ఞయా తేఽత్ర సమాగతోఽహం యుద్ధాయ సాక్షాద్ద్యుతిమం ప్రమత్తః॥ 27
క్రూరం నిజం క్షత్రియధర్మ మేవం నసాదయ న్మే తదిదం క్షమస్వ, వక్షస్స్థితోఽయం దివసశ్చ తద్వ త్సంగ్రామభూమి ర్మకర మానః॥ 28

ఇచ్ఛన్ స్తుతిం కేవల మాగతో౽హం, త్వత్తస్స్తుతం కేవలమాత్మదైవం, జ్వాలాకరాలం నిఖిలైరసహ్యం దైత్యైస్సదేవైరపి రూపమేతత్॥ 29 నేహా సురాహాః కథ మద్యచాహం, గిరస్త్వచ్ఛ్యాదప్యధికాన్త కాంతిం॥

బింబారవే రగ్నిసహస్రయుక్త, మావర్తకోటీరపి కుర్వదత్ర, యుద్యాప్రవజత్తే భవేః థంచి ద్రూపం పరం తేఽఖిలమర్దకస్య, దంష్ట్రాః కరాళం వదనం త్వదీయం వహ్నిస్త్వమత్వర్వాతి ఏవ దిగ్భ్యః॥ 31

ద్రష్టుం చ శక్తః కతమో౽పి వీరో, దేవాసురాణామధిపః పరోవా, యద్యత్ర విద్యుద్రవిరశ్మిమాలా భవేయు రేకత్ర కరాలరోషా॥ 32

తథా౽పి తే తేజసి నాగమాః స్యు. స్సర్వస్య తేజోభిభవే పరేశ, భవంత మాశ్రిత్య సదా కరాళం, విష్ణుస్త్రిలోకస్థితయే ప్రవృత్తః॥ 33

న జీయతే కైరపి భూరిసత్త్వై, ర్దేవైః పరైర్వాఽపి తాం ప్రయోగాత్రైః, నమో౽స్తు తే దైత్యవినాశకాయ, తథైవభక్తస్య చ రక్షణాయ॥ 34

విష్ణోరనంతద్యుతి సేవితాయ, ప్రాణప్రయాణార్తిహరాయ మేద్య॥

ఇతి స్తువంతం రాజానం భూమకా నిపతితం తథా॥ 35

ఉత్థాప్య ప్రేరయామాస స్వస్తి తే౽స్త్వితి కీర్తయన్।

ఇత్థం సుదర్శనస్తోత్రం త్రిసంధ్యా యః పఠేచ్ఛుచిః॥ 36

సర్వాపద్భ్యో విముచ్యేత చిరం సుఖ మవాప్నుయాత్।

య శ్శృణోతీద మధ్యాయం సకృద్వా మానవః క్షితౌ॥
స సర్వత్ర సుఖం ప్రాప్య తతో యాతి శుభాం గతిమ్॥

ఓ అంబరీషా! శ్రీమన్నారాయణుండు నిన్ను రక్షించుటకే దూర్వాసునితోఁగూడ నీకడకంపెను. ఈముని నిన్ను పొందుటవలననే వీనిని చంపక విడిచితిని. అని చెప్పుచు ధనుర్బాణంబులను దాల్చియున్న వాఁడగు నంబరీషుని కౌఁగిలించుకొని యారాజునకు నమస్కరించెను. ఓకుంభసంభవా! ఆరీతి తనపై దయను, వినయాదిధేయుతలను జూపి తన్ను కౌఁగిలించుకొన్న సుదర్శనచక్రాయుధంబునకంబరీషుండు, ఓ సుదర్శనచక్రమా! సంసారమునందు కీటకముపగిది పడి పొర్లాడు నీచుఁడనైన నేనెక్కఁడ? శ్రీమహావిష్ణుని హస్తపద్మమున నిరంతరము భూషణమువలె నొప్పారు పుణ్యరాశివగు నీవెక్కఁడ? ఈహస్తమునక ప్రమాణాంతర మెఱిఁగియుండియు నిన్నెదిరించి నీపై బాణప్రయోగ మొనరించినందులకు నన్ను క్షమింపవలయును. నేను నీతో యుద్ధముచేయుట నిన్ను జయింతునను నాసతోఁ గాని నిన్నవమానించు తలంపుతోఁ గాని కాదు. బ్రాహ్మణుని రక్షించుట రాజధర్మములలో ముఖ్యమైనది కావున దూర్వాసుని రక్షింపు దలంపుననే నీతో యుద్ధమును చేయ బూనితిని. అంతేగాక యీమకరమాసమున శుక్లపక్షమందు విప్రసంరక్షణకుగాను నాకు పూజనీయుఁడవగు నీతో యుద్ధముచేసి యందుమరణించిన ముక్తికలుగునని తలంచి పోరాడితిని. నాతప్పు మన్నింపుము. దేవాసురాదులకు తేరిచూడజాలని దివ్య తేజోజ్జ్వలితవగు నీముందు సామాన్యమానవమాత్రుఁడనైన నేనెంతవాఁడను. వేలకొలది యగ్నిదేవతలును, కోట్లకొలది సూర్యమండలములు నేకీభవించినను నీకు సమానము కానేరవు. భయంకరమైన పిడుగులును, సంతాపకరంబులగు సూర్యకిరణరాసులునుగూడ యొక్కచోనున్నను నీ తేజస్సే వానియన్నిటికన్న నెక్కుడు. నీవు నిఖిలతేజోరాశివి. శ్రీమహావిష్ణువునకు నీవు ముఖ్యాయుధమగుటవలననే యా 'వాసుదేవుడు లోకకంటకులును, లోకకంపితులునైన రాక్షసానీకమును జంపి లోకత్రయమును రక్షింపుచు దేవదేవుఁడై యున్నాఁడు. నీమూలమున నా తేజోమూర్తి నెవ్వరును జయింపలేరు. మహాబలపరాక్రమ సంపన్నులుగూడ నాయాదిదేవుని జయింపజాలరు. అతనితో వైరము పూనజాలరు. భక్తరక్షకా! నీకిదే నమ

స్కారము. రాక్షససంహారకా! నీకిదే కోటివందనంబులని తన పాదముల పైబడి స్తుతించు నంబరీషుని చక్రాయుధము దయార్ద్రహృదయముతో లేవనెత్తి యిట్లనెను. ఓ అంబరీషా! నీసద్గుణంబులకును, నీవు నన్ను కొనియాడిన స్తుతులకును మిక్కిలిగ నానందించితిని. నీకు సకల శ్రేయంబులగు గాక! నీవు నన్నొనరించిన యీస్తోత్రమును మూడుకాలము లందును పఠనజేసినవారి కష్టములన్నియు నశించును. దీనిని వినువా రీలోకంబున సకల శుభంబుల నంది పరమందు వైకుంఠమున ముక్తి నొందుదురు.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
యిరువది యెనిమిదవ యధ్యాయము

---

# ఏకోనత్రింశో உధ్యాయః

అత్రిః—

సుదర్శనః స్వయం చాగాదంతర్ధాం తస్యపశ్యతః।
అంతర్ధానం గతే తస్మిన్ విష్ణుచక్రే సుదర్శనే॥ 1

అత్రిమహాముని మరల నగస్త్యునిం జూచి, ఓ అగస్త్యమునీంద్రా! ఆసుదర్శనచక్రమట్లు చెప్పి యంబరీషుడు చూచుచుండగనే యంతర్ధానమయ్యె నంత,

రాజా తస్మై నమస్కృత్య బహుభక్తిసమన్వితః।
వవందే శిరసా పశ్చాద్దూర్వాసంచాప్యకల్మషమ్॥ 2
ఆహ చైతత్ప్రహృష్టాత్మా మునిం భక్తిసమన్వితః।
స శిరః పాదయోస్తస్య కృత్వాஉధస్తా న్నృపుంగవః॥ 3
పాపినం పాపపంకేஉస్మిన్ సీదంతం గృహమేధినం।
మాం సముద్ధర విప్రేంద్ర గృహాణాన్నం గృహే మమ॥
కృతావతాஉద్య భవతా రక్షితోஉస్మి న సంశయః।
పునరాగమనం యస్మా దధునా మే గృహే కృతమ్॥ 5

కా నామ లోకతో భీతి ర్జగతో భయదాయినః।
భయవ్యాజా త్స్వన శ్చాగా ద్రక్షితుం కేవలం హిమామ్
పున ర్దర్శనదానేన స్వాత్మనాఽభయదానతః।
ప్రాణదానం కృతం తద్వ త్పరలోకస్య రక్షణమ్॥ 7

సుదర్శనచక్ర మంతర్ధానమైన తర్వాత నంబరీషుండు దూర్వాస మహాముని పాదములకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి తన శిరంబు నాముని పాదంబులపైనిడి, ఓమునితిలకా! నేను సంసారమార్గము నందున్న యొకసామాన్య గృహస్థుడను. మహాపాపిని. నాగృహమం దాతిథ్యమును స్వీకరించి నన్ను ధన్యాత్మునిగా నొనర్చి కృతార్థునిగా జేయుడు. నీవు దయార్ద్రహృదయుడవు కావున నే మరల నాగృహంబున నడుగిడితివి. నీకు భయము పడనివా డీజగంబున లేడు. నీకెవరివలనను భయములేదు. నన్ను రక్షించి తరింపజేయుటకే మరల నాయింటికి వచ్చితివి కాని సుదర్శనచక్రాయుధమునకు భీతిల్లి కాదు. చక్రాయుధమునకు నీవు భయపడి నటుల నటించితివి కాని యది నిజముగా భయము కాదు. ఓ మహానుభావా! నీవు నాకు పునర్దర్శన మొసంగి, నాకభయదానమిచ్చి, నాయసువులను నిల్పితివి కావున నాకిహపరలోక సుఖములను సంభవించునటుల జేసితివి. అని మునిని ప్రార్థింపసాగెను.

అత్రిః—

ఇతి బ్రువాణం రాజానం బాహుభ్యాం మునిస త్తమః।
సంప్రహృష్టేన మనసా స ముత్థాప్యేద మబ్రవీత్॥ 8

దూర్వాసః—

ప్రాణానాం రక్షక శ్చాస్త్రే పితేతి పరికీర్తితః।
భవతా రక్షితాః ప్రాణాః మమ తేన పితా భవాన్ 9
మయా కృతే నమస్కారే భవాన్ దుఃఖముపావ్రజేత్।
పితా మే త్వమతో నాహం నమస్కారం కరోమి తే॥ 10

మయాఽపి సుమహాన్ క్లేశో బ్రహ్మణ్యస్య కృతో నృప।
తత్ఫలం సుమహజ్జాతం మమ నాస్త్యత్ర సంశయః॥ 11
ఫలం చ తస్య పాపస్య సంప్రాప్తం వినివారితం।
భవతా నరశార్దూల బ్రహ్మజ్ఞేన కృపావతా॥ 12
భోక్ష్యే చ భవతో గేహే మహారాజ త్వయాసహ।
ఇత్యుక్త్వా భోజనం చక్రే తం ముని ర్భూభుజా సమమ్॥
అంబరీషేణ ధర్మజ్ఞో ధర్మజ్ఞేన కృపావతా।
సాక్షాచ్ఛివస్స దూర్వాసా వైష్ణవస్య మహాత్మనః 14
తస్య భక్తిపరీక్షార్థం గత్వా తమభినంద్య చ।
అనుజ్ఞాతోఽంబరీషేణ స్వాలయం ప్రయయౌ మునిః॥ 15

ఈ రీతిగా దనపాదపద్మంబులపైబడి ప్రార్థించు నంబరీషుని దూర్వాసుండు లేవనెత్తి, ఓరాజోత్తమా! శాస్త్రములు బాధానివారణ గావించి ప్రాణములను గాపాడినవాడు తండ్రియని వక్కాణింపుచున్నవి. నీవు నాకు చక్రాయుధంబువలన గలిగిన సంకటములను దొలగించి నాప్రాణములను నిలిపితివి. కావున నాకు దండ్రివైతివి. నేను నీకు నమస్కరించినచో నది నీకు దుఃఖహేతువగును. అందుచే నీకు ప్రణామంబు చేయుట మానితిని. పరమనిష్ఠాగరిష్ఠుండవగు నీకు మనస్తాపమును గలుగజేసితిని. నీవంటివానికి నేఘటిల్లజేసిన కష్టమునకు తగిన గొప్పకష్టము నాకు వెనువెంటనే ఘటిల్లినది. ఆకష్టమును కరుణార్ద్రహృదయుండవగు నీవే తొలగించి రక్షించితివి. పరమాత్మజ్ఞానయుతుండవును, భూతదయాపరుండవునైన నీగృహంబున నీపంక్తిని గూర్చుండి యాతిథ్య మంగీకరింతును అని ధర్మవేత్తయైన దూర్వాసుండానాడు బ్రహ్మజ్ఞానసంపన్నుండును, దయాతిశయుండునైన నంబరీషునింట నాతని సరసను గూర్చుండి తృప్తికరంబుగా విందారగించెను. రుద్రుని యపరావతారమైన దూర్వాసుండు విష్ణుభక్తాగ్రగణ్యుండును, పూతచరిత్రుండును, మహాత్ముండునైన యాయంబరీష

వుడు కార్తీకశుద్ధ ఏకాదశినాడు శుష్కోపవాసముండి పగలెల్ల హరినామ సంకీర్తనాదులచే గడపి రాత్రియంతయూ పురాణపఠనశ్రవణాదులచే జాగరణంబుచేసి, ద్వాదశినాడు శక్తికి తగినటుల శ్రీహరి ప్రీతికొఱకు దానంబు లొనర్చి, బ్రాహ్మణులతోగూడ పారణజేయుఁడో యాతడానవుడు చేసిన పాపములు ప్రాయశ్చిత్తములేనివేయయ్యు నీవ్రతప్రభావంబువలన సంపూర్ణముగ నశించును. ద్వాదశి ప్రీతికరంబగుట నాదినమున ద్వాదశిఘడియలు స్వల్పకాలమున్నను, ఆఘడియలు దాటకుండగనే పారణ జేయవలయును. వైకుంఠమున నివాసముండదలంచినవాడు ద్వాదశిని విడువకూడదు. ఏకాదశీ వ్రతమాచరించిన పుణ్యాత్ములే ద్వాదశిని త్యజింపగూడదు. హరిని ప్రబోధించు కార్తీకశుద్ధద్వాదశి సర్వవిధముల నతిక్రమింపగూడదు. ఇందు విషయ మావంతయేని సందియముపడరాదు. కార్తీకమాసమున నేకొంచ పుపాటిపుణ్యంబు నొనర్చినను నది మహాఫలమిచ్చితీరును. మిగుల పుణ్యప్రదంబగు నీయంబరీషుని చరితంబును భక్తిశ్రద్ధలతో జదివినవారును, వినినవారును, అన్నివిధంబులయిన పాపంబులనుండి విడువబడినవారై యీ లోకమున నాయురారోగ్యభాగ్య సంతానసంపదలతో తులతూగుచు సర్వసుఖంబుల ననుభవించి పరలోకమునం దుత్తమగతి నొందుదురు.

స్కాందపురాణమునందలి కార్తీక మాహాత్మ్యములోని
యిరువది తొమ్మిదవ అధ్యాయము

---

# త్రింశోఽధ్యాయః

ఋషయః—

సూతేన కథితం పుణ్యం మాహాత్మ్యం మాధవస్య చ।
భూయో వయం శ్రోతుకామాః కార్తికస్యవ్రతస్య చ।
కలౌ కల్మషచిత్తానాం తథా రాగాత్మయాయినాం।

మహారాజు భక్తిని పరీక్షింపవచ్చి సాంగతిగా నతని భక్తిని పరిశోధించి, యతనికి దేవబ్రాహ్మణభూతగణాదులందుగల భక్తికిం తయును మెచ్చుకొని సంతసించి యామహారాజుకడ సెలవంది తన యాశ్రమంబున కరిగెను.

తస్మాద్దూర్జే మునిశ్రేష్ఠ ద్వాదశీ హరిబోధినీ।
సమస్తదానఫలదా సర్వతీర్థఫలప్రదా॥ 16
సర్వేషామేవ యజ్ఞానాం ఫలదా హరిబోధినీ।
యశ్శుక్లైకాదశీం పుణ్యాం కార్తికే మునిసత్తమ॥ 17
ఉపోష్య జాగరం కృత్వా ద్వాదశ్యాం బ్రాహ్మణైస్సహ
కృత్వా దానాని యో భక్త్యా పారణం తు సమాచరేత్
స సద్యో ముచ్యతే నూనం పాపైర్నిష్కృతివర్జితైః।
యది స్వల్పాభవేత్పుణ్యా ద్వాదశీ విష్ణువల్లభా॥ 19
నాతిక్రమ్య హరేర్భక్తైర్వైష్ణవైర్లోక కాంక్షిభిః।
తత్రాపి కార్తికే పుణ్యా ద్వాదశీ హరిబోధినీ॥ 20
నాతిక్రమ్యా మునిశ్రేష్ఠ సర్వథా నాత్ర సంశయః।
కార్తికే సితద్వాదశ్యాం యత్కృతం తన్మహత్ఫలమ్॥
య ఇదం పుణ్య మాఖ్యానం శృణోతి శ్రద్ధయాఽన్వితః।
సర్వాఘౌఘ వినిర్ముక్తః పుత్రపౌత్రసమన్వితః॥ 22
భుక్త్వా భోగాననేకాంశ్చ తతో యాతి పరాం గతిమ్

ఈవృత్తాంతమంతయు కార్తీకశుద్ధ ద్వాదశీదినంబుననే నడచినది. అగస్త్యమునీ! ద్వాదశీవ్రతప్రభావమెంత యుత్కృష్టతకలదో గ్రహించితివా? ఆదినంబున శ్రీమహావిష్ణువు క్షీరసాగరమునందున్న శేషశయ్యనుండి లేచి సుప్రసన్న మనస్కుడుగా నుండును కావున నాతిథి కంతప్రతిభయు, మహిమయు గలిగినవి. ఆనాడు చేసినపుణ్యము దానములన్నింటిని జేసిన సత్ఫలమును, యజ్ఞము లనేకము లొనర్చిన ఫలము నొసంగును, ఏమాన

సంసారాంబుధిమగ్నానా మనాయాసేన కా గతిః॥ 2
కో ధర్మ స్సర్వధర్మాణా మధికో మోక్షసాధనః।
కో దేవ స్సర్వదేవేషు గుణద్రుతఫలప్రదః॥ 3
కేన వా రాయతే మోహః కర్మణా మునిసత్తమ।
మానవా మందమతయో మృత్యుపాశే నియంత్రితాః
జనా తత్స్మిన్ కలౌ తేషా మనాయాసేన కా గతిః।
ఏతత్సర్వం యథాఽన్వచ్ఛ బ్రూహి గోవింద సత్కథామ్

శౌనకుడు మొదలగు మహామునులందరును సూతుండు వచించిన విష్ణుమహిమ నాలించి, విష్ణుభక్తుల ప్రతిభను శ్లాఘించి మరల సూతుని గాంచి, ఓ సూతమునీంద్రా! కలియుగమునందు మానవు లరిషడ్వర్గమునకు వశులై, పాపచిత్తులై సంసారసాగరమునుండి తరింప లేకుండిరి. అట్టివారు సులభముగా తరించు నుపాయ మెద్ది? ధర్మము లన్నింటిలో మోక్షసాధన ధర్మ మేది? దేవతలందరిలో ముక్తి నొసగునట్టి దేవు డెవడు? అజ్ఞానమును రూపుమాపగల పుణ్యకర్మ మెద్ది? కలియుగమునందు మందమతులై మృత్యు వాతంబడు మానవులకు సులభముగ మోక్షము లభించు మార్గ మెద్ది? హరి కథాశ్రవణమును నిరంతరము గోరు మాకీ సంశయములు దీరునట్లు విస్తరించి వచింపుమని యడిగిరి.

సూతః—

మునయ స్సాధు పృష్టోఽహం భవద్భి ర్విష్ణుకీర్తనం।
సంస్మారితం జగద్భద్రం సర్వలోకసుఖావహమ్॥ 6
భవద్భిర్యత్కృతః ప్రశ్నో మర్త్యానా మల్పమేధసాం।
తన్నిర్వాణాయ కల్పోఽత్ర శ్రోత్రానందకరః పరః॥ 7
శ్రుతం హితాయ జంతూనాం లోకోపహితకారకం।
లోకోపకారిణో యూయం క్రతుభి ర్భూరిదక్షిణైః। 8
యత్ఫలం పుణ్యతీర్థాదిస్నానదానాదికర్మభిః।
తత్ఫలం యాంతి విప్రేంద్రాః సద్గిరా నాత్ర సంశయః॥ 9

శృణుధ్వం మృపయో యూయం ఊర్జే శ్రుత్యుదితంఫలం
మురారిప్రీతిసంబోధకారణం కార్తికవ్రతమ్॥ 10
సారం సారతమం వక్ష్యే సర్వశాస్త్రేషు సత్తమాః।
బహ్వత్ర ఫలమాఖ్యాతుం న సాకల్యమహం క్షమః॥ 11
సంక్షేపాదభిధాస్యామి కైటభారికథాం ద్విజాః।
కైటభారికథాసక్తాః తరంతి భవసాగరమ్॥ 12
నిగ్గచ్ఛత్యధికం ఘోరం నితరాం నిరయాస్పదం।
కార్తికే కేశవం భక్త్యాతులాసంస్థే దివాకరే॥ 13
స్నానం విష్ణ్వర్చనం దానం దీపప్రజ్వాలనం నిశి।
నరః కృత్వా విముచ్యేత వృజినై రార్జితైర్జవాత్॥ 14
తులారాశిం గతే సూర్యే తదారభ్యానురాగతః।
ప్రాతః ప్రతిదినే మాస మేకం విష్ణుపరాయణః॥ 15
య ఆచరేద్వ్రతమిదం జీవన్ముక్తస్స ఉచ్యతే।
బ్రాహ్మణః క్షత్రియోవాపి వైశ్యః శూద్రః స్త్రియోపివా
న కార్తిక వ్రతమిద మాచరంతి నరాధమాః।
తే యాంత్యంధతమం సత్యంకులైరపి న సంశయః॥ 17
కార్తికం ప్రాప్య కావేరీసలిలేయో నిమజ్జతి।
న కేశవపురం యాతి స్తూయమానోఽమరాదిభిః॥ 18
కార్తికే మాసి సంప్రాప్తే స్నాత్వా సంపూజ్య కేశవం।
స పుమాన్యాతి వైకుంఠం మానవో ముక్తకిల్బిషః॥ 19
యే నాచరంతి విప్రేంద్రాః కార్తికోక్తం వ్రతం శుభం।
చండాలయోనిం తే యాంతి జన్మసాహస్రకేషు చం

అంత సూతుం డాప్రశ్నల నాలించి, ఓమహామునులారా! మీరడిగినప్రశ్న ప్రశస్తమై, లోకోపకారకమై యున్నది. కలియుగమునందలి

మందబుద్ధులగు మానవులు సంసారసాగరము నుత్తరించుటకు మీచే నడుగబడిన ప్రశ్న యందఱకును మోక్షసాధనోపాయము కాగలదు. మీరు గొప్పగా దక్షిణలిచ్చి క్రతువులొనర్చి జనుల ననేకుల నానందపఱచుచున్నారు. గాన లోకోపకారులుగ నున్నారు. సజ్జనునిపలుకు సమస్త పుణ్యక్షేత్ర తీర్థములందు మునింగిన ఫలమును, అనేక మహాయాగము లొనర్చిన ఫలమును, దానాది సత్కర్మలొనర్చిన ఫలమును చేకూర్చును. కార్తీక వ్రతము విష్ణు ప్రీతికరము. సారవంతములగు నన్నిటికంటె సారవంతమని పురాణములన్నియు చాటి చెప్పుచున్నవి. కార్తీక వ్రతఫల మిట్టిదని వచింప శక్యముకానిది. ఐనను సంగ్రహముగ చెప్పెదను. హరికథలను విను నాసక్తికలవారికి నరకబాధలుండవు. జన్మరాహిత్యమగును. కార్తీక మాసమున నాచరింపవలసిన కార్యము ను చెప్పుచుంటిని. ఈమాసమున సూర్యుడు తులా రాశియం దున్నప్పుడు హరిప్రీతికరముగ నదీస్నాన మాచరింపవలయును. హరిహరుల నర్చింప వలయును. శక్తినిబట్టి దీపదానము చేయవలెను. రాత్రి దేవాలయమున దీపారాధన చేయవలయును. ఈ నాలుగువిధంబులైన పనులు చేసినవారు సకలపాపములు పరిహరింపబడినవారగుదురు. సూర్యుడు తులారాశియందు ప్రవేశించినదాది నెలదినము లీవిధముగా జేసినతరువాత జీవన్ముక్తులగుదురు. చాతుర్వర్ణములవారిలో స్త్రీపురుషులలో నెవరుగాని చేయగలిగి యుండియు నీప్రకారము చేయకపోవంరి కెడతెగని నరకప్రాప్తి యగును. కార్తీకమాసమున కావేరీనదిలో స్నానమొనరించినవారు విష్ణుసాయుజ్య మందుదురు. శక్తికలవారయ్యు వ్రతము చేయలేని నూరుపుట్టువులు చండాలురుగ జనింతురు.

కీర్తితః కార్తికః పుణ్యః సర్వమాసోత్తమః స్మృతః।
సర్వపాపప్రహరణం కార్తికస్య వ్రతోత్తమమ్॥ 21
విష్ణుప్రీతికరం పుణ్యం దుర్లభం త్వకృతాత్మనాం।
యః కార్తికే తులాసంస్థే మార్తాండే మానవః కృతా॥22
స్నానం దానార్చనం హోమం పరిచర్యాం మధుద్విషః।
స నరః సర్వదుఃఖేభ్యో విముక్తోఽమృతమశ్నుతే॥ 23
దీపదానం కాంస్యదానం దీపప్రజ్వాలనం హరేః।

ధాన్యం ఫలధనం యస్తు ప్రదద్యాత్ కార్తికే వ్రతే॥ 24
ఆఢ్యోవాపి దరిద్రోవా యః ప్రీత్యై శార్ఙ్గధన్వనః।
ఊర్జే మాసి మునిశ్రేష్ఠాత్ కథాం శ్రావ్య మహత్ఫలం
సర్వపాపప్రశమనం సర్వసంపత్సుఖావహం।
సర్వోత్కృష్టం ఫల మితి మాహాత్మ్యం కార్తికస్య చ।
ఇదం యశ్శృణుతే పుణ్య మధ్యాయ మ్మాధవప్రియః।
సుఖం చైవం సమాసాద్య సశ్చైవాన్తే పరం సుఖమ్॥

అన్ని మాసములందును కార్తికమాస ముత్తమోత్తమమైనది. ఈ వ్రతమువలన సకలపాపంబులు నశించునని చెప్పబడినది. పుణ్యాత్ములకు మాత్రమే యీవ్రతముచేయ నవకాశము లభించును. కాని పాపాత్ములకు కలుగదు. సూర్యుడు తులారాశి యందుండగా కార్తికమాసమున స్నానదానములు, విష్ణుపూజ, శివకేశవుల కత్యంత ప్రియంబగు మంత్రజపము, హోమము, దేవాలయమున పురాణపఠనము, దీపదానము తప్పక చేయదగిన సత్కార్యములు. దీపముంచుట కశక్తుడైననూ ఇతరులుంచిన దీపమును ప్రజ్వరిల్ల జేయవలెను. ఇట్లు చేసినవారు సర్వపాపములు నశించి తుదిని మోక్షమందుదురు. కార్తీకమాసమున ధాన్య, ఫల, హిరణ్య, గృహ కన్యాదానము లొనర్చిన నెన్నటికిని తరుగని మహాపుణ్యము లభించును. ఈ మాసమునందు ధనవంతుడైనను, పేదవాడైనను సర్వదా హరిని వర్ణించు కథలను వినవలయును. తత్కథాశ్రవణంబువలన పుణ్యలోకంబులబ్బును. పాపములన్నిటిని బాయజేయునదియు సమస్తసంపదలను చేకూర్చునదియు సర్వసౌఖ్యంబులను సిద్ధింపజేయునదియు అన్నిటిలోను నుత్కృష్టమయినదియు శ్రీమన్నారాయణున కత్యంత ప్రియతమమయినదియునగు కార్తీక మహాత్మ్యమును వినువారిహలోకమునందు సమస్త సుఖముల ననుభవించి తుదిని విష్ణుసాయుజ్య మందుదురు.

స్కాందపురాణమునందలి కార్తీకమాహాత్మ్యములోని
ముప్పదియవ అధ్యాయము
పూర్ణము

# ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్ వారి

## నవలలు

| | | | |
|---|---|---|---|
| సీతారామరాయలు (సీతారామ) | | 2 | 0 |
| రాజసింహ | | 1 | 0 |
| మృణాళిని | | 1 | 8 |
| విషవృక్షము | | 1 | 8 |
| మృణ్మయి | | 1 | 8 |
| కృష్ణకాంతుని మరణశాసనము | | 1 | 8 |
| శ్రీకృష్ణచరిత్ర (భాగవతకథాసారము) | 1 భాగము | 1 | 8 |
| డిటో | 2 భాగము | 1 | 8 |
| కమలాకాంతుడు | | 0 | 8 |
| రజని | | 1 | 0 |
| శకుంతల | | 1 | 0 |
| వంగవిజేత | | 1 | 8 |
| పూర్ణానందము | | 2 | 0 |
| నౌకాభంగము | 1 భాగము | 2 | 0 |
| డిటో | 2 భాగము | 2 | 0 |
| దృఢప్రతిజ్ఞ | | 1 | 8 |
| వసుమతీవసంతము | | 2 | 0 |
| నూర్జహాన్ | | 2 | 0 |
| అపరాధిని | | 1 | 8 |
| అల్లాహో అక్బరు అను ధర్మసామ్రాజ్యము | | 1 | 8 |
| ప్రణయచాంచల్యము | | 1 | 8 |
| జమీందారు రామరాజు | | 1 | 8 |

# శ్రీ మహాభారతము : వచనము

## మంతిని లక్ష్మీనారాయణశాస్త్రి ప్రణీతము

18 పర్వములు — 16 సంపుటములు

| | | | |
|---|---|---|---|
| ఆదిపర్వము | 4 | 0 | 0 |
| సభాపర్వము | 1 | 0 | 0 |
| అరణ్యపర్వము 1 వ భా॥ | 3 | 0 | 0 |
| ౙిటో 2 వ భా॥ | 3 | 0 | 0 |
| విరాటపర్వము | 2 | 8 | 0 |
| ఉద్యోగపర్వము | 3 | 0 | 0 |
| భీష్మపర్వము | 3 | 0 | 0 |
| ద్రోణపర్వము | 3 | 0 | 0 |
| కర్ణపర్వము | 3 | 0 | 0 |
| శల్యపర్వము | 1 | 8 | 0 |
| సౌప్తికపర్వము | 0 | 12 | 0 |
| స్త్రీపర్వము | 0 | 8 | 0 |
| శాంతిపర్వము | 4 | 8 | 0 |
| అనుశాసనికపర్వము | 3 | 0 | 0 |
| అశ్వమేధపర్వము | 1 | 8 | 0 |
| ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు | 1 | 4 | 0 |

పూర్తి సెట్టు వెల 37—8—0

దొరుకువారు :—

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి